వేదుల శకుంతల

# ఆర్తి




జయంతి పబ్లికేషన్స్
దిల్‌సుఖ్ నగర్, హైదరాబాద్ - 60

**AARTHI**
by
**VEDULA SHAKUNTALA**

**First Edition :**
December, 1977
(EMESCO Publications)

**Second Edition :**
15th August, 2001.
(JAYANTHI Publications)




**Cover Design :**
BAPU

**Price :** Rs. 50/-

**r Copies :**
SALANDHRA BOOK HOUSE, Hyderabad.
and all its branches.
and
VEDULA SHAKUNTALA
Flat No. 141, Block No. 11,
Aravind Avenue, Janapriya Apartments,
Ramanthapur, Hyderabad.
Ph : 7035338

**Type setting, Printed and Published by**

**JAYANTHI PUBLICATIONS**

**19-90, P&T Colony, Dilsukh Nagar, Hyd - 60. Ph : 4161057.**

# అంకితం

సమాజంలోని ఎందరో

'శ్యామల' లాంటి వారికి

ఆర్తితో . . .

# 'ఆర్తి'
# నవలపై ప్రముఖుల స్పందనలు

నవల ఆద్యంతమూ పాఠకులను ఆకట్టుకుని ఉత్కంఠతో చదివించేదిగా ఉంది. హృద్యంగమమైన సన్నివేశాలు చదువరులను కదిలించి వేస్తాయి. సందర్భానుసారమైన వర్ణనలు, సరళమైన సంభాషణలు రంజింపజేసేవిగా ఉన్నాయి. సాధారణంగా మగవాడిలో లోపాలుంటే ఆడది సర్దుబాటు చేసుకోవడం మనందరికీ తెలుసు. కానీ ... ఈ నవలలో రచయిత్రి మగవాడి చేత ఆడ బ్రతుకును తీర్చి దిద్ది, వ్యక్తిత్వాన్ని నిలబెట్టాలని ప్రయత్నించడం ప్రశంసనీయం. రచయిత్రి అభినందనీయురాలు. 'ఆర్తి' నవల కలకాలం నిలిచే మంచి రచన.

**- కీ॥శే॥ డి. రామలింగం**

ప్రముఖ సాహితీ విమర్శకులు.

వేదుల శకుంతల గారు మా అమ్మగారికి అభిమాన రచయిత్రి. శకుంతల గారి నవలలు ఏ ఒక్కటీ ఆవిడ చదవకుండా వదిలిపెట్టరు. ఈ 'ఆర్తి' నవల తనకెంతగానో నచ్చిన నవల అని నాతో పదే పదే అంటుంటారు.

**- మాలతీ చందూర్**

ప్రఖ్యాత రచయిత్రి

"అబ్బ ... ఈ 'ఆర్తి' నవల ఎంత బాగుందో ..!! మతి స్థిరం లేని 'శ్యామల' పట్ల అత్తవారింటి వాళ్ళు ప్రవర్తించిన విధానం నా మనసుని ఎంతగానో కదిలించింది."

**- ఐ.వి.ఎస్. అచ్యుతవల్లి**

ప్రసిద్ధ రచయిత్రి

"నవలంటే ఇలా ఉండాలి. ఎన్నో నవలలు చదువుతుంటాం ... ఎందుకూ ?! ఈ 'ఆర్తి' నవలలా వైవిధ్యంగా ఉండే నవలే చాలాకాలం జ్ఞాపకముంటుంది."

**-గోవిందరాజు సీతాదేవి**

ప్రసిద్ధ రచయిత్రి.

**మ**తి స్థిమితం లేక అయోమయావస్థలో ప్రపంచజ్ఞానం లేని ఒక అమాయకురాలైన భార్యకు సర్వం తానై సేవలందించి, మామూలు మనిషిగా తీర్చి దిద్దిన భర్త త్యాగ నిరతికి అద్దం పట్టిన కథ ఇది. చక్కని భాష, చిక్కని భావం, మనసును కుదిపి వేసే సన్నివేశాల మేళవింపు ఈ ఆర్తి నవల. ఇంతటి గొప్ప నవల రాసిన శకుంతల గార్ని అభినందిస్తున్నా.

**– డా॥ వాసా ప్రభావతి**

ప్రముఖ కవయిత్రి, రచయిత్రి

'**మే**ధకులు'గా పుట్టడం దురదృష్టం. వారిని చీదరించుకోకుండా సహనంతో, లాలనతో సాకితే ఆలస్యంగానైనా వారు కనీసం సగటు మనిషి స్థాయికి ఎదగగలరు. భర్త 'మేధకుడు' అయినప్పుడు ఓర్పుతో, నేర్పుతో సాకి మామూలు మనుషులుగా చేసిన భార్యల కథలు, 'స్వయం సిద్ధ' వంటి నవలలు కనిపిస్తాయి. ఇట్టివి వాస్తవ జీవితంలో జరిగిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. అయితే - మేధకురాళ్ళయిన భార్యలను మామూలు మనుషులుగా మలచుకున్న సందర్భాలు అరుదు. కొన్ని వాస్తవ సంఘటనల ఆధారంగా ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి వేదుల శకుంతల రాసిన ఈ 'ఆర్తి' అన్న నవల ఆణిముత్యం వంటిది. తెలుగులో పునర్ముద్రణకు నోచుకున్న బహుకొద్ది పుస్తకాలలో ఇదొకటి. ఈ అంశం నవల ఎంతగా పాఠకుల ఆదరణను పొందినదీ తెలుపుతోంది.

**– కె.ఆర్.కె. మోహన్**

ప్రసిద్ధ రచయిత, కాలమిస్ట్

"**మా** అమ్మ ఈ 'ఆర్తి' నవల చదివి తడిబారిన కళ్ళతో 'ఎంత మంచి నవల చదివానో... హృదయాన్ని కదిలించేసిందీ నవల' అంది."

**– ఎక్కిరాల రాణీ సంయుక్త**

**శ్రీ**మతి వేదుల శకుంతల గారి 'ఆర్తి' నవల పురుషాధిక్య సమాజంలో స్త్రీ అనురాగ విజయం - భర్త ప్రేమార్తికి సరికొత్త భాష్యం !

**– కె.బి.లక్ష్మి**

రచయిత్రి, పాత్రికేయురాలు

## స్పందనలు

ఒక రచనని పుస్తక రూపంలో తీసుకురావడమే ఎంతో కష్టతరమవుతున్న ఈ రోజుల్లో ఈ 'ఆర్తి' నవల రెండవ ముద్రణ పొందుతోందంటేనే ఇందులోని విశేషం, గొప్పదనం అర్థమవుతున్నాయ్. 'ఆర్ద్రత' ప్రధానంగా మలచిన ఏ రచనైనా అన్ని తరగతుల, అన్ని తరాల వారిని అన్ని కాలాల పాటూ అలరిస్తుందనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు. ఇరవై నాలుగేళ్ళ క్రితం 'ఎమెస్కో' సంస్థ ద్వారా విడుదలై ఆ తరం పాఠకుల ఆదరణ చూరగొని, ఇప్పుడు రెండవ ముద్రణ పొందుతున్న ఈ 'ఆర్తి' నవల ఈ తరం పాఠకులను కూడా అంతగానూ అలరించగలదని నా ప్రగాఢ విశ్వాసం.

**- విజయార్కె**

ప్రముఖ రచయిత

'ఆర్తి'అనే పదంలోని భావాన్ని మనసుతో అనుభూతించగలమే కాని... మాటల్లో పూర్తి నిర్వచనం చెప్పాలంటే కష్టమే! అంతటి క్లిష్టమైన భావాన్ని పాఠకుల అనుభూతికి పరిపూర్ణంగా అందించ గలిగిన గొప్ప రచన శ్రీమతి వేదుల శకుంతల గారి ఈ 'ఆర్తి' నవల. ఇందులో... మనసు ఎదగని, మమత ఎరుగని 'శ్యామల' పాత్ర గురించీ, ఆమె మానసిక అపరిపక్వత, అమాయక ప్రవర్తన, కపటమెరుగని ఆమె మాటలూ... చదువుతుంటే నా హృదయం కదిలిపోయి, అపూర్వమైన ఆర్ద్రతానుభూతికి లోనయ్యాను. 'శ్యామల' నా కళ్ళముందే ఉన్నదా... అన్నంతగా ందించాను. ఈ నవలని ఆసాంతం చదివాక ఆర్ద్రతతో హృదయం తడవని, 'ఆర్తి'తో ్ళ చెమర్చని వాళ్ళుండరంటే అతిశయోక్తి లేదు. ఇంత మంచి నవల రెండవ ముద్రణ ొందడం సంతోషం కలిగించే విశేషమైతే... అచ్చుతప్పులనేవే లేకుండా అందమైన ముద్రణకు పేరెన్నిక గన్న 'జయంతి పబ్లికేషన్స్' ద్వారా విడుదల కావడం మరో విశేషం! రచయిత్రికి, ప్రచురణ కర్తలకు నా హార్దికాభినందనలు.

**- కోలపల్లి ఈశ్వర్**

సినీ రచయిత

'నవల' అంటే స్త్రీ! స్త్రీలోని సౌకుమార్యం, రమ్యత చెదిరిపోకుండా, నాటకీయత చెడకుండా, వాస్తవికత విడకుండా ఫ్యామిలీ డ్రామాను ఆర్ద్రత ప్రధానంగా మలచి నవలను నడిపించడం అంటే అక్షరాలతో సాము చేయడమే! రచయిత్రి శ్రీమతి వేదుల శకుంతల గారు ఈ

ప్రక్రియలో నిష్ణాతులు కాబట్టి ఈ 'ఆర్తి' నవలలోని పాత్రల పట్ల పాఠకులను సైతం ఆర్తితో ప్రతిస్పందించేట్లు చేయడంలో పరిపూర్ణంగా కృతకృత్యులయ్యారు.

**- ముచ్చర్ల రజనీ శకుంతల**

ప్రముఖ రచయిత్రి

ప్రముఖ రచయిత్రి శ్రీమతి వేదుల శకుంతల గారి 'ఆర్తి' నవల విభిన్నమైన కథాంశంతో ఎంతో విలక్షణంగా ఉండడమే కాక .. సమాజానికి ఒక మంచి సందేశాన్నిచ్చే రచన. ఈ 'ఆర్తి' మొదటి ముద్రణగా ఇరవైనాలుగేళ్ళ క్రితమే విడుదలైనా .. ఈ నవలలోని సందేశం ఆ నాటి సమాజానికే గాక .. ఈనాటి సమాజానికి కూడా ఎంతో అవసరం. ఈ విధంగా 'ఆర్తి' నవలను మరోసారి పాఠకుల ముందుకు తీసుకొచ్చే ప్రయత్నం ఎంతగానో ప్రశంసనీయం.

**- తిరునగరి విజయకిషోర్**

ప్రముఖ రచయిత

నేను చదివిన నవల లన్నింటిలోకీ 'ఆర్తి' నవల నాకెంతో నచ్చింది. నవల చదువుతున్నంత సేపూ ఒక మంచి టీ.వీ. సీరియల్ చూస్తున్న అనుభూతి కలిగింది.

**- యస్. యన్. ఉదయలక్ష్మి**

ప్రెసిడెంట్, ఎ.పి. సంఘమిత్ర అసోసియేషన్ ఫర్ ఫిజికల్లీ హ్యాండీక్యాప్డ్.

ఇది పిచ్చివాళ్ళ కథే అయినా పిచ్చికథ మటుకు కాదు. మానవత్వాన్ని తట్టిలేపి, మనసున్న మనుషుల్ని కళ్ళముందు నిలబెట్టి, ఏకబిగిన పాఠకుల చేత చదివించే చక్కని నవల. నవల చదవటం పూర్తి కాగానే ... ఆర్తితో ... చెప్పలేని అనుభూతితో హృదయం స్పందిస్తుంది. ఒక వెరైటీ నవల చదివామనే తృప్తి చదువరులకు కలుగుతుంది.

**- 'వనిత'**

మాసపత్రిక

# పబ్లిషర్స్ నోట్

**క**ళాభిమానులు, సాహిత్యాభిలాషులైన మీకందరికీ శుభ స్వాగతం. ఈ 'ఆర్తి' నవలలోకి ప్రవేశించే ముందు స్వాగతగీతంలా ఓ చిన్నమాట.

ఎలక్ట్రానిక్ మీడియా విజృంభణతో 'సాహిత్యానికి కాలం చెల్లిపోయిం'దని అందరూ నిర్ధారించేసిన ఈ రోజుల్లో 'ఉత్తమ సాహిత్యమెప్పుడూ అజ్ఞాతంగా ఉండిపో'దనీ, 'మంచి రచనలకి పాఠకుల ఆదరణ ఎప్పుడూ ఉంటుం'దన్న ఆత్మవిశ్వాసంతో ప్రచురణ రంగంలోకి ప్రవేశించి దిగ్విజయంగా ముందుకు సాగుతున్న మా 'జయంతి పబ్లికేషన్స్' ద్వారా విడుదలవుతున్న మరో సాహితీ ముత్యమే ఈ 'ఆర్తి' నవల.

'ముంజేతి కంకణానికి అద్దమేల ...? జగమెరిగిన బ్రాహ్మడికి జంధ్యమేల ...?' అన్నట్లుగా ఈ 'ఆర్తి' నవలా రచయిత్రి వేదుల శకుంతల గారి గురించి ప్రత్యేకంగా వివరించనక్కర్లేదు. 1960లో రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టి నాలుగు దశాబ్దాలుగా నిర్విరామంగా రచనలు చేస్తూ ఆ తరం, ఈ తరం పాఠకులకీ, సాహిత్యాభిలాషులకీ చిర పరిచితులైన రచయిత్రి వేదుల శకుంతల ! ప్రింట్ మీడియా మొదలు ఎలక్ట్రానిక్ మీడియా దాకా కథ, నవల, నాటకం వ్యాసం మొదలైన విభిన్న ప్రక్రియల్లో తనదంటూ ఓ ప్రత్యేకమైన శైలినీ, గుర్తింపునూ గౌరవాలనూ పొందిన రచయిత్రి శ్రీమతి వేదుల శకుంతల గారు.

ఇక ఈ 'ఆర్తి' నవల... ప్రముఖ ప్రచురణ సంస్థ 'ఎమెస్కో' వారి ద్వారా 1977లో విడుదలై ఆ తరం పాఠకులచే విశేషంగా ఆదరించబడి, రచయిత(త్రు)ల, విమర్శకులచే ప్రశంసింపబడి ఇప్పుడు రెండవ ముద్రణగా మా సంస్థ ద్వారా విడుదలవుతోంది. 'రాశి'కన్నా 'వాసి'కే ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తూ సాహిత్యంలో ఆణిముత్యాలనదగ్గ రచనల్ని పాఠకులకి అందించాలని సదాశయంతో కొనసాగుతున్న మా 'జయంతి' పబ్లికేషన్స్ సగర్వంగా సమర్పిస్తోన్న రచన శ్రీమతి వేదుల శకుంతల గారి 'ఆర్తి'. మొదటి ముద్రణగా విడుదలైనప్పుడు ఈ నవల పట్ల పాఠకులు చూపించిన ఆదరణ, ప్రోత్సాహాలే ఈ రెండవ ముద్రణకు 'స్ఫూర్తి'. మా ఈ ప్రయత్నాన్ని పాఠకులు ఆదరిస్తారని మా ప్రగాఢ విశ్వాసం.

"రచయితలచే స్థాపించబడి, రచయితలతోనే నిర్వహింపబడుతున్న ఏకైక పత్రిక' అన్న నినాదంతో మా సంస్థనుంచి వెలువడే 'జయంతి' సమగ్ర మాస పత్రిక సాహిత్యం పట్ల, రచనా వ్యాసంగం పట్ల ఆసక్తి ఉన్న ఎంతోమంది కొత్త రచయిత(త్రు)లను, పాఠకులను ఉత్సాహ పరిచి రచనా పరంగా వారికి మెళకువలు నేర్పి, సాహితీ లోకంలో రచయిత(త్రు)లుగా వారికంటూ ఓ ప్రత్యేక గుర్తింపు నివ్వడానికి దోహదపడింది.

అలాగే .. ప్రచురణ వ్యయం విపరీతంగా పెరిగిపోయిన ఈ రోజుల్లో ... తమ రచనల్ని పుస్తక రూపంలోకి తీసుకు రావాలన్న ఆసక్తి, అభిలాష ఉండి కూడా ప్రచురణకి అయ్యే ఖర్చుని చూసి వెనుకంజ వేస్తున్న వర్ధమాన, అనుభవజ్ఞులైన రచయిత(త్రు)లకు మా 'జయంతి పబ్లికేషన్స్' ఎంతో సహాయకారిగా ఉంటోంది. తమ రచనల్ని స్వయంగా అచ్చు వేయించు కోవాలనుకునే రచయిత(త్రు)లకి అందుబాటులో ఉండే అతి తక్కువ ఖర్చులో, ముద్రా రాక్షసాలు లేని ముచ్చటైన అక్షరాలలో, అక్షర దోషాలు కనిపించని అందమైన భాషలో అత్యంత త్వరితంగా పుస్తకాలు ముద్రించి అందిస్తున్నాం. ఆసక్తి గల రచయిత(త్రు)లు మా 'పబ్లికేషన్స్'ని సంప్రదించవచ్చు.

చివరిగా ... వేదుల శకుంతల గారి 'ఆర్తి' నవల ద్వితీయ ముద్రణ గురించి తెలుపగానే 'చాలా మంచి ప్రయత్నం ...' అంటూ ప్రశంసించడమే కాక, తమ అమూల్యమైన అభిప్రాయాలను అందించిన ప్రముఖ రచయిత, రచయిత్రులకి, పుస్తకానికి అందంగా కవర్ డిజైన్ చేసి ప్రఖ్యాత చిత్రకారుడు శ్రీ 'బాపు' గారికి, ఆర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాల వారికి . . . కృతజ్ఞతలు తెలుపుకుంటూ . . .

మీ అభిమానం, ఆదరణలతో మరిన్ని సాహితీ సుమాలు వసంతంలా మిమ్మల్ని అలరించడానిక మా సంస్థ నుండి వెలువడగలవని తెలియజేస్తూ . . . .

ఈ పుస్తకంపై మీ అమూల్యమైన అభిప్రాయాలు తెలుపగలరని ఆశిస్తూ . . . .

- కృష్ణజయంతి

**జయంతి పబ్లికేషన్స్**

# నా మాట

సమాజంలో ఎవరూ పూర్తిగా అదృష్టవంతులు కారు. అలాగే కేవలం దురదృష్టవంతులూ లేరు. ఇది జీవితానికి ఒకవైపు పరిశీలన ! ఇక రెండోవైపు గమనిస్తే ... 'అందం' అనే పదానికి నిర్వచనం ఇతమిత్థంగా 'ఇదీ ...' అని చెప్పలేం! ఒకరు మెచ్చే అందానికీ ..., మరొకరు ఇష్టపడే అందానికీ ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. అంటే అదృష్టం, అందం అనేవి జీవితానికి రెండు కోణాలు!

అందంగా ఉన్నవాళ్ళంతా అదృష్టవంతులని చెప్పలేం. అలాగే అదృష్టవంతులని చెప్పబడే వాళ్ళంతా అందమైన వాళ్ళనీ అనుకోలేం ! ఈ రెండు కోణాలూ ఎప్పుడో, ఎక్కడో కలుసుకుంటే కలుసుకో వచ్చునేమో ! కానీ ... దురదృష్టాన్నైనా అదృష్టంగా మార్చుకోగలిగే సామర్థ్యం, అంద విహీనుల్లో కూడా అందాన్ని వీక్షించగలిగే సౌజన్యం గల వ్యక్తి ఉంటే - నిజంగా ఆ వ్యక్తి ధన్యుడు ! సమాజానికి ఆదర్శ పురుషుడు !! సమాజాన్ని పరిశీలించిన నాకు ఇలాంటి సత్యాలు కనిపించి, ఈ 'ఆర్తి' నవల రాయడానికి ప్రేరేపించాయి !

ఇందులో 'వేణు' అనే పాత్ర ... మొదట సామాన్యుడు ! అందరి మగవాళ్ళలాగే - తన భార్య అందంగా ఉండాలనీ, తను అదృష్టవంతుడు కావాలనీ ఆశపడ్డాడు. కానీ ... తన భార్య మానసిక వికలాంగురాలని తెలిసాక - కుమిలిపోయి - ఆమెను వదిలేయాలనుకుంటాడు. అయితే ... కొందరు సహృదయుల సలహాతో ఆ పని చేయడు. భార్య 'శ్యామల' మతిస్థిరం లేనిదే అయినా, తనపట్ల ఆరాధనా భావం కలిగి ఉందని తెలిసాక - ఆమెను 'ఆర్తి'తో అనునయించి, లాలించి, మైనపు ముద్దలాంటి 'శ్యామల'ని చక్కటి వ్యక్తిత్వంతో రంగరించి ఒక మంచి మనిషిగా రూపు దిద్దుతాడు.

ఫలితంగా ... శ్యామల మానసిక పరిణతి పొంది, తెలివి తేటలు సంతరించుకుని - ఎదిగిన వ్యక్తిగా - సంస్కారవంతురాలిగా - కొత్తరూపు దాలుస్తుంది - భర్తకి ఆనందం కలిగిస్తుంది.

మానసిక రుగ్మత తగ్గి, మనిషిగా ఎదిగిన శ్యామల వేణు దురదృష్టాన్ని అదృష్టంగా మార్చేస్తుంది. వేణు శ్యామలలోని (మానసిక) సౌందర్యాన్ని చూసి 'తన అదృష్టం' అని సంతోషిస్తాడు.

ఇలా తన జీవితాన్ని ఆనందంగా మలచుకున్న వేణు ధన్యుడు. ఇలాంటి యువకులు సమాజానికి ఆదర్శ పురుషులనీ, వీరి అవసరం సమాజానికి ఉందనీ ఈ నవల ద్వారా ఒక సందేశాన్ని అందించాననీ భావిస్తూ ... రచయిత్రిగా తృప్తి పడుతున్నాను.

ఇరవై నాలుగు సంవత్సరాల క్రితం 'ఎమెస్కో' సంస్థ ద్వారా వెలుగు చూసిన ఈ 'ఆర్తి' ఆనాడే అశేష పాఠకులచే విశేష ఆదరణ చూరగొంది. అభిమాన పాఠకుల కోరికపై ఉత్తమ రచనల్ని అందించే 'జయంతి పబ్లికేషన్స్' వారి సౌజన్యంతో పునర్ముద్రణ పొంది కొత్తరూపుతో మళ్ళీ మీ ముందుకొచ్చింది. తిరిగి ఈ 'ఆర్తి' అంతటి ఆదరణ పొందగలదని ఆశిస్తున్నాను.

**- వేదుల శకుంతల**

# 'ఆర్తి'

నాంపల్లి స్టేషన్‌లో రైలు కదలడానికి సిద్ధంగా వుంది.

"కంగ్రాచ్యులేషన్స్ బ్రదర్! మళ్ళీ మీ మిసెస్‌తో రాగానే కల్సుకుంటాను!" . . .

"రాగానే గ్రాండ్‌గా పార్టీ ఇవ్వాలోయ్! పెళ్ళికి రాలేకపోతున్నామని మానేస్తే ఊరుకునేది లేదు. మీ ఆవిడతో చెప్పి తన్నించగలం!" . . . . .

"పెళ్ళి సందడిలో మమ్మల్నీ, ఆఫీసునీ మర్చిపోక, సెలవై పోగానే వచ్చేయి! అటునుంచి అటే హనీమూన్‌కి చెక్కేయకేం!?" . . . .

ఫ్రెండ్సందరి జోకుల మధ్య . . స్టేషన్‌లో వెలుగుతున్న నియాన్ లైట్లమధ్య . . అమ్మకాల వాళ్ళ అరుపుల మధ్య ... మెల్లగా కదులుతున్న రైల్లోనుంచి ... పూలరథంలో నుంచు దేవతామూర్తిలా చిరునవ్వులు చిందిస్తూ చేయి ఊపుతూ ముందుకెళ్ళి పోతున్నాడు . . 'వేణుగోపాల్'!

స్నేహితుడు కనిపిస్తున్నంత వరకు చేతులు ఊపి వెనక్కి తగ్గేరు మిత్రులు.

స్టేషన్ దాటేక లోపలికి వెళ్ళి కూర్చున్నాడు వేణుగోపాల్.

ఆ క్షణంలో అతని మనస్సు చెప్పలేని భావోద్వేగంతో మూగబోతోంది! 'ఇన్నాళ్ళకి తన కోరిక నెరవేరబోతోంది! జీవితంలో తను కోరుకున్న విధంగా తన సహధర్మచారిణి తనకి లభ్యమవుతోంది! నిజానికి . . . తను పెళ్ళి చూపులకి వెళ్ళనేలేదు! సెలవు దొరకలేదు, ఎంత ప్రయత్నం చేసినా! . . . ఫోటో పంపి వివరాలన్నీ రాసేడు, నాన్న! . . . ఆ ఫోటోలో ముగ్ధత్వం

చూసి తను ఎంత పరవశించేడూ? తను ఊహించుకున్న మేరకు అన్నీ సరిపోయినట్టుంది, ఆ రూపం! చదువు సంధ్యలు అంతగా అబ్బలేదుట! దానిదేముంది . . . తను నేర్పించుకోగలడు. చూస్తుండగానే గ్రాడ్యుయేట్‌ని చేసేయగలడు! భగవంతుడు ఇచ్చిన కనుముక్కు తీరు చాలు! పైగా, తెల్లగ్గ వుంటుందిట! అంటే -- తెల్లగా, తగిన ఒడ్డూ పొడవుతో, చిన్నగ నవ్వుతూ, తలవంచుకుని ఓరగాచూస్తూ. . . ఓహ్! ఎందుకొచ్చిన ఆరాటం! రేపు ఈసరికి పెళ్ళిపీటల మీద వుంటాను...' వేణుగోపాల్ మనసులోనే నవ్వుకున్నాడు.

బెడ్డింగ్ విప్పి మెల్లగా చోటు చేసుకొని నడుం వాల్చేడు! రైలు కుదుపులకీ... మనసులో చెలరేగే ఊహలకీ ఉయ్యాల జంపాల లూగుతూ కలత నిద్రలోకి జారుకున్నాడు.

## 2

బారెడు జడనిండా కుట్టిన మల్లెపూలు ... సందులేకుండా విచ్చుకున్నాయి! అత్తరు, అగరువత్తుల పరిమళం గదంతా నిండి వింత వాసనతో మత్తెక్కిస్తోంది! - కిటికీ ప్రక్కన మాలతీ తీగ మరీ పిచ్చిగా పూసి - సువాసనలతో విరగబడి నవ్వుతోంది!

ఆట్టే ఆర్భాటాలు ఏమీ చెయ్యకుండా అమ్మలక్కలంతా తప్పుకు పోయేరు. అసలు పెళ్ళి తంతులో కూడా ఎక్కువ తక్కువ పరిహాసాలు, వేళాకోళాలు లేకుండా చాలా ముక్తసరిగా చకచకా జరిపించేరు, వేడుకలన్నీ!

ఆ సంస్కారం వేణుగోపాల్‌కి నచ్చింది. పెళ్ళిలో చేసే హంగామాలు, హద్దు మీరిన హాస్యాలు ఎంత విసుగు తెప్పిస్తాయో తల్చుకొని తను కొంత భయపడ్డాడు! కానీ ఎంతో హాయిగా గబగబా జరిగిపోయాయి అన్ని కార్యక్రమాలు!

ఎదురు చూసిన క్షణం రానేవచ్చింది!

ఈ తొలిరేయిని గురించి అందరూ ఎన్ని కలలు కంటారూ?

జీవితంలో అతిమధురమైన మలుపు తిరిగేది ఈ నిముషం నుంచే కదూ?

వేణుగోపాల్ మంచం ప్రక్కనున్న వాలుకుర్చీలో వెనక్కి జార్లబడి కూర్చున్నాడు. రెండు రోజుల నుంచి సిగరెట్ తాగడానికి వీలు కలగలేదు! కరువు తీరా కాల్చుకుందుకు ఒక ప్యాకెట్

తెచ్చి పెట్టమని -- బావమరిది వరసవాణ్ణి -- బ్రతిమాలితే, వాడు నవ్వి -- 'అంత తీరుబడి వుంటుందా?' -- అన్నట్టుగా రెండు సిగరెట్లు చేతిలో పెట్టి వెళ్ళిపోయేడు! -- అందులో ఒకటి దాచుకుని, మిగిలింది వెలిగించుకుని -- మెదడుకు క్రొత్త మెరుగులు దిద్దుకుంటూ -- అగరువత్తుల పొగలో కల్సిపోతున్న సిగరెట్ రింగుల్ని గమనిస్తూ -- మెల్లగా తల ప్రక్కకి తిప్పి చూసేడు.

వెనుతిరిగి నుంచున్న పెళ్ళికూతురి వీపుమీద బెత్తెడు వెడల్పున బారెడు పొడవు మల్లెపూల జడ ... పూల వంతెనలా వుంది! తెల్ల చీర, జరీ బార్డర్ కాలి మడమల దగ్గర్నుంచి వయ్యారంగా వంపు తిరిగి -- పూల వంతెనను తగిలీ తగలనట్టు -- దాటుకుంటూ వెళ్ళింది! అయితే -- నడుంచుట్టూ బంగారు వాగులా మెలి తిరిగిన జరీ అంచు పూల వంతెన క్రిందనుంచి దూరి -- రెండో అంచుతో కల్సేక, వీపుమీద నుంచి ... క్రిందకి జారుతున్న సన్నని జలపాతాల్లాగా పెనవేసుకుపోయాయి! ఆ చోట, ... పమిట చెంగుకున్న జరీపూలు ... సెలయేటి తుంపర్లలాగ, జలపాతంలో విరిసిన బంగారు పువ్వుల్లా నవ్వుతున్నాయి! ఆ నవ్వుల కలకలంలో పులకించి పోతున్నట్టున్నాయి ... కాలి అందెలు, మెడలో దాగిన ఆభరణాలు!! లైటు వెలుగు పడుతున్నప్పుడల్లా మెరుస్తున్న ప్రతి అణువూ ... ఓ క్రొత్త అర్థాన్నీ, వింత అనుభూతినీ అందిస్తోంది ... వేణుగోపాల్‌కి!

తెల్లని తెలుపు కాదు ... చామనచాయ! అయినా... అందమైన ముఖం! పొట్టీ పొడుగూ కాని సమమైన ఆకారం!

తృప్తిగా ... హాయిగా గాలి పీల్చుకుని ఆఖరి దమ్ము గట్టిగా పీల్చి ... సిగరెట్ కిటికీలో నుండి అవతలికి పారేసేడు. లేచి కూజాలోని చల్లటి నీళ్ళు వంపుకుని త్రాగి ... మెల్లగ ... మెల్లమెల్ల ... దగ్గరికి నడిచాడు!

"శ్యామలా" ... అనురాగమంతా రంగరించి క్రుమ్మరించేడు.

తల మరింత వంచుకుంది!

"ఊ! అంత సిగ్గు పనికిరాదు! ... మెడ నెప్పి పుట్టటం లేదూ?"... మృదువుగా తలమీద చేయి వేసి నిమిరి తనవైపుకి త్రిప్పుకున్నాడు. చుబుకం పట్టి ముఖం పైకి ఎత్తేడు.

"శ్యామలా ... నేను నీకు నచ్చానా?" ... అతి సుకుమారంగా అడిగేడు.

"నచ్చడమేమిటీ? అమ్మ, అత్తయ్య, పిన్ని వాళ్ళంతా బోలెడు లడ్డూలు ... సున్నివుండలు

నేతితో చేయించేరు! నా పెళ్ళిట! అందుకని, మా చెల్లిని 'నన్ను ఒక్క మాట కూడ తిట్టడానికి వీలులే'దని ... వాళ్ళంతా గట్టిగా కోప్పడ్డారు. బుట్టెడు పూలన్నీ నాకే కావాలన్నాను. పాపం! అది బిక్కముఖం పెట్టిందని కొన్ని ఇచ్చేసేను. అయినా ... ఈ జడంతా ఎన్నిపూలు పట్టాయో? ... రేపు కూడా వెయ్యమన్నాను పూలజడ! కానీ ... పెళ్ళి అయిపోయిందిట కదా? అందుకని ఇంక పూలజడ కుట్టరుట ... మా వాళ్లెప్పుడు!"

వేణుగోపాల్‌కి కొద్దిగా కళ్ళు తిరిగినట్టు ... ఒళ్ళు తూలినట్టు అనిపించింది. బహుశా ... పెళ్ళి అలసటలో కొద్దిగా పైత్యం చేసిందేమో అనుకున్నాడు.

ఒక్కక్షణం కళ్ళు మూసుకుని తల విదిలించుకుని ... మళ్ళీ తెరిచాడు.

"నిద్ర వస్తోందా?" అంది శ్యామల.

"ఊఁ! పద ... అక్కడ పడుకుందాం!"

"ఎక్కడా! ఆ మంచం మీదా? ఛీ ... పాడు! నేను అమ్మదగ్గర పడుకుంటాను..."

చిన్నగా నవ్వేడు.

"నువ్వు భలేగా హాస్యమాడ్తావే! అమ్మ దగ్గర పడుకుందుకు నువ్వేమైనా చిన్న పాపాయివా?" .. అలా అడుగుతున్న వేణు ముఖం మరింకెవరైనా చూస్తే ... రెండు చేతుల్లో ముఖం దాచుకుని " మొగ్గలై ... బుగ్గలు ఎరుపెక్కేవి!

కానీ ... శ్యామల!?? పళ్ళన్నీ బైటకి పెట్టి పెద్దగా నవ్వింది!

"మా అత్తయ్యవాళ్ళ పాపాయి అమ్మ దగ్గర పడుకోదు. వేరే ఉయ్యాల్లో పడుకుంటుంది! ఢ్చినప్పుడేమో మా అత్తయ్య సీసాలో పాలు పడ్తుంది! మరి మా పిన్ని అయితే తనే ఒళ్ళో ూర్చోబెట్టుకుని వాళ్ళ చంటాడికి కొంగు చాటు చేసుకొని పాలిస్తుంది! నాకైతే ... మా అమ్మ న్నం దగ్గర కూర్చోబెట్టి ఎలా తినాలో చెప్తుంది ... మరి నాకు తెలియదు కదా ...?"

వేణుగోపాల్‌కి బుర్ర తిరిగినట్టయింది!

ఇది పైత్యం కాదనీ ... తనేదో గొప్ప 'షాక్' తింటున్నాడని అర్థమైంది. కొద్దిగా నిగ్రహించుకున్నాక ..

"శ్యామలా ... నీకు మతి సరిగా లేదా?" ... అనడిగేడు.

వెంటనే బుంగమూతి పెట్టి ... "నువ్వూ అలాగే అంటున్నావా? ఉండు ... మా నాన్నతో చెప్పి చెల్లిని కోప్పడినట్టే కోప్పడమంటాను. అందరూ అలాగే అంటున్నారు ...!"

ఇక వేణుగోపాల్ నిల్చోలేక గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళి కుర్చీలో వాలిపోయేడు!

స్పీడుగా వెళ్తున్న ట్రైన్ పట్టాలు తప్పినప్పుడు ... 'రష్‌గావున్న రోడ్డుమీద క్రాస్ చేస్తూ యాక్సిడెంట్‌కి గురైనప్పుడు...', స్విచ్ బోర్డుమీద చేయి వేస్తే సడన్‌గా 'షాక్' కొట్టినప్పుడు ... ఎటువంటి పరిణామాలకి గురి అవుతామో ...ఆ సమయంలోనే తప్ప ... మామూలప్పుడు ఊహించలేము!

కొండంత ఆశ ...కోటి కోరికలు ... దాచుకున్న వలపులు ... అన్నీ ఒక్కసారిగా శూన్యం అయిపోతే ... ఆ మానసిక పరిణామం ఎంత దారుణంగా వుంటుందో ...చెప్పడం కష్టం!

వేణుగోపాల్ కుర్చీలో ఎంతసేపలా వుండిపోయాడో కాని ... అవతల హాల్లో గడియారం పన్నెండు గంటలు కొట్టేక ... ఉలిక్కిపడి లేచాడు!

శ్యామల నేలమీద ముడిచిపెట్టుకుని పడుకుంది!

గాఢంగా నిట్టూర్చి ... తన మతి ఇంకా పోనందుకు సంతోషించి ... చివాల్న గది తలుపు తెరిచాడు.

కానీ ... అవతలవైపు గొళ్ళెం బిగించి వుంది!

చేసేదేం లేక పళ్ళు కొరుక్కుంటూ ... తెల్లవారేదాకా కళ్ళు మూసుకుని బలవంతం కాలం గడిపే ప్రయత్నంలో పడ్డాడు.

జేబులో మిగిలింది ఒక్క సిగరెట్ మాత్రమే!

తీసి వెలిగించుకున్నాడు.

'హూ ...! ఒక సిగరెట్ ప్యాకెట్ తెచ్చి పెట్టమంటే ... వాడెవడో ... నా ముఖాన రెండు సిగరెట్లు పారేసి పోయేడు! మత్తుమైకంలో వుండి అప్పటికి అదే చాలనుకున్నాను!!! కానీ ... ఇప్పుడు ఎన్ని ప్యాకెట్లు తగలేస్తే ... నేను మనిషిని కాగలను? అసలు మనిషిగా బ్రతక గలనా ఇకమీద?

ఏమిటి ఇలా జరిగింది? ...

ఎందుకు ఇంతటి విపరీతం జరిగింది? ...

అమ్మా, నాన్నా నన్నెందుకు ఇంత మోసం చేసేరు? అసలు వాళ్ళకైనా తెలుసా? తెలియదా?

మామగారు ... హా!? మామగాడు ... వాడు, వాడు, మోసగాడు! దగాకోరు ... నా జీవితం నాశనం చేసేడు. -- వాణ్ణి ఏం చేసినా పాపం లేదు. ముక్కలు ముక్కలుగా కోసి ... ఉహూ - దానివల్ల చచ్చిపోతాడు గాని ... బాధెలా అనుభవిస్తాడు? చావకుండా చిత్రహింస అనుభవించాలి! అంతే ... అంతే! -- లేకపోతే ఎక్కడో పట్నవాసంలో అతి సామాన్యంగా -- మామూలు మనిషిలా బ్రతుకుతున్న నా పట్ల ఇంతటి అన్యాయం చేస్తాడా? -- మతిలేని కూతుర్ని నాకంటగట్టి నా గొంతు కోసేడు! ఎంత గుట్టుగా దాచేరు ! మావైపు వాళ్ళెవరూ తెల్సుకోలేదా ? లేక, నాకళ్ళు మాత్రమే కప్పేరా? ఎందుకు? నేనేమి తప్పు చేసేను? నా మీద ఎందుకంత కక్ష? -

వెర్రి మొర్రి కోరికలు నాకేమీ లేవే?

కట్నకానుకలకి ఆశ పడలేదే ?? -

పెద్ద చదువులు ..... డిగ్రీలు నేను కావాలనలేదే ?

కేవలం ... నా మనస్సును అర్థం చేసుకొని ... కనుముక్కు తీరుగా ఉంటే చాలనుకున్నాను. నా జీతాన్ని, జీవితాన్ని అర్థం చేసుకోగల్గే సుగుణవంతురాలు కావాలనుకున్నాను.... ఇంత మాత్రపు ఆశలు నే పెంచుకోవడం నేరమా? ... అందుకు నా కింతటి శిక్షా??

సిగరెట్ పూర్తిగా కాలిపోయింది !

మనస్సుకు శాంతిలేదు ... సెగల పొగలు చిమ్ముతోంది!

కుర్చీలోంచి లేచి విసురుగా పచార్లు మొదలెట్టాడు ...!

గదిలో కనిపిస్తున్న ప్రతి వస్తువునూ విసిరి కొట్టాలనిపిస్తోంది !

మంచం దగ్గర ఆగి చూసేడు -

"మల్లెపూల గుత్తులు - బూరుగదూది తలగడలు ... దోమతెర ... అత్తరువాసన ... పళ్ళు-పాలు- ఛీ .. వెధవ అలంకరణ! పచ్చిమోసం ...!!-" కోపంతో ఊగిపోతూ - అవన్నీ పీకి పారేసేడు. పళ్ళూ, పాలూ ... కిటికీలోనుంచి గిరవాటు పెట్టేడు! అగరువత్తులన్నీ స్టాండులోనుండి ఊడపీకి కూజాలో పడేసేడు. అయినా ... కసి తీరలేదు! కోపం చల్లారలేదు !!

తాపం !!??-

ప్రక్కకి చూసేడు -

హాయిగా నేలమీద ఒత్తిగిలి పడుకొని నిద్రపోతోంది శ్యామల!

నిద్రలో ఆ ముఖం ఎంత ముగ్ధలా కనిపిస్తోంది? ఈ ముఖం చూసే కదా ... తను మోసపోయాడు ?!

'ఓసి ... పిచ్చి మొద్దూ, నీకెలా నిద్రపడ్తోందే?-' పళ్ళు కొరుక్కున్నాడు.

ఒక్కనిమిషం తరువాత ... ఉన్నట్టుండి - రెండుచేతుల్లో మొఖం దాచుకొని చంటిపిల్లాడిలా బావురుమని ఏడ్చేడు!!- తన దయనీయమైన స్థితికి తనమీద తనకే జాలికల్గి - తనని తనే ఓర్చుకొని - చెంపలూ, కళ్లూ తుడుచుకుని ... మెల్లగా కిటికీ దగ్గరికి వచ్చేడు. కిటికీ ఊచలు పట్టుకుని బయటకి చూసేడు.

వెన్నెల! మాలతీ పూలు పరుచుకున్న పండు వెన్నెల !!

పచ్చని గడ్డిమీద వెన్నెల మరకలు! నీలి ఆకాశంలో అక్కడక్కడ ... పాల తరకల్లాంటి తెల్లటి మబ్బు ముక్కలు!! ఎక్కడో పాలపిట్ట చిన్నగా కూసిన కూత! సిగ్గు పడినట్టూ, చిన్నగా వాలినట్టూ ... చల్లని మోత!

'వేణూ! ఇదేమిట్రా ... నీ జీవితానికీ, అవతల ఆ ప్రపంచానికీ మధ్య ఎంత అగాధం ఏర్పడింది? ఈ గదిలో, ఈ కిటికీ తీగల వెనక బంధితుడవై పోయావా?' -- అనుకుని వెర్రిగా నవ్వుకున్నాడు.

"పెళ్ళి సందడిలో మమ్మల్నీ, ఆఫీసునీ మర్చిపోకుండా సెలవైపోగానే వచ్చేయి! అటునుంచి అటు హానీమూన్‌కి చెక్కేయకేం!" -

"గ్రాండ్‌గా పార్టీ ఇవ్వాలోయ్! పెళ్ళికి రాలేదని మానేస్తే ఊరుకునేది లేదు. మీ ఆవిడతో చెప్పి తన్నించగలం!"

చెవుల్లో వినిపిస్తున్నాయి ... పాత వాక్యాలు !...

కన్నుల్లో కనిపిస్తున్నట్టున్నాయి ... నాటి దృశ్యాలు !!

మనసుమాత్రం సిగ్గుపడి సంజాయిషీ చెప్పుకోలేక సతమతమవుతున్న ముద్దాయిలా ... తల వంచుకుంటోంది !!

మై డియర్ ఫ్రెండ్స్! నన్ను క్షమించండి! నేను మీకు పార్టీ ఇవ్వలేను! మీకు నా ముఖం కూడా చూపించలేను! అయామ్ సారీ ... వెరీ సారీ!!' అస్పష్టంగా పెదవుల మధ్య దొర్లిపోయేయి ... జీవం చచ్చిన పదాలు!

ఆ సమయంలో ... హఠాత్తుగా 'రాజారావు' గారు గుర్తుకొచ్చారు!

'ఏం చేస్తూ వుంటారు ఇప్పుడు?' -

వెన్నెల్లో ... కారులో ... భార్యతో షికార్లు కొడుతూ వుంటారా? అదృష్టవంతుడు!- అందరికీ అంతటి అదృష్టం పడుతుందా?- ఎలాంటివాడు ఎలా మారిపోయేడు?? పాత స్మృతులు పిల్లగాలుల్లా కదిలేయి.

* * *

గేటులో నుంచి కారు దూసుకుని వచ్చి పోర్టికోలో ఆగింది! కుర్రాళ్ళలో కలకలం! గుసగుసలు! చిన్నగా ఈలలు ... ఫోజులు ... రకరకాల నాట్యభంగిమలన్నీ జరుగుతున్నాయి!

వాళ్ళందరిలో వేణుగోపాల్ వున్నాడు గానీ ..., ఏ ఒక్క చర్యా చెయ్యలేని భయస్తుడిగా మాత్రమే మిగిలిపోయేడు! కారణం? ఆ వచ్చిన కారు రిటైర్డ్ జడ్జి ఆనందరావుగారిది! అందులో వచ్చింది మాత్రం ఆయన కాదు! వారి కూతురు మిస్ ఉషా ... బియ్యే ఫైనల్! అందాల బొమ్మ ... చదువుల సరస్వతి! ధనవంతుల ఇంటి ఏకైక ముద్దుల బిడ్డ! అన్ని సర్టిఫికెట్సు వున్నవాళ్లు చాలా అరుదుగా వుంటారు! ఆ అరుదైన వరాల మూట ... ఉషాదేవి!

మూకుమ్మడిగా కుర్రాళ్ళంతా కలిసి వెకిలివేషాలూ, వెర్రి కూతలూ కుయ్యగలరు తప్ప ... నిజానికి ఏ ఒక్కడూ ఆమె ఎదురుగా నిల్చి కాలరెత్తుకుని నాల్గు మాటలు, తప్పుల్లేకుండా ఇంగ్లీషులో మాట్లాడలేడు!! నాన్‌స్టాప్ ఎక్స్‌ప్రెస్ లాంటి స్పీడులో ... పాల్లు పోకుండా ... అతి నాజూగ్గా మాట్లాడగలదు ఉష! అది ఆమె తండ్రి దగ్గర నేర్చుకున్న నేర్పు!

అన్నీ బాగానే వున్నాయి ... అంచుకు రంగు మాత్రం లేదు! ఆమెలోనూ 'లూప్‌హోల్' వుంది! తల బిరుసు! ఎవ్వరినీ లెక్క చెయ్యని నిర్లక్ష్యం! మొగాడికి మొగుళ్ళా ఠీవిగా నడుస్తూ ...

ఆడలక్షణాలు మర్చిపోతుంది! జీన్‌ప్యాంటు ... టైట్ టీ షర్టు ... లాంటి అధునాతన దుస్తులు ధరిస్తుందే తప్ప ... మిగిలిన అమ్మాయిల్లా చీరెలు మాత్రం కట్టదు!

... అందుకే కుర్రాళ్ళకీ కళ్ళ ఎరుపు!

'ఎంత అందం, చదువూ వున్నా ఆడది కాదా?' అన్న ఉక్రోషం! 'ఏమీ లేకపోయినా మేము మగాళ్ళం!' - అన్న పౌరుషం! ఏదోవిధంగా ఆమెను ఏడ్పించాలనే పంతంతో ఆమె వచ్చేసరికి పిచ్చిఅరుపులు ... వెర్రివేషాలు వేసి తృప్తిపడతారు! ఆమెకి చీమ కుట్టినట్టయినా వుండదు!!

అందరి దృష్టి ఆమె మీద వుంటే ... ఆమె దృష్టి మాత్రం రాజారావు మీద నిలుస్తుంది! చదువులో, అందంలో ఉషతో సమానమైన తూకం తూగగలవాడు రాజారావే! కానీ ఆమెతో ఎప్పుడూ సవాల్ చెయ్యడు, కవ్వించడు ... కనీసం కన్నెత్తి చూడడు! పుస్తకంలో తలదూర్చి ఆ జ్ఞానం అంతా బుర్రలోకి అనువదించుకుని ... కాలేజీ చదువుని సార్థకం చేసుకోవాలన్నది అతని ధ్యేయం! అతను మెరిట్ విద్యార్థి! స్కాలర్‌షిప్‌మీద చదువుకుంటున్న పేదింటివాడు! ఆ పేదరికపు గోడ అతనికీ, ఉషకీ మధ్య నిలువెత్తున నిలిచిపోవడం వల్లనే ... రాజారావు ఉషని కన్నెత్తి చూడాలనుకోడు! ఇంటికి పెద్దకొడుకు కనుక తన బాధ్యతలన్నీ గుర్తుంచుకుని ... చదువు పూర్తి చేసుకుంటున్నాడు.

కారులో నుంచి ఉషాదేవి ఠీవిగా దిగి నిర్లక్ష్యంగా తల ఎగరేసి ... రెండు క్షణాలు కళ్ళతో వెతికింది! దూరంగా రాజారావు ... పచ్చగడ్డి మీద కాళ్ళు ముడుచుకుని కూర్చుని ... ముడుచుకున్న కాళ్ళమధ్య నోట్సు తెరిచి పెట్టుకుని ... అందులోనిదంతా కళ్ళద్వారా మెదడుకు ఎక్స్‌పోర్టు చేసేస్తున్నాడు! గుబురుగా పెరిగిన క్రోటన్స్ మొక్కలు ఎండని ఏ కాస్తో ఆపగల్గుతున్నాయి తప్ప ... అతని నుదురు మీద పేరుకున్న స్వేద బిందువుల్ని మాత్రం తుడువలేక నిట్టూరుస్తున్నాయి!

కారు చప్పుడు గానీ, ఉష రావడం గానీ, ఆ చుట్టు ప్రక్కల జరుగుతున్న ఫార్సులు గానీ ...రాజారావు గమనించటం లేదు! డ్రైవర్ కారుని వెనక్కి త్రిప్పుకుని వెళ్ళి పోగానే ... ఉష - రాజారావు కూర్చున్న వైపుకి నడిచింది.

'హుర్రే!' 'దేఖో యారో!' 'హాయ్ హాయ్ ... మైనే క్యాకియా!' 'ఓ మై గాడ్!' లాంటి ఆశ్చర్యార్థకమైన సంకేతాలన్నీ చెలరేగాయి .... గుంపులో నుంచి!

రాజారావుతో ఐదు నిముషాలు మాట్లాడి ... అతను చదువుతున్న ఆ నోట్సు పుస్తకం అడిగి తీసుకుని ... విజయగర్వంతో ఉష తన ఫ్రెండ్స్ దగ్గరికి వెళ్ళిపోయింది. అప్పుడు కుర్రాళ్ళ గుంపంతా రాజారావు మీద దాడి చేసి ... 'నోట్సు ఎందుకిచ్చావ'నీ ... 'ఆడపిల్లలకి అంత అలుసు ఇవ్వకూడ'దనీ ... నానా గోల చేసి, రాజారావు ఏడ్చేంత పని చేసేక ... 'ఏమిరా నీ అదృష్టం!? ఉషాదేవి నీ దగ్గరికి వచ్చింది గదరా?' అని చేతుల మీదకి ఎత్తేసి ... ముద్దెట్టుకున్నారు.

'ఛీ ...!' అని రాజారావు బుగ్గ తుడుచుకుంటే -

'ఛ! చవట దద్దమ్మా! మా సిగ్నల్స్‌ని అర్థం చేసుకుని ... నీ లైన్ క్లియర్ చేసుకో! ఎంతసేపు నీ చదువు, చదువు అని అరుచుకుని ... రాబోయే జానెడు బెత్తెడు ఉద్యోగంతో ఎలా బ్రతుకుతావురా? వల వెయ్యకుండానే ... 'ఎర' అందించకుండానే ... బంగారు చేప నీ వొడిలో పడబోతోందిరా! కళ్ళు తెరిచి, ముందు చూపు చూడు! వెధవ పుస్తకాల్లో ఏముందీ? నీ బొంద!' - అని హితవు చెప్పేరు. రాజారావుకి ఆ హితవు అంత తొందరగా అర్థం కాలేదు!

ఉష క్రమంగా రాజారావుకి చేరువైంది! తనే వలవేసి ... రాజారావుని దగ్గరికి లాక్కుంది!

ఫలితంగా బి.య్యే. పరీక్షలు కాగానే ఆ సెలవల్లో రాజారావుకీ, ఉషకీ వైభవంగా పెళ్ళయింది!

అదిగో ... అప్పట్నుంచే 'రాజారావు' ... 'రాజారావుగారు'గా మారేరు! పెద్దింటి అల్లుడు నే ... హోదా పెరిగింది! అలవాట్లూ మారేయి!

కానీ ... మారిపోకుండా, మనిషి కనీసధర్మంగా మిగిలింది ఒకటుంది! అదే ... స్నేహధర్మం! గత స్నేహితులు ఎవరు వచ్చినా ... ఆప్యాయత ... ఆనందం అందించి ఆ తర్వాతనే డ్రింక్స్, మీల్స్ లాంటి అతిథి మర్యాదలు చేస్తాడు! కాబట్టి రాజారావు గారింటికి వేణుగోపాల్ చాలా తరచుగా, బాగా చనువుగా వెళ్ళగల్గేవాడు! ఉష కూడ 'శ్రీమతి ఉష' అయ్యాక స్నేహితుల్ని సంతోషంగా ఆహ్వానించేది! ఆ సమయంలో ... రాజారావు' ఉష సరదాగా జోక్సు వేసుకుంటూ ... ఒకళ్ళనొకళ్లు అల్లరి పెట్టుకుంటూ ... ఇంట్లో కేరింతలు ... నవ్వుల పొంగులు వెదజల్లేవారు!

ఓసారి ...

వేణుగోపాల్ రాజారావుగారింటికి వెళ్ళేసరికి ఆ భార్యాభర్తలిద్దరూ ఏదో ప్రోగ్రాం మీద బయటికి వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు. 'అరే ... ఈ సమయంలో ఎందుకొచ్చానా?' అని వెనుతిరిగి

వెళ్ళబోతున్న వే...గోపాల్‌ని రాజారావు ఆపుచేసి ... "ఫర్వాలేదు! నువ్వు కూడా మాతో రావాలి!" అని బలవంతం చేసి కూర్చోబెట్టేడు. ఇంతలో లోపల మేకప్ పూర్తి చేసుకుని బయటికి వచ్చింది ఉష!

రాజారావు ఓ క్షణం భార్యని తేరపార చూసి "ఉషా! నీకెన్నిసార్లు చెప్పేను ... ఈ జిబ్రాల్టర్ చీర కట్టుకోవద్దని?' అన్నాడు సీరియస్‌గా.

"నిజమేసార్! మీరు కూడా గుర్తు తెచ్చుకోండి! నేనెన్నిసార్లు చెప్పాను - మీరు ఆ గరాటు ప్యాంటు వేసుకోవద్దని?" అంది వెంటనే ఉష!

వేణుగోపాల్‌కి నవ్వు వచ్చింది!

నల్లచారలున్న పచ్చరంగు చీర - బహుశా రాజారావుకి ఇష్టం లేదు కాబోలు! అలాగే క్రింద కొద్దిగా వదులై ... పైభాగం బిగుతుగా వున్న రాజారావు ప్యాంటు నచ్చలేదు ఉషకి!

ఎవరి డ్రస్సు వారికి ఇష్టంగానే వుంది! ఒకరిది మరొకరికి నచ్చలేదు! అందుకని ఇద్దరూ మూతులు బిగించుకుని బయల్దేరేరు! వేణుగోపాల్ ఆ ఇద్దరి చిలిపి కజ్జాలకి నవ్వుకుని ముచ్చటపడ్డాడు.

అప్పటికి వేణుగోపాల్ ఉద్యోగం సంపాదించుకుని ఆర్నెల్లయింది! గవర్నమెంటు జాబు దొరికి - అద్దెకి ఒక మంచి గది కూడా దొరికిన వేణుగోపాల్ ... పాతిక సంవత్సరాల యువకుడు! నిత్యం ఎన్నో జంటల్నీ, ... ఎన్నో అందాల్నీ చూస్తున్న అతని హృదయం ... కొద్దిగా పులకించటం, క్రమంగా ఆలోచించటం నేర్చుకుంది. తనకీ పెళ్ళి ... ఇల్లాలు ... ఇల్లు ... ఉండాలని మనసు పదే పదే కోరడం మొదలైంది!

రాజారావు, ఉష అదృష్టవంతులు!

అంతటి సిరి సంపదలు ... అందచందాలు ... తెలివితేటలు ... అందరికీ లభ్యం కావు! అదొక అపురూపమైన జంట! అలాంటి అందమైన భార్య ... చదువు, డబ్బు గల అమ్మాయిని తను కోరడు! ఎందుకంటే ... తన అందం ఎంతమాత్రంగా వుంది? తన ఆర్థిక స్థితి, తన తెలివితేటలు ... అన్నీ తగు మాత్రమే కదా? అందుకని తను వెర్రి ఆశలూ, పిచ్చి కోరికలూ

చూడగానే ఫర్వాలేదనిపించే ముఖం! తగు మాత్రం చదువు ... అన్నిటికన్నా ముఖ్యం ... తనంటే ఇష్టపడి, మనసు ఇచ్చి పుచ్చుకోగల్గే అనురాగమయి ... తన ఆర్థిక పరిస్థితుల్ని అర్థం చేసుకుని నేర్పుగా సంసారం చక్కదిద్దగల తెలివి, ఓర్పు వుంటే చాలు! వాళ్ళు బీదవాళ్ళైనా, కట్నం ఇవ్వలేకపోయినా సరే ... చేసుకుంటాను.

వేణుగోపాల్ ఎప్పుడూ ఊహించుకునే ఊహలు అవి!

'రెండుగదుల ఇంట్లో ... కలత లెరుగని మనసులతో ... కమ్మని కబుర్లతో ... నిండుగా, హాయిగా, అతి సాఫీగా జీవితం వెళ్ళదీసుకుంటే చాలు ... అంతే చాలు!' అనుకునేవాడు. ఆ సమయంలోనే తండ్రి దగ్గరనుంచి ఉత్తరాలు వస్తుండేవి. 'సంబంధాలు వస్తున్నాయి... త్వరగా వచ్చి చూసుకుని ... ఒకింటి వాడవి కావాలిరా!' అని.

'తను మాత్రం వద్దన్నాడా? తను కోరేదీ అదే కదా?' ఒకటి రెండు సంబంధాలు స్వయంగా వెళ్ళి చూసి ... బొత్తిగా పిల్లలు బాగా లేరని వచ్చేసేడు. మరొక రెండు సంబంధాలు వాళ్ళే స్వయంగా తీసుకొచ్చి చూపించేరు. మరీ పల్లెటూరి గబ్బిలాయిల్లా వున్నారనుకుని వద్దన్నాడు. మరోసారి తనకు సెలవు లేక తండ్రినీ, తల్లినీ వెళ్ళి చూసి రమ్మంటే ఆ సంబంధంవాళ్ళే ఒప్పుకోలేదు. వాళ్ళ కుటుంబ చరిత్ర బాగా లేదుట! ఆ వరుసన విసుగుపుట్టి కొన్నాళ్ళు పెళ్ళిచూపులు వాయిదా వేసుకున్నాడు.

తర్వాత హఠాత్తుగా తండ్రి వచ్చి ఫోటో చూపించి పిల్లని తను చూసేనని - బాగుందనీ చెప్పేడు. ఆ ఫోటో చూసేక తనకి బాగానే అనిపించి 'సరే ... నిశ్చయించేయి నాన్నా' అనేసేడు! అనడమేమిటీ? నిమిషాల మీద అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి.

తనకి అసలు సెలవు దొరకటమే కష్టమైపోయింది! ఫ్రెండ్స్ అంతా ఎంత గోల చేసేరూ, ఎంత సంతోషం వెలిబుచ్చేరనీ?! ఇంటి యజమాని ఇకమీదట ఇంకో గది ఎక్కువ ఇస్తానన్నాడు! పనిమనిషి జీతం ఎక్కువ చెయ్యమన్నది. 'అమ్మగోరు వస్తారి గదా?' అని పాలప్యాకెట్ ఇంకోటి ఎక్కువ కావాలని ముందే చెప్పి వుంచుకున్నాడు తను.

రైల్వేస్టేషన్‌కి స్నేహితులంతా వచ్చి సెండాఫ్ ఇస్తూ మళ్ళీ ... ఆరోజు ... 'రిసీవ్ చేసుకుందుకు వస్తా'మని చెప్పేరు.

ఎవర్ని రిసీవ్ చేసుకోవాలి. ఈ మతిలేనిదాన్నా? ఈ పిచ్చిదాన్నా ...?

భగవంతుడా ... ఎంత అన్యాయం చేసేవ్??

# 3

కిటికీ ఊచల కేసి తల బాదుకున్నాడు!

నించునే ఓపికలేక నీర్సంగా, గోడవారగా జారిపోయేడు వేణుగోపాల్!

శ్యామల మంచి నిద్రావస్థలో వెల్లకిలా పడుకుని వుంది.

ఆమెకి వేణుగోపాల్ వేదన కానీ, ఆరాటం కానీ ... కనీసం 'అతను తన భర్త - ఇద్దరం ఒక గదిలోనే వున్నా'మని కానీ ... ఏదీ తెలియదు! అదో నిర్వికారమైన స్థితి! అర్థంలేని నిశ్చింత!

తెల్లవారు ఝామున బయట నుంచి ఎవరో గొళ్ళెం తీసిన చప్పుడు వినిపించింది వేణుకి.

అర్థమైంది! కొద్దిసేపు ఆగేడు!

మెల్లగా లేచాడు. తలుపు తెరుచుకుని బయటికి నడిచేడు! పెళ్ళింట్లో అందరూ తలొక మూల నిద్రపోతున్నారు! తన బ్రీఫ్‌కేసులో నుంచి పర్సు జేబులో పెట్టుకుని వీధిలోకి నడిచేడు!!

వీధులింకా నిర్మానుష్యంగా ... ఒకటి రెండు రిక్షాలు, లారీలు ... చిన్నకార్లు కనిపిస్తున్నాయి. చలిగాలి వేస్తోంది! వేణు చకచకా నడుస్తున్నాడు.

మూడురోజుల క్రితం - ఇలాంటి తెల్లవారుఝామున ... పెళ్ళింటికి టాక్సీలో ... చుట్టాల వెళ్ళాడు. అప్పుడెంత సంతోషంగా ... దర్జాగా ... సందడితో వెళ్ళాడూ?

ఈరోజు ఇలా ఒంటరిగా, దొంగచాటుగా' విచారంగా పారిపోతున్నాడు ! పారిపోతున్నాడా కాదు ... తనకి వాళ్ళంతా చేసిన అన్యాయానికి తగిన ప్రతీకారం తీర్చుకుంటున్నాడు!

ఈ క్షణంలో తను వాళ్ళకి కనబడితే ... బ్రతిమాలుతారు ... కాళ్ళు పట్టుకుంటారు . ఏడుస్తారు ... క్షమించమని వేడుకుంటారు! ఇదంతా ముందే వాళ్ళు వేసుకున్న ప్లాన్ అయి వుంటుంది అందుకే ... అంత గబగబా కార్యక్రమాలన్నీ జరిపించేరు!

అందుకే... వాళ్ళకి తగినట్టుగానే కక్ష తీర్చుకోవాలి! ఏ గొడవా, అల్లరీ లేకుండా తను బయటపడ్డా ప్రస్తుతం తను ఏదైనా బస్సుగానీ, బండిగానీ, రైలుగానీ పట్టుకుని హైద్రాబాదు చేరాలి. ఎంత త్వర వెళ్ళిపోతే అంతమంచిది! తెల్లవార్లూ నిద్రలేదు! మనసు బాగాలేదు! ఒళ్ళు తిరుగుతుంది. .. కళ్ళు మూత పడుతున్నాయి. ఉన్నపళంగా రోడ్డుమీద పడుకుని నిద్రపోవాలని వుంది.

స్టేషన్ చేరుకున్నాడు. అక్కడ ఎంక్వైరీ చేస్తే - రైలు ఉదయం ఆరు గంటలకి వుందన్నారు. లాభం లేదు! అంత ఆలస్యం చేస్తే ... పెళ్ళివారింటి నుంచి ఎవరైనా వెతుక్కుంటూ వచ్చేస్తారు.

గబగబా బస్సుస్టాండ్‌కి వెళ్ళేడు! పావుగంట క్రితమే బస్సు వెళ్ళిపోయిందన్నారు! మళ్ళీ ఉదయం ఏడు గంటలకే వుందన్నారు.

ఛీ! ప్రతిచోటా అపశకునమే ... ఎదురుదెబ్బలే ! అందుకే పగ, పట్టుదల మరీ ఎక్కువ అవుతున్నాయి! వాళ్ళెవరూ రాకుండా ఏదో ఒకటి చేయాలి ... చేయాలి! నడుస్తూనే వున్నాడు ... ఆలోచన ... తల పగిలిపోతోంది! అమ్మ మీద కోపం ... నాన్న మీద కోపం ... అత్తమీద, మామమీద ... ఊహూ ... ఆ రాక్షసి ... పిచ్చిపీనుగ ... తన ప్రాణానికి శని! అదే! అసలు పీక పిసికి చంపేస్తే పీడా విరగడ అయ్యేది! కానీ ... పిచ్చివాళ్ళకి బలం ఎక్కువ అంటారు. దానికి మతిలేదు కదా? తను ఏదైనా అఘాయిత్యం చేస్తే అరచి గొడవ పెట్టేదేమో? ఏమో? ఛీ! పెళ్ళి చేసుకున్నంత సేపు పట్టలేదు ... తన ఆనందాలన్నీ మంట గలిసేయి! ఈ క్షణంలో తను విడాకులకి పెట్టుకోవచ్చును. కానీ తర్వాత? మళ్ళీ పెళ్ళి ప్రయత్నాలు ... నల్గురిలో నవ్వుల పాలు... ఛీ! ఎంత సిగ్గుచేటు?

జీవితంలో మొదటిసారిగా చేసుకున్న పెళ్ళే పెళ్ళి! మళ్ళీ పెళ్ళి - కళ్ళు తుడుచుకోవడం లాంటిదే గానీ, కొత్త అనుభూతులేముంటాయి? మృదువైనవి, సున్నితమైనవి, మధురాతి మధురమైనవి ... ఒక్కసారి జరిగితేనే అందం! మళ్ళీ మళ్ళీ జరిగితే ... సారంలేని చెరుకు పిప్పిలా వుంటుంది!

ఇన్నాళ్ళకి చేసుకున్న పెళ్ళి ఇలా తగలబడిందా? ఇంక మళ్ళీ పెళ్ళి ఆలోచన ఏమిటీ? చస్తూ బ్రతకడం, బ్రతుకుతూ చావడం ... ఛస్! ఎంత దురదృష్టవంతుణ్ణి??

వంతెన మీద లారీ ఏదో మెల్లగా ఆగింది! డ్రైవర్, క్లీనర్ ఇంకొకడితో ఏదో మాట్లాడు తున్నారు. మసక వెలుగులో లారీ నిండా ఏవో చెక్క పెట్టెలున్నట్టు కనబడుతున్నాయి! ఓ పది నిముషాలు మాట్లాడేక "యాభై రూపాయలు ఇవ్వండి. అంతకి తక్కువైతే ఊలవదు!" అన్నాడు డ్రైవర్! కొంచెం గొణిగి "సరే అయితే" అన్నాడు ఆ మూడో మనిషి!

డ్రైవర్, క్లీనర్ సిగరెట్లు, బీడీలు వెలిగించుకున్నారు. ఆ మూడో మనిషిని జాగ్రత్తగా లారీ ఎక్కించి ... చెక్కపెట్టెల ప్రక్కన చోటు చేసి కూర్చోబెట్టేరు.

వేణుగోపాల్ అంతా చూసేడు. గబగబా పరిగెత్తి డ్రైవర్‌తో మాట్లాడేడు ... ఎంతకీ ఒప్పుకోలేదు డ్రైవర్!

"నేను మరొక పాతిక ఎక్కువ ఇస్తాను. హైదరాబాదు బస్సు డిపోలో దించితే చాలు" అని బ్రతిమాలితే మెత్తబడ్డాడు డ్రైవర్!

లారీలో చెక్కపెట్టె సందులో ముక్కూ ముఖం తెలియని మరొక మనిషితో ... ఆ చలిలో ... చీకటి తెరలు విచ్చుకుంటున్న వేళ ... వేణుగోపాల్, క్రొత్తపెళ్ళి కొడుకు - అత్తవారింటినుంచి ... దూరంగా వెళ్ళిపోతున్నాడు!

లారీ ఒక్క ఊపుతో కదిలింది!!

# 4

భళ్ళున తెల్లవారింది!

శ్యామల ఇంకా బయటికి రాలేదు!

తల్లి, పినతల్లి, మేనత్త ... ఏం చేయాలో తోచక - తలుపుమీద మెల్లగా తట్టేరు ... లాభం లేకపోయింది! నిజానికి, ఆ శబ్దానికి శ్యామల లేచి వస్తుందని కాదు ... అతను మేల్కొని ఆమెను ఇవతలకి పంపుతాడేమోనని వాళ్ళ ఉద్దేశ్యం! తల్లికి ఒక ఆలోచన వచ్చి ... గబగబా పెరటివైపు నడిచి, సందులో నుండి ... గది కిటికీ వైపుకి వెళ్ళింది! అక్కడ ఆమె చూసిన దృశ్యం ... ఒక్క క్షణం పాటు అలాగే నిలబడేట్టు చేసింది! పళ్ళు ఇవతల పడి వున్నాయి! పాలు కిటికీ అంచునుండి కారిన చారికలు కన్పిస్తున్నాయి! భయపడుతూనే, మెల్లగా కిటికీలోనుండి లోపలికి చూసింది. మంచం మీద అతను లేడు! వస్తువులన్నీ చిందరవందర చేసినట్టు విసిరేసినట్టు ... ఏదో జరిగే వుంటుందన్న అనుమానం రాగానే ఆమె చిన్నగా వణికింది!

శ్యామల నేలమీద హాయిగా నిద్రపోతుంది.

గదిలో వేణు వున్న జాడ కనిపించలేదు!

వెంటనే - ఆమె ముందు వైపుకి వచ్చి గాభరాగా తలుపు తోసింది. వెంటనే తెరుచుకుంది!

'అనుకున్నంతా అయిం'దని లోపలికి వెళ్ళి శ్యామలని లేపింది. కళ్ళు నులుపుకుంటూ వెర్రిముఖంతో లేచింది!

"అమ్మా - పెళ్ళయిపోయిందా? మరి 'వాడు' వెళ్ళిపోతాడా ఇంక?" అని అడిగిన కూతుర్ని తల బాదుకుంటూ "నోరు మూసుకోవే పిచ్చిమొఖమా? అసలు అతను ఏడీ? రాత్రి ఏం జరిగిందీ?" అని అడిగింది.

"ఏమో ... నాకేం తెల్సు? నాకు నిద్ర వచ్చింది ... పడుకున్నాను. 'వాడె'క్కడ పడుకున్నాడో నేను చూడలేదు! ఆ! 'వాడు' వాళ్ళమ్మ దగ్గరకెళ్ళి పడుకున్నాడేమో? చూడు ... నన్నేమో నీ దగ్గర పడుకోనీయకుండా చేసేవు?" కళ్ళు నులుముకుంటూ చెప్తున్న ఆ ఇరవై ఏళ్ళ కూతుర్ని చూసి తల్లికి విపరీతమైన కోపం వచ్చి జబ్బ పట్టుకొని బరబరా ఇంట్లోకి లాక్కెళ్ళింది. పినతల్లి, మేనత్త ఎంత వారిస్తున్నా వినకుండా మూలనున్న కొట్టు గదిలోకి తీసుకెళ్ళి ఆ చెంపా ఈ చెంపా వాయించింది! జుట్టు పట్టుకుని పీకి నడుం వంచి కొట్టింది! శ్యామల అరుపులకీ, కేకలకీ ... గబగబా అందరూ లేచేరు. పినతల్లి, మేనత్త ... శ్యామలని తల్లి చేతుల్లోనుంచి విడిపించేసరికి ఆ పిల్ల తండ్రి అక్కడికి వచ్చాడు!

దెబ్బలు తిని ... ఏడుస్తున్న కూతుర్ని ... రొప్పుతూ నిల్చున్న భార్యని, వాళ్ళని సముదాయిస్తున్న ... చెల్లెలు, మరదలు ... వాళ్ళని చూసి, విషయం అర్థం చేసుకున్నారు.

"దాన్ని కొట్టి ఏం లాభమే? ఇంతకీ అతను ఎక్కడికి వెళ్ళినట్లు?" అని అడిగేక ... 'నిజమే... అతను ఏడీ?'... అన్న అనుమానం అందరికీ కల్గింది.

పెళ్ళింట్లో ... అంతా గందరగోళంగా తయారైంది!

పెళ్ళికొడుకు కోసం వెతకడం మొదలెట్టేరు. ఇరుగూ పొరుగూ బుగ్గలు నొక్కుకుని ... అయ్యో ... అబ్బాయికి అసలు విషయం తెలియదు కాబోలు! పాపం' అని శ్యామల పిచ్చితనాన్ని మరోమారు గుర్తు తెచ్చుకున్నారు. పిల్లలంతా వేడుకగా చూస్తుంటే ... పెద్దలంతా ఖిన్నులై కూర్చున్నారు. పెళ్ళికొడుకు తల్లి మాత్రం సన్నగా ఏడుస్తూ 'నా కొడుకు జీవితం నాశనమైంది! వాడెక్కడికి పోయాడో ఏమో ...' అని మిగిలిన వాళ్ళకి శాపనార్థాలు పెడ్తోంది !

"మేము మీకు ముందే చెప్పాం గదా బావగారూ? మరి, అబ్బాయికి మీరు ఏమీ చెప్పలేదా?" అని వియ్యంకుడు నిలదీసేడు.

"చెప్పేరనుకోండీ! మా వాడికి ఈ విషయాలన్నీ ముందే చెప్తే కంగారు పడతాడని ... నిదానం మీద తెలుస్తుందని ఊరుకున్నాం! అయినా ... అమ్మాయిని చూసి ఎవరూ మతిస్థిరం

లేని పిల్లని అనుకుంటారా? నిక్షేపంలా వుంది! ఏదో సర్దుకు పోతారనుకున్నాం గాని ... ఇంత రసాభాస అవుతుందనుకోలేదు!"

"ఎంతపని చేసేరు బావగారూ? ఇలాంటివి ముందే చెప్పాలి! ఇంతకీ ... అమ్మాయి పేర రెండు ఎకరాల పొలం రాసినట్టయినా చెప్పారా?"

"అదే ...! అదే! ఏదీ ... చెప్పాలనే ఇంకా అనుకుంటున్నంతలోపే..."

"ఇదేమిటి బావగారూ? అబ్బాయికి ఏమీ చెప్పకుండా మీరు ఇలా చెయ్యబట్టే ఇప్పుడు ఇంత గందరగోళం అయ్యింది. పోనీ ... నేనైనా చెప్పేవాణ్ణి కదా? ఎందుకు దాచి పెట్టేరూ? ఇప్పుడు చూడండీ ...ఎలా జరిగిందో? ..." అంటూ నిష్ఠూరంగా మాట్లాడుతున్న వియ్యంకుణ్ణి చూడగానే, వేణు తండ్రికి కోపం వచ్చింది.

"ఏమిటండీ చెప్పడం? ముందు చెప్తే ... మొదటికే మోసం రాగలదు! మా వాడు ఒప్పుకుంటాడా? నిదానంగా చెప్పాలనుకున్నాను. లేదా, వాడికే అర్థమయి సర్దుకు పోతాడనుకున్నాను..."

"అందుకని ... మా అమ్మాయికి అన్యాయం చేస్తారా?"

"ఏమిటీ? అన్యాయమా? ఎవరైనా వింటే నవ్వుతారు! జరిగిన అన్యాయం మా అబ్బాయికే గాని మీ అమ్మాయికి కాదు. దానికి అసలు ఈ జన్మలో పెళ్ళి అయ్యేదా? నేను జాలి తలచబట్టి ఆ కాస్త మూడు ముళ్ళయినా మా అబ్బాయి చేత వేయించేను"

"ఏం జరిగిందీ? ఖర్చు, శ్రమ మిగిలేయి! మళ్ళీ ఎప్పటిలా పిల్ల మా ఇంట్లోనే వుంటే లాభం?"

"సరే! అలా ఎందుకుంటుందీ? ఎలాగో తీసుకుపోతాంలెండి!" అన్నాడు ఉదార బుద్ధితో వేణు తండ్రి!

రెండు ఎకరాల పొలం పిల్ల పేరున రాసిన తండ్రి - దానికోసం ఆశించిన వేణు తండ్రి - ఇద్దరూ అసలైన వ్యాపార సరళిలో ముచ్చటించుకుంటున్నారే తప్ప - వేణు హృదయాన్ని ... అతని సున్నిత భావాల్నీ ఎవరూ అర్థం చేసుకోలేదు.

ఎన్నో వాదోపవాదాల తర్వాత అమ్మాయిని అత్తింటివారు తమ వెంట తీసుకువెళతారని అనిపించుకున్నాక వంటలు - ప్రారంభించేరు ... ఆడపెళ్ళివారు!

# 5

వారం రోజుల తర్వాత ...

వేణుగోపాల్ ఆఫీసుకి తయారవుతున్న సమయంలో ఓరోజు తండ్రి రిక్షా దిగేడు.

కోపంతో ... ఎలా తిట్టాలో, ఎలా మొదలు పెట్టాలో తెలియక, మాటలు పెదవుల మధ్య బిగించి, మండుతున్న అగ్నిగోళంలా నిలబడ్డాడు ... వేణు.

రిక్షా దిగుతున్నప్పుడే భయంతో శరీరం బిగుసుకుపోయి, కొడుకు ఎన్ని తిడ్తాడో, తంతాడో అన్న అదురుతో, గుండె దడదడతో ... లేని గాంభీర్యాన్ని తెచ్చుకుని ... బింకంగా లోపలికి అడుగు పెట్టేడు వేణు తండ్రి ... పురుషోత్తం!

రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేక - తన చేతి సంచీ క్రింద పెట్టుకుని - వేణు వదిలేసిన బ్రీఫ్‌కేసు, బెడ్డింగ్ చూపిస్తూ ... "ఇవి వదిలేసి వచ్చావురా! ఏం ఇబ్బంది పడ్తున్నావో అని ..." మాటలకోసం తడుముకుంటూ చూసేడు.

పక్కున నవ్వేడు వేణు.

ఇంకా ఏదో మొదలుపెట్టి బ్రతిమాలడమో ... కేకలేసి బుద్ధి చెప్పడమో ... చేస్తాడనుకున్న తండ్రి కేవలం తన పెట్టె, బెడ్డింగ్ తెచ్చానని చెప్పడం వినేసరికి తండ్రి పిరికితనానికి నవ్వు వచ్చింది!

'హమ్మయ్య ... కొడుకు నవ్వేడు, అంతే చాలు!' అనుకున్నాడు ... పురుషోత్తం! ధైర్యం తెచ్చుకుని గొంతు సవరించుకున్నాడు.

"నీకు నవ్వు వస్తోంది గానీ, నాకు దుఃఖం వస్తోందిరా! నల్గురిలో చచ్చేంత పనైంది నాకు? కనీసం నాతోనైనా చెప్పకుండా ఆ వరుసన నువ్వు వచ్చేయడం బాగులేదురా!"

హఠాత్తుగా వేణు ఉద్రేకంలోకి వచ్చేసేడు.

"ఏది బాగుంది? ఫోటో చూపించి ... మోసం చేసి పిచ్చిముండని నా కంట గట్టడం బాగుందా? తర్వాతనైనా నాకు చెప్పకపోవడం బాగుందా? నేను కట్న కానుకలు ఆశించలేదు. పెద్ద అందాలు, చదువులు ఆశించలేదు. సంసారపక్షంగా వుండే అమ్మాయి చాలన్నాను. అంత మాత్రపు ఆశ వుండటం కూడా తప్పేనా? ఏరి కోరి ఆ మతిలేని దాన్ని తెచ్చావా? ఇది నువ్వు

కావాలని చేసిందా? లేక తెలియక చేసిందా? తెలియక చేసిందే అయితే నాతోపాటు నువ్వూ అక్కడినుండి లేచి వచ్చేవాడివే! కాని, నన్ను సమాధానపరచడానికే వస్తే ... నువ్వు ఈ పని కావాలని చేసిందేననిపిస్తోంది! ఏ తండ్రీ యిలాంటి వెధవపని చేయడు! కొడుకు జీవితం కావాలని నాశనం చెయ్యడు! నువ్వు ఏం ఆశించి ఆ పిల్లని కోడలుగా ఇష్టపడ్డావో తెలియటం లేదు". అని ఆగి ఊపిరి పీల్చుకుని ... "నాన్నా ...! ఎందుకు నామీద నీకు ఇంత కసి ...?? నేను నీ స్వంత కొడుకునే కదా?" అన్నాడు! ఆవేదన అంతా కంఠంలో నుండి పొంగుకు వచ్చింది.

పురుషోత్తం కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ -

"అంత మాట అనకురా వేణూ! నేను 'మంచి' చెయ్యాలనే అనుకున్నాను. ముందుగా నీతో అన్ని విషయాలూ మాట్లాడక పోవడమే నేను చేసిన పొరపాటు! నీ మామగారు నాకు వివరంగా చెప్పేరు - అమ్మాయి చిన్నప్పట్నుంచీ అమాయకంగా, మందకొడిగా వుండేదిట! ఎన్నో రకాల వైద్యాలు చేయించేరుట! వయస్సు పెరిగింది తప్ప మనస్సు వికసించలేదు! నిజానికి అది పిచ్చి కాదు ... పసిపిల్లంత అమాయకత్వం! అందుకని, శరీరానికి చేసే వైద్యాలేవీ ఆ అమ్మాయిని మార్చలేదు. ఇక మిగిలిందల్లా మానసికమైన మార్పు! గాలి మార్పు, స్థలం మార్పు కాదు! వివాహం చేస్తే ... ఇలాంటి వాళ్ళు మారగలరని డాక్టర్లు సలహాలిచ్చారుట! ... ఒక సంవత్సరంలో తగిన జాగ్రత్తలు తీసుకుంటూ ... కొత్త అనుభూతులూ ... పరిస్థితులూ కల్పిస్తే అమ్మాయిలో మార్పు వస్తుంది! పిల్ల కురూపి కాదు! కేవలం మానసిక దౌర్బల్యమే! భర్త అనురాగం ... స్పర్శజ్ఞానం ... ఆ పిల్లకి తెలియాలిట? అయితే ... అంత ఆదర్శప్రాయమైన వారు ఎవరు దొరుకుతారని మామగారు నిస్పృహ చెంది వూరుకున్నారుట! రెండో అమ్మాయి కూడా పెద్దదైంది! పెళ్ళికి ఎదిగిం కానీ ... పిల్ల బాగుండదు! ఆ కారణంగా ఆ అమ్మాయికి సంబంధాలు రావటం లేదుట! ఉన్న ఇద్దరాడ పిల్లల బ్రతుకులు ఇలా తయారయ్యాయని ఆ తల్లిదండ్రులు కృంగిపోయేరుట!" అని ఇంకా ఏదో చెప్పబోతూండగానే -

"అందుకని వాళ్ళమీద సానుభూతితో నా పీక పిసుకుతావా? ఎవర్నో ఉద్ధరించటం కోసం కన్న కొడుకుని అగాధంలోకి తోస్తావా? ఎంత త్యాగం? ఎంత దయ?" హేళనగా నవ్వేడు వేణు.

"కాదురా! నాది త్యాగం కాదు ... దయ అంతకన్నా కాదు. స్వార్థం లేకుండా నేను ఈ పని చెయ్యలేదు! నీకు కట్నం అక్కర్లేదని అన్నా, నేను నీ మామగారి మాటలకి ఆశపడ్డాను! అమ్మాయి

పేరున రెండు ఎకరాల ఆస్తి రాసి ఇస్తానన్నారు. రెండు సంవత్సరాల తర్వాత అమ్మాయిలో ఏ మార్పూ రాకపోతే ... విడాకులు ఇచ్చేసి నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చని సూచించేరు!" అన్నాడు.

"ఛీ! వెధవ పని! ఆస్తికి ఆశించి ... ఆ తర్వాత మళ్ళీ వదిలేసేయడానికి సిద్ధపడటం. మానవత్వం వున్నవాడు చెయ్యగలడా? నాతో ఒక్క విషయమైనా సంప్రదించకుండా ... ఈ చదరంగం ఎందుకు మొదలెట్టేవు నాన్నా!" వేణుకి పిచ్చి కోపంగా వుంది! ఒకదాన్ని మించి ఒక్క ఎత్తుగడ చిరాకుగా, వెర్రి పుట్టించేదిగా వున్నాయి.

అందుకే -

"ఇంతేనా? ఇంకేమైనా షరతులు, అగ్రిమెంట్లు ... లావాదేవీలు, కాయితాల మీద సంతకాలు లాంటివి చేశావా? ఒకవేళ ఆ అమ్మాయికి మతిస్థిమితం కల్గి బాగుపడి సంసారం చేస్తుండగా ... నాకేమైనా అయితే ఆ అమ్మాయిని వాళ్ళే పోషించుకోవాలి ... అని !"

"వేణూ!!" - పురుషోత్తం కళ్ళు మూసుకుని కణతలు రుద్దుకుని "ఎందుకురా ... అలాంటి అపశకునపు కూతలు? ఇప్పటికే నేను సగం చచ్చి వున్నానురా!" అంటూ దగ్గరికి వచ్చి, దీనంగా "ఇవి చేతులు కాదు ... కాళ్ళనుకోరా? తండ్రిని ... నిన్ను క్షమాభిక్ష అడుగుతున్నాను. నా తప్పు మన్నించరా!" అన్నాడు. ఆయన కళ్ళు అశ్రు పూరితాలై పెదవులు వణుకుతున్నాయి.

వేణు నవ్వేడు. "ఎలా అనుకోను నాన్నా! చేతులు చేతులే! కాళ్ళు కాళ్ళే! అన్నం అని పళ్ళెం తిని బ్రతకగలమా? ఏదో ఆడది కదా ... అని పిచ్చిదానితో కాపురం చెయ్యమంటే కోరికలు తీరుతాయా? ఇంక నేను చెప్పదల్చుకున్నది ఒక్కటే! ఆ పిల్ల విషయంలో నువ్వు ఏ పరిష్కారం 'సినా నాకవసరం! నేను ఇంక ఇంటికి వచ్చేది లేదు! ఇప్పటికే ఇక్కడ అందరికీ సవాలక్ష అబద్ధాలు ప్పి ఆ అమ్మాయిని ప్రస్తుతం మా ఇంటి దగ్గర వదిలి వచ్చానని చెప్పి తప్పించుకున్నాను. స్నేహితులంతా చూపించమని ఒకటే గోల! ఇప్పుడు నేను దాని ముఖం కూడా చూడను. మీ ఇష్టం, వాళ్ళిష్టం!"

"పోనీలేరా! అమ్మాయిని మనింటికి తీసుకునే వచ్చాంలే! అందులో అబద్ధం లేదు! నువ్వు నెమ్మదిగా స్థిమితపడి వీలు చూసుకొని మనింటికిరా!"

"హూ ... స్థిమితం! ఇంకా నయం ... నాకు మతిపోలేదని సంతోషించు! ఆ రోజు ఆ షాక్ తగిలి నేను పిచ్చివాణ్ణయివుంటే - ఈ రోజు ఇలా ఇన్ని వాదోపవాదాలకి తావుండేది కాదు. నువ్వు

చేసిన పనికి ఏడుస్తూ కూర్చోడమో, లేకపోతే ... నీకు, అమ్మకి కూడా తల తిరిగి గుండె పగిలి ఏమైపోదురో ... ఊహించుకో!"

"నిజమే! కాని, జరగని వాటి గురించి ఎందుకు ఊహించడం!"

"ఓహో! అలాగా!! సరే చెప్తున్నా విను ... నేను ఆ పిల్లని చూడదల్చుకోలేదు. కాపురం మాట అసలు ఎత్తకు! అలా జరుగుతుందేమో అని కలలోనైనా ఊహించకు! అది జరిగేది కాదు. ఇంక నాకు ఆఫీసు టైం అయింది! పావుగంట ఆలస్యం కూడా అయింది! నేను వెళ్ళిపోవాలి! నీతో మాట్లాడవలసిందేమీ లేదు. ఇంకా నీకు ఉండాలనిపిస్తే ... ఇదిగో, ఈ తాళం ఇక్కడ పెడ్తున్నాను. నేను ఆఫీసుకి వెళ్ళేక తాళం వేసి పక్కింట్లో ఇంటివాళ్ళకిచ్చేయి!" అనేసి తండ్రికి మళ్ళీ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా, చరచరా బయటికి వెళ్ళిపోయాడు వేణుగోపాల్!

నించున్నవాడు నుంచున్నట్టే ఉండిపోయేడు పురుషోత్తం! కనీసం మంచి నీళ్ళైనా తాగలేదు. కొడుకుతో పూర్తిగా తెగతెంపులు చేసుకున్నట్లైంది! తెలిసి చేసినా, తెలియక చేసినా ... తప్పు తనదే? కానీ కోపం అంతా కోడలిమీదకి తిరిగింది! ఆ సమయంలో ఆ అమ్మాయి ఎదురుగుండా వుంటే పీకనొక్కి చంపేసి వుండును!

వెంటనే ఇంటికి వెళ్ళిపోవడానికి తిరుగుబండి లేదు. చచ్చినట్టు సాయంత్రం దాకా ఆగాల్సిందే! నిన్న రాత్రి తిన్న తిండే తప్ప - ఇంతవరకూ కాఫీనీళ్ళు కూడా కడుపులో పడలేదు! నీరసం వచ్చి ప్రక్కనున్న కుర్చీలో కూలబడ్డాడు!

'అడ్డాలనాడు బిడ్డలుగాని ... గడ్డాలు వచ్చాక బిడ్డలా?' - అన్నదెంత నిజం! చిన్నప్పుడైతే నాలుగు దెబ్బలు వేసి చెప్పినమాట వినేటట్టు చెయ్యొచ్చును. చెయ్యెత్తు మనిషై ఉద్యోగం చేసుకుంటూ తన బ్రతుకు తను బ్రతుకుతున్న కొడుకుని ఎలా మందలించటం? వాడి వరస చూస్తే - నన్నే కొట్టేట్టువున్నాడు! మా చిన్నప్పుడు మేము ఇలాగే వున్నామా? 'ఫలానా పిల్ల మెళ్ళో పుస్తె ముడేయి ...' అంటే వేసేయడమే! 'ఈ సంవత్సరం నేను తాతయ్యా నవ్వాలిరా ...' అంటే, తప్పదియ్యా ... ఆ పై నెలలో పెళ్ళాం వేవిళ్ళతో బాధపడేది! అదేమిటో ... పెద్దవాళ్ళు తలచుకున్న ప్రతిపనీ దివ్యంగా, సవ్యంగా జరిగిపోయేవి! ఖర్మ ... ఇప్పుడు ఒక్కటీ జరగదు సరిగదా ... ఎదురు తిరిగి పెద్దాళ్ళకే ఎసర్లు పెడుతున్నారు! ఎక్కువ తక్కువ మాట్లాడితే ... తెగతెంపులు చేసుకుంటున్నారు! ఛీ ఛీ ... వెధవ ప్రపంచం పాడైపోయింది.'

పురుషోత్తం కుర్చీలో కూర్చోలేక లేచి పచార్లు చేసి ... ఆ ఓపిక కూడా పోయాగ గదికి తాళం వేసి హోటల్‌కి దారి తీసేడు.

ఆఫీసులో ఫైళ్ళు చూస్తున్నా ... వేణుకి గదిలో వున్న తండ్రిమీదనే ఆలోచనలు సాగుతున్నాయి!

'పాతికేళ్ళు వచ్చినా ... ఇంకా పాలుతాగే నాటి పాపాయిలా వుండాలనే ఆయన ఉద్దేశ్యం! వయస్సు పెరిగినట్టే మనస్సు పెరుగుతుందని ఎందుకనుకోరూ? చిన్నప్పుడు లాగూ, చొక్కా అమ్మ తొడిగేది. ఇప్పుడు కనీసం షర్టు గుండీలు పెట్టడానికైనా రాదు! చెట్టంతవాడికి తను పెట్టడమేమిటనే కదా! భోజనం చేసినా తన కిష్టమైనవి తింటాడు గాని ... తల్లి చెప్పినట్టే తినాలనుకోడు గదా? ఒక వయస్సుకు చేరి వ్యక్తిత్వం సంతరించు కున్నాక ఎవరి అభిరుచులు, అనుభూతులు వారివే కానీ ఇంకొకరి కోసం బలవంతంగా చేయగలరా? అది ఆత్మవంచనే కానీ ... మనస్ఫూర్తిగా చేసినట్టు ఎలా అవుతుంది? వాళ్ళు చెప్పినట్టే విని ... కాపురాలు చేయమంటే ... గుడ్డి వెధవో ... అవిటి వెధవో ... అర్భకపువాడో అవ్వాలి తప్ప ... స్వతంత్రమైన ఆలోచన గల్గిన వ్యక్తి ... చెయ్యగల్గే పని కాదు! పెద్దవాళ్ళని గౌరవించవలసిన విధానం వేరు! ఎంత వరకో అంత వరకే! అందుకే తను పెళ్ళిచూపుల సంగతి తండ్రికే వదిలేసి ఆ గౌరవం నిలిపేడు! కాని, ఆయన చేసినదేమిటి? పిచ్చిమాలోకాన్ని కట్టబెట్టి 'ఏలుకో' ... అంటాడా? తనకిచ్చిన పెద్దరికాన్ని, గౌరవాన్ని దుర్వినియోగం చేసుకోలేదా? ... ఇంకానయం!! ఈ పెద్దాళ్ళు ఎప్పుడు చెప్తే అప్పుడే భార్యతో మాట్లాడాలి ... వద్దంటే మానేయాలి ... అని ఆంక్ష విధించలేదు! ఖర్మ ... విధించకపోవడమేమిటి ? కొన్ని సంసారాల్లో అలాగే ఏడ్చింది గదా? కనమంటే కనాలి ... మానేయమంటే మానేయాలి! ఛీ ... వెధవ లోకం మరీ ఇలా తయారవుతోందే?'

వేణుకి ఫైళ్ళు చూడబుద్ధి కాలేదు. మూసేసి వరండాలోకి నడిచేడు!

కొలీగ్ ఒకడు నవ్వుతూ చూసి "మ్యారేజ్ అయ్యాక 'ఫ్యామిలీ'ని తల్లి తండ్రుల సేవకి వదిలేసి వస్తావుటోయ్? బుర్ర ఎలా పనిచేస్తుంది మరీ? పని ఇలాగే చేస్తే ఆఫీసర్ గారు అగ్నిహోత్రావధానులై అక్షింతలు చల్లగలరు. వెంటనే మీ శ్రీమతిని తీసుకురా" అన్నాడు.

వెకిలినవ్వు నవ్వి "మా వాళ్ళంతా నా గురించి చెడుగా అనుకుంటారు. కొన్నాళ్ళు పోనీయ్ అప్పుడు ఆలోచిద్దాం!" అన్నాడు వేణు ... 'ఒకటోరకమైన నాటకం' అని మనస్సులో అనుకుంటూ భుజాలెగరేసి.

"బాపురే! ఏం మనిషివోయ్? తండ్రి చెప్పిన పిల్లనే చేసుకుని ... పెళ్ళయ్యాక వాళ్ళ దగ్గర వదిలేసి వచ్చావు? ఈ రోజుల్లో నీలాంటి అద్భుతమైన వాళ్ళుండరు!" అన్నాడు.

వేణు నవ్వి ఊరుకున్నాడు.

సాయంత్రం గదికి వచ్చేసరికి తండ్రి తాళం వేసి వెళ్ళిపోయాడు! 'హమ్మయ్య' అనుకున్నాడు.

## 6

సెలవురోజు!

గదిలో కూర్చుని ఎంతసేపని కాలక్షేపం చేయాలి? లేచి డ్రస్సు వేసుకుని రాజారావు ఇంటికి బయల్దేరాడు. రాజారావుని 'గారు' అని మన్నించడం వేణుకి రాలేదు. ఇంట్లో నౌకర్లంతా 'అయ్యగారు' అనీ, గుమాస్తాలంతా 'రాజారావుగారు' అనీ మన్నిస్తూ వుంటారు. నిజానికి ... తనూ వాళ్ళ గుమాస్తా లెవల్లోనే వున్నాడు!

రాజారావు గారిని ఉద్యోగం చెయ్యనీయకుండా బిజినెస్ పెట్టించింది ఉష! 'ఉషారాజ్ కంపెనీ!' ... అందులో దొరకని వస్తువు వుండదు. అధునాతనమైన వస్తువు ఏదైనా తయారైతే అది ముందు వాళ్ళ షాపులోనే దొరుకుతుంది. గోళ్ళు తీసుకునే నైల్‌కట్టర్ దగ్గరనుంచి గోల్డ్ దాచుకునే ఐరన్ సేఫ్‌ల వరకు అన్నీ సప్లయి చేయగలరు!

ఆ స్థాయిలో నడుస్తున్న వాళ్ళ కుటుంబంతో ... తనకి చనువుగా వెళ్ళే స్థానం వుందంటే ... అది కేవలం వాళ్ళ స్నేహం మాత్రమే! ఎంత క్లాసుమేట్స్ అయినా ... డబ్బు ముందు దిగదుడుపే! కానీ ... తనకి ఆ దిగదుడుపు యోగం పట్టలేదు.! కాకుంటే అప్పుడప్పుడు చనువు చేత ఏవైనా వాళ్ళకి ఇంటి పనుల్లో సహాయం చేయడం జరుగుతూ వుంటుంది!

గేటు తీసుకుని లోపలికి వెళ్ళేడు వేణు.

అలవాటైన ఆల్సేషన్ డాగ్ - ఓసారి అరిచి ... తోకాడించి, ఊరుకుంది!

"ఎవరు రా టైగర్? ఎవరొచ్చారు?" అని లోపల్నుంచి ఆనందరావుగారి కంఠం వినిపించింది.

టైగర్ చెప్తుందని కాదు ... ఆ వచ్చిన వాళ్ళెవరో తెల్సిన వాళ్ళయి వుంటారని ... వాళ్ళే జవాబు చెప్తారని ... ఆయన ఉద్దేశ్యం!

అందుకే వేణు వరండా మెట్లు ఎక్కడం పూర్తి కాగానే, "నేనేనండి ... వేణుగోపాల్‌ని!" అని జవాబు ఇచ్చాడు.

"హల్లో! కమాన్! కంపెనీ లేక విసుగ్గా వుంది! రా రా ! ఒక ఆట ఆడుదాం కూర్చో ..." అన్నారు, పైప్ కాలుస్తూ ఆనందరావుగారు.

టీపాయ్ మీద ఛెస్ బోర్డు వుంది! పావులన్నీ సగం సగం ఎత్తుల్లో వున్నాయి! ఒక్కరే కూర్చుని రెండు వైపుల ఆట తనే ఆడుకుంటున్నారు! అనుకోకుండా 'ఛెస్' ఆట తెల్సిన మరొకరు వచ్చేసరికి ఆయనకి సంతోషం అనిపించింది!

ఆనందరావుగారి ఎదుట 'ఫ్రీ'గా కూర్చోలేదు వేణుగోపాల్!

ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్!!

ఆయనెక్కడ? తనెక్కడ?

మేధావి ... ధనవంతుడు ... పేరు ప్రతిష్టలున్నవాడు - ఆయన ! అల్పజ్ఞాని ... మధ్యతరగతి గుమాస్తా ... అనామకుడు - తను! మేరుపర్వతం ముందు - గులకరాయిలా వుంటుంది! కాని, ఆయన మాటని కాదనే శక్తి తనకి లేదు! ఛెస్ ఆటలో ఓటమీ లేదు!!

అందుకే జంకును దాచుకుని బింకంగా కూర్చున్నాడు వేణుగోపాల్!

ఆట మొదలైంది ...

"రాజా రా ..." వేణు అడగబోతున్న మాటకి అడ్డుగా ఆయన ప్రశ్నించేరు -

"మీ ఆవిణ్ణి తీసుకొచ్చావా?" - అని!

సిగ్గుపడి "ఇంకా లేదండి" అన్నాడు.

"భలే వాడివోయ్?! మ్యారేజ్ అయి నెల్లాళ్లు దాటింది, భార్యని తీసుకు రాలేదు! అఫ్‌కోర్స్! పెద్దల యందు నీకున్న గౌరవం మెచ్చుకో దగ్గదే సుమా! అరెరే ... నా శకటుని కొట్టేసేవా?" అని కంగారు పడ్డారు.

'అవును! కొట్టేను. ఎందుకంటే మీ ఊహ తప్పు కనక! నాకు పెద్దలయందు గౌరవం లేదు ... ఉన్నదల్లా నాకు ఆమె మీద కోపం, మా వాళ్ళమీద పగ' అనుకున్నాడు వేణు.

"ఏం చదువుకుంది?"

"ఏం చదవలేదండి! అక్షరాలు గుర్తు పట్టగలదట!"

ఆనందరావుగారి రోల్డ్‌గోల్డ్ ఫ్రేం కళ్ళజోడు ఆశ్చర్యంగా కనుబొమల పైకి లేచింది.

"ఐసీ! అయినా ఫర్వాలేదు! చదువుదేముంది? ఇప్పుడైనా చదవ వచ్చును! కొందరికి చదువుతో పని వుండదు! స్వతహాగా తెలివితేటలు వుంటాయి!" బంటుని వెనక్కీ, ముందుకూ జరుపుతూ అన్నారు.

'ఆ! ఆ! వుంటాయి! అదో పిచ్చిమొద్దు! మీరేదో గొప్పగా అంచనా వేసుకోకండి!' అనుకున్నాడు.

పైకి మాత్రం నవ్వేసి ... "రాజారా..." అనబోయేడు.

"నిజమేనోయ్! మా మేనత్త ఒకావిడ వుండేది ... చదువుకోలేదు. కనీసం అక్షర జ్ఞానం కూడా లేదు! అయితేనేం ... మామయ్య ఆస్తినంతా పాలివాళ్ళకి పోకుండా అతి జాగ్రత్తగా కాపాడింది! మా మామయ్యే ఆశ్చర్యపోయేవాడుట! ఆవిడ తెలివితేటలు అంత గొప్పవి!" అన్నారు.

ఆటలో లీనమయిపోయారు ఇద్దరూ ...

ఒక గంట తర్వాత "షా ...!" అన్నాడు వేణు.

ఉలిక్కిపడి ... పకపకా నవ్వేరు ఆనందరావుగారు!

"ఊ! మొత్తానికి ఓడించేసేవు కదా?" అని పైప్ అందుకున్నారు.

వేణు కొద్దిగా ఫీలై "ఆటలో ఏముందండీ? నేను ఎప్పుడూ మీ ముందు చిన్నవాడినే ... అన్ని విషయాల్లో!" అన్నాడు తల వంచుకుని పావులన్నీ ఎత్తేస్తూ.

ఆనందరావుగారు గంభీరంగా నవ్వేరు.

పైప్ తీసి దానివైపే చేస్తూ "పొరపాటు వేణూ! 'చిన్నా', 'పెద్దా' అనుకోవడంలో వుంది! వయస్సులోనైనా ... డబ్బులోనైనా ఒకర్ని పై స్థాయిలో, ఒకర్ని క్రింది స్థాయిలో చూడటం మన దృష్టిలోపం! వయస్సు పెరిగినవాడు వివేకవంతుడై వుంటాడని చెప్పలేం! అలాగే ... డబ్బున్న ప్రతివాడూ సుఖంగా వున్నాడని అనుకోలేం!! చిన్నవయస్సులో వున్నా ... పేదవాడైనా, ఒక్కోవ్యక్తి

గొప్పగా రాణిస్తాడు! మానసికంగా ఎంతో ఉన్నతంగా ఎదిగిపోతాడు! 'డబ్బు' మనిషి సృష్టించుకున్నది! ఐహిక సుఖాలకీ, విషయ వాంఛలు, తీర్చుకుందుకూ చాలా పనికి వస్తుంది! కానీ, ఒక మనిషిని ఉన్నతుడిగా, ఆదర్శప్రాయుడిగా నిలబెట్టగలదని మాత్రం నమ్మకూడదు! అంటే ... మానసికంగా మనిషిని గొప్పవాణ్ణి చెయ్యలేదు!- అది నా సర్వీసులో సంపాదించుకున్న అనుభవం! ఎన్నో కేసుల్లో నేను తీర్పు ఇచ్చినవాణ్ణి !! మనిషి తప్పు ఎందుకు చేస్తాడని ... అహోరాత్రులు ఆలోచించేవాణ్ణి !- అంతు చిక్కలేదు! పేదవాడూ నేరం చేసేవాడు - గొప్పింటివాడూ నేరం చేసేవాడు!- ఐతే ... డబ్బున్నంత మాత్రంలో మనిషి సుఖపడి మంచివాడై ... ఏ నేరం చెయ్యకుండా బ్రతకలేడన్నమాట! అయితే ... ఎక్కడుంది అసలు రహస్యం?" - ఒక్క క్షణం ఆగి - "వేణూ! మనిషికి తృప్తి ఉండాలోయ్!- అంతేకాదు ... సాటి మనిషి మీద సానుభూతి, దయ, ప్రేమ, కరుణ, జాలి లాంటి మనిషికి వుండవలసిన సుగుణాలన్నీ వున్ననాడు - ప్రపంచంలో నేరాలుండవు! కోర్టులూ, తీర్పులూ అవసరం వుండవు!-"

"భగవంతుడు - మనిషిని సృష్టిస్తూ, సుగుణాలన్నీ కల్గిననాడు తనకి ప్రీతిపాత్రుడై ... గొప్పవాడవుతాడని తీర్మానించేడు! అందుకే ... మనిషి తయారుచేసుకున్న డబ్బు కన్నా, మనసు్స గొప్పదైన జీవితం - కలకాలం నిలుస్తుంది! నిజమైన గొప్పవాడు ఎవడు? మంచి మనసు్స గలవాడు! దవాడెవడూ? ఈర్ష్య, పగ, కోపం, ద్వేషం ... అసంతృప్తి ... ఇలాంటి వెలితి లక్షణాలూ, గుణాలూ న్నవాడు! అందుకని, మై డియర్ చైల్డ్! నువ్వెప్పుడూ గిల్టీగా ఫీలవకు! విశాల దృక్పథం అలవరచుకో! డబ్బున్న వాళ్ళంతా గొప్పగా బ్రతుకుతున్నారనుకోకు! ఇప్పుడు మా ఉష ... రాజా ... హాయిగా వున్నారనుకుంటూ ... ఓహ్ - అన్నట్టు ... రేపు మా ఉష 'బర్త్‌డే ఫంక్షన్' అదీ వుంటుంది! వాళ్ళిద్దరూ షాపింగ్‌కి వెళ్ళేరు. ఇంతసేపు నేను ఆ విషయం చెప్పడం మర్చిపోయాను!" అన్నారు ఆనందరావుగారు గబగబా.

అకస్మాత్తుగా ఆయన మాట మార్చేసిన సంగతి గ్రహించేడు వేణు! అయినా ... తిరిగి అడిగే ధైర్యం లేక -

"ఓ! అలాగా! సరే, నేనింక వెళతాను!" అంటూ లేచాడు.

ఆ రాత్రంతా - వేణు తీవ్రంగా ఆలోచించాడు! జడ్జీగారు చెప్పిన సత్యాలు మళ్లీ మళ్ళీ నెమరు వేసుకున్నాడు. ఎంతో అనుభవంతో చెప్పిన విషయాలు అవి! తేలిగ్గా కొట్టిపారేయడానికి

వీల్లేదు! కానీ, ఏమిటి? ఆయన ఉషని, రాజుని గురించి ఏదో చెప్పబోయి ఆగిపోయేరు? ఏమిటీ? వాళ్ళలో కూడా అసంతృప్తి వుందా? అనుకున్నాడు.

అకస్మాత్తుగా 'శ్యామల' గుర్తువచ్చింది! ఆ తర్వాత నవ్వుకుని - 'పనికిమాలిన పని' అనుకుంటూ పడుకున్నాడు.

## 7

'రాజు తల్చుకుంటే దెబ్బలకి కొదవా ...' అన్నట్టు - పెద్దింటివారు తల్చుకుంటే పార్టీలు బ్రహ్మాండంగా వుంటాయి!

వేణు ఆఫీసు వదలగానే 'ఆబిద్' షాపులో ఓ చిన్న ప్రజెంటేషన్ - 'చక్కని ఆర్టుతో వున్న బొమ్మ' కొని ప్యాక్ చేయించి గదికి వెళ్ళేడు!

కాళ్ళూ చేతులూ కడుక్కుని, ముఖం రెండుసార్లు రుద్ది తువ్వాలుతో తుడుచుకుంటున్న సమయంలో ఇంటివాళ్ళ చిన్నమ్మాయి 'రమ' పరిగెత్తుకుంటూ వచ్చింది.

ఆ అమ్మాయికి ఎనిమిదేళ్ళు!

"బాబాయ్ ... బాబాయ్! నీకు ఉత్తరం వచ్చింది ఇదిగో ..." అని ఓ కవరు అందించి "ఎక్కడికి బాబాయ్ తయారవుతున్నావ్? సినిమాకా?" అంది.

'తనకి వచ్చే ఉత్తరాలన్నీ ఆఫీసుకే వస్తాయి. ఇంటి అడ్రస్‌కి ఎవరు రాసేరూ?' అనుకుంటూ కవరు అందుకుని దస్తూరీ చూసేడు. తండ్రిదని తెలియగానే విసురుగా టేబుల్ మీద పడేసి ముఖం తుడుచుకుంటూ - "సినిమాకి కాదు రమా ... మా ఫ్రెండ్ ఇంటికి!" అన్నాడు.

వేణు డ్రస్ వేసుకున్నంత సేపూ రమ అక్కడే నిల్చుని వుంది!

ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ ఒక్కక్షణం కూడా నోరు మూసుకోని రమ మౌనంగా అలా నిలబడేసరికి - వేణు ఆశ్చర్యంగా వెనుదిరిగి చూసేడు.

టేబుల్ మీద వున్న ప్యాకెట్‌ని చూస్తూ నిల్చుంది.

"ప్యాకెట్‌ని చూస్తున్నావా రమా? అది మా ఫ్రెండ్‌కి! ఇవాళ ఆ ఫ్రెండ్ పుట్టిన రోజుట! రమ్మని పిలిచింది! అందుకని వెళుతున్నాను" అన్నాడు.

రమ మాట్లాడలేదు!

బూట్లు వేసుకుంటూ "అరే ... రమాదేవి ఇవాళ మాటలు మర్చిపోయిందేం?" అని నవ్వేడు.

మూతి గిర్రున త్రిప్పి - "మరే పాపం! నేనేం మాటలు మర్చిపోలేదు. నువ్వే అన్నీ మర్చిపోతున్నావ్?" అని కోపంగా చూసింది.

"నేనా?" అని నవ్వి, బూట్లు బిగించుకుని లేచి రమ దగ్గరికి వెళ్ళి "నేనేం మర్చిపోయాను రమా?" అని చెయ్యి పట్టుకున్నాడు.

విసిరికొట్టింది చెయ్యిని.

"పో!పో! నువ్వన్నీ అబద్ధాలే చెప్తావ్? నన్ను సర్కస్‌కి తీసుకెళతానని చెప్పి ఎన్నాళ్ళయింది? పోనీ ... పిన్నిని తీసుకొస్తానని వెళ్ళి, పెళ్ళి చేసుకుని ఒక్కడివే వచ్చావు! పోనీ ... నాకేమైనా లడ్డూలైనా తెచ్చావా? ఇప్పుడేమో ఆ ఫ్రెండ్ ఎవత్తో పుట్టిన రోజంటే ఎంచక్కా గౌన్లూ, బొమ్మలూ కొని పట్టుకెళ్తున్నావు? అవున్లే ... నేను ఎందుకు నీకు? నేను ఉత్తి పిచ్చిమొద్దును. నీ మాటలన్నీ నమ్మేస్తాను. నేనసలు ఏం బాగుంటాననీ? ఆ ఫ్రెండ్ ఎవరో చక్కగా రబ్బర్ బొమ్మలాగా వుంటుంది! వెళ్ళు! వెళ్ళు! పాపం! నువ్వు రాకపోతే ఏడుస్తుందేమో?"

ఉక్రోషం అంతా మాటల్లో, చేతుల్లో చూపిస్తూ ... ఇంకా తీరనట్టు కళ్ళల్లోనుంచి నీళ్ళు కారుస్తూ వేణును తోసేసి, పరిగెత్తి వెళ్ళిపోయింది!

ఒక్క క్షణం వేణు అలాగే నిలుచుండి పోయేడు!

'నిజమే! రమ చెప్పినవన్నీ నిజమే! సర్కస్‌కి తీసుకెళతానని చాలాసార్లు చెప్పాడు ... కానీ, వీలవటం లేదు. పెళ్లికి వెళ్ళేముందు ఆ అమ్మాయి చూపించిన ఉత్సాహం, ఆనందం, ఎంతెంత అనీ? తను ఎత్తుకుంటే సిగ్గుపడి దిగిపోయి ... 'ఛీ ... ఏంటి బాబాయ్?' అని ముద్దుగా విసుక్కుని - 'పిన్ని రానీయ్ ... నీ పని చెప్తా' అని బెదిరించింది!

'తప్పకుండా!' అని తనూ నవ్వేడు.

ఏదీ ఆ పిన్ని? ఏమని చెప్పాలి? నిజమే! పెళ్ళికి వెళ్ళి వచ్చాక కనీసం చిన్నపిల్లకైనా లడ్డూలు, స్వీట్లు తేలేకపోయాడు! అక్కడ జరిగిన రసాభాస వీళ్లకేం తెలుస్తుంది? ఇక్కడున్న వాళ్ళందరూ తనని ఓ వింత మృగాన్ని చూసినట్టు చూస్తున్నారు! ఎన్నాళ్ళని తను-ఇలా అజ్ఞాతంగా జీవించగలడు?

... ఉహూ! తనింక దాచుకుని బ్రతకడం కష్టం! ... ఆ సంగతి అలా ఉంచి, రమని సర్కస్‌కి తీసుకెళ్ళాలి! స్వీట్లు కొనివ్వాలి! తొందర తొందరగా ప్యాకెట్ అందుకుని తాళం వేసి వీధిలోకి నడిచేడు.

తనుండేది చింతలబస్తీలో ... రాజారావు వాళ్ళ ఇల్లు చిక్కడపల్లిలో! డైరెక్ట్ బస్ దొరికితే తప్ప ... లేకపోతే రెండు బస్సులు మారి వెళ్ళాలి! ఇప్పటికే చాలా ఆలస్యం అయ్యిందనుకుంటూ త్వరత్వరగా బస్‌స్టాప్ చేరేడు!

* * *

కార్లన్నీ ఆగి వున్నాయి. ఓ పక్క స్కూటర్లు . . . !

గేటులో నుంచుని కాంపౌండ్ అంతా కలయచూసేడు! అక్కడున్న సందడిలో ... ఆర్భాటాల్లో ... పావువంతు కూడా తనకి పెళ్ళప్పుడు జరగలేదు! గొప్పవాళ్ళ పుట్టిన రోజు పండగలు, సామాన్యుల పెళ్ళికంటే ఆడంబరంగా వుంటాయి! సామాన్యుల పుట్టిన రోజు పండుగలు - గొప్పవాళ్ళ మామూలు రోజులా కూడా వుండవు!

లేకపోతే, పాతికేళ్ళు రాబోతున్న ఉష 'బర్త్‌డే సెలబ్రేషన్' ఇంత హడావిడిగా జరుపుకుంటుందా? ప్రెజెంటేషన్లు అందుకుంటుందా? ఏదో ఒకటి తెచ్చి ఇవ్వాలి? లేకపోతే నలుగురూ నవ్వుతారు! మర్యాద తెలియని మనిషని ... అసలు మనిషే కాదన్నట్టు చూస్తారు. పోనీయ్! అసలు మానేస్తే ... అది మరీ ఇన్సల్ట్!

రమ మాటలు గుర్తు వచ్చాయి. గౌన్లు, బొమ్మలూ కొని పట్టుకెళ్తున్నాననుకుంది! తన చిన్న అమ్మాయే అనుకుని వుంటుంది! ఇంత పెద్దదనీ ... ఇక్కడ ఇంత భారీ ఎత్తున జరుగుతు పుట్టినరోజనీ తెలిస్తే! ... పిచ్చిపిల్ల - ఎంత ఆశ్చర్యపోతుందీ? అవునూ ... తను ఉత్తి పిచ్చిమొద్దనః చెప్పింది గదూ? వద్దు ... వద్దు రమా ! అలా అనకు ... పిచ్చిదానివి కాదు ! కాదు!

వేణు గబగబా ముందుకు నడిచేడు.

హాల్లో ఉష, టేబుల్ దగ్గర నుంచుని ... తన ముందున్న టేబుల్ మీద కుప్పలు, కుప్పలుగా వున్న ప్రెజెంటేషన్లు - వాటి మీద కొత్త వాటిని పడేస్తూ ... చకచకా ఇంగ్లీషులో మాట్లాడేస్తూ ... వచ్చిన వాళ్ళందరినీ పలకరిస్తూ చెప్పలేనంత సందడిగా వుంది! ప్రక్కనే రాజారావు ఫుల్‌సూట్‌లో

ఆమెతోపాటు తనూ అందర్నీ ఆహ్వానిస్తూ నవ్వుతున్నాడు. దూరంగా సోఫాలో ఆనందరావుగారు తన మిత్రుడితో కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

సర్వెంట్సు అతిథి మర్యాదలు చేస్తున్నారు. రకరకాల సూట్లు, రంగురంగుల చీరలు ... గ్లాసుల గలగలలు ... నగల తళతళలు ... నవ్వులూ, జోకులూ ... హాలంతా ఇంద్రభవనంలా వెలిగిపోతోంది!

వేణుగోపాల్ ఒక్కసారి తనను పరీక్ష చేసుకున్నాడు.

'వీళ్ళందరి మధ్య నేను నిలువగల తాహతు ఉందా? వీళ్ళందరి లాగా నా భార్యని తీసుకుని నేను ఎన్నటికైనా రాగలనా? ఆమె నలుగురిలో మన్నన పొందగల యోగ్యత వస్తుందా?... రాదు! అదంతా ఉట్టి భ్రమ! తనని మభ్యపెట్టుకుంటూ ఎన్నాళ్ళిలా...?' గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపోదామనుకుంటూ వుండగానే ... రాజారావు చూసి "హల్లో!" అనేసేడు! ఇక తప్పనిసరిగా లోపలికే అడుగు వేసేడు!

పార్టీ ముగిసి ఇల్లు చేరేసరికి పదకొండైంది.

గది తాళం తీస్తూ .. 'రేపు రమని తప్పకుండా సర్కస్‌కి తీసుకెళ్ళా'లనుకున్నాడు. టేబుల్ మీద ఉత్తరం కనిపించింది.

విసుగ్గా వున్నా ... నెల్నాళ్ళ తర్వాత తండ్రి రాసిన ఉత్తరంలో ఏం వుంటుందో అన్న త్రకతతో కవరు చింపేడు.

## 8

రాత్రి నుండి మబ్బు మబ్బుగా వుండి ... తెల్లవారిన దగ్గర్నుంచి చలిగాలి, వాన చినుకులు ... ఉన్నట్టుండి రివ్వున వీచే ఈదురుగాలి! వాతావరణం చాలా మందకొడిగా ... పనులకి అంతరాయం కల్గించేదిగా వుంది!

కామేశ్వరికి రెండు రోజులనుంచి ఒంట్లో బాగాలేదు. రాత్రినుంచి జ్వరం కూడా తగిలింది. పెద్దకూతురికి నెలలు నిండేయి. పురిటికి వచ్చి వుంది. చిన్నకూతురు మెట్రిక్ పరీక్ష ఒకసారి తప్పి - సెప్టెంబరు ఛాన్సుకి వెళుతోంది! అందుకని గదిలోనుండి బయటికి రాకుండా శ్రద్ధగా చదువు కుంటోంది. మిగతా పిల్లలు చిన్నవాళ్ళు! ఇక ఇంట్లో పని చేయగల వాళ్ళెవరూ?

కామేశ్వరి మంచం మీద ముసుగు పెట్టుకొని పడుకుని అందులోనుంచే గొణగటం మొదలెట్టింది.

"దిక్కుమాలిన గాలివాన! కాలం కాని కాలంలో అన్నీ అవాంతరాలే! ఎక్కడో బంగాళా ఖాతంలో వాయుగుండం అయితే ఇక్కడెందుకు రావాలీ ... ఈ గాలివాన! ప్రారబ్ధం! పిల్లాడి పెళ్ళి చేసినా ఓ ముద్దూ, ముచ్చటా లేదుకదా? ఓ పండగా, పబ్బం లేదుగదా? కోడలు వచ్చిందన్న సంతోషం ముందే లేదు ... ఎందుకు ఏడవను? పనీ రాదు, పాటా రాదు సరిగదా ... తిండం కూడా చేతగాదు! నా ఖర్మ! ఈ పిచ్చి పీనుగ కోడలితో - నా అత్తరికం మండినట్టే వుంది! కూర్చోబెట్టి ఎవరు పెడ్తారూ? ఏ అత్తకి పట్టని ఖర్మ నాకే పట్టింది. ఈ వెర్రి పీనుగ మూలంగా నలుగురిలో నవ్వుల పాలే కాక, కన్న కొడుకు ఇంటికి దూరమయ్యాడు. ఏనాడు చేసుకున్న పాపమో?"

అంటూ ముసుగులో వెక్కిళ్లు మొదలెట్టింది!

పురుషోత్తం కాఫీ కుంపటి దగ్గర్నుంచి లేచి వచ్చి - "ఇదుగో కామేశ్వరీ ... ప్రొద్దున్నే ఏమిటీ నీ గోల? రోగం వచ్చిన దానివి ... నోరు మూసుకుని పడుకో! నేనూ, పిల్లలూ ఎలాగో వంటచేస్తాం! కాఫీ అవగానే నీకు ఇస్తాను గానీ ... కాస్సేపు ఊరుకుందూ? అసలే నా ప్రాణం విసుగెత్తి వున్నాను. ఏం చెయ్యను? కుడితిలో పడ్డ ఎలుకలా వుంది నా పని! ఇప్పుడు నీకు రోగం వచ్చిందనుకో, ఆ కోడలు నిత్యరోగి అనుకుందాం! చేసుకున్న ఖర్మ కదా ... అస్తమానం ఆడిపోసుకుంటే మాత్రం ఆ పిచ్చిదానికి తెలుస్తుందా, ఏడుస్తుందా? ఉన్నపళంగా బుద్ధిమంతురాలై పోదుకదా? ఎలాగో ఈ రెండేళ్లు భరించి వాళ్ళతో తెగతెంపులు చేసుకుందాం! అంతవరకు మనకి ఆ పొలం మీద రా అందుతూనే ఉంటుంది కదా ...!" అని మంచం దగ్గర కూర్చుని నచ్చ చెప్పేడు.

చివాలున ముసుగు తీసి లేచి కూర్చుని "రెండేళ్ళు కాదు గదా ... రెండు రోజులు కూడా నేను భరించలేను. అందరి కోడళ్ళూ అత్తలకి చాకిరీలు చేస్తుంటే నేను కోడలికి చెయ్యాల్సి వస్తోంది వెధవ పొలం! ఆ రాబడి తగలెయ్య! నా కొడుకు నాకు కాకుండా పోయాక ఇంక ఈ బ్రతుకెందుకు? వాడికే అక్కర్లేని ఈ పిచ్చిమొద్దు నా కెందుకు? తీసుకెళ్ళి వాళ్ళింట్లో దించిరండి! లేకపోతే హైదరాబాదు తీసుకెళ్ళి వాడి దగ్గరే వదిలేయండి! ఏదో ఒకటి చెయ్యండి! నేనింక భరించలేను రేపు మన అమ్మాయికి పురుడు పుణ్యం పోసుకోవాలా? దీనికి నేను సేవ చేయగలనా? వెంటనే ఏదో ఒకటి చెయ్యండి" అంటూ విరుచుకు పడింది.

గట్టిగా నిట్టూర్చి "సర్ లే! ఇప్పుడు నువ్వు ఆయాసపడకు!" అని లేచి వెళ్ళేడు.

ఆ రోజంతా పెద్ద కూతురు కమల, చిన్న కూతురు లక్ష్మి, మిగిలిన పిల్లలు ... శ్యామలని తిడుతూ విసుక్కుంటూనే వున్నారు. పురుషోత్తానికి విసుగ్గానే వుంది! కానీ ... పరిష్కారం ఏదీ? ఎలాగో వంట ముగించి అందరికీ భోజనాలు పెట్టి ఆనాటి కార్యక్రమం ముగించేడు. కానీ, కామేశ్వరికి మర్నాటికి కూడా జ్వరం తగ్గకపోగా ... పలవరింతలు, వెర్రిచూపులు కూడా మొదలెట్టింది. మాటి మాటికీ "వేణు నాయనా" అనడం, ఏడ్వడం! "ఓరి దేవుడా? దీనికి కూడా పిచ్చి పట్టుంది కాబోలు!" అని పురుషోత్తం హడలిపోయి ఆ రాత్రంతా ఆలోచించి కొడుక్కి ఉత్తరం రాసేడు.

'తల్లికి జబ్బు చేసిందనీ ... నీ కోసం కలవరిస్తోందనీ ... కన్నతల్లి పైన కక్ష అనవసరం! కనుక నీ కోపం అంతా నాపైన చూపు. నా కెప్పుడైనా రోగం వస్తే నువ్వు చూడవద్దు. ఇప్పుడు కూడా నేను నీకు కనిపించను. ప్రక్క ఊరికెళ్ళి నువ్వు వచ్చి వెళ్ళేక తిరిగి ఇంటికి వస్తాను. కనుక అమ్మను చూడ్డానికి రావలసింది' .... అని!

# 9

అమ్మ తన కోసం బెంగపెట్టుకుందంటే జాలేసింది వేణుకి! ఆ తర్వాత తండ్రి తనకి కనిపించకుండా ప్రక్క ఊరికి వెళతాడా ... అని బాధ కూడా కల్గింది! కవరు మడిచి టేబుల్ మీద పడేసి పడుకున్నాడు.

మర్నాడు ఆఫీసుకెళ్ళి రెండు రోజులు సెలవు పెట్టి సాయంత్రం ఇంటికి వచ్చాడు.

ఇంటి వారింట్లో వాళ్ళంతా కంగారుగా వున్నారు. తన గది తాళం తియ్యకుండా అక్కడికి వెళ్ళి "ఏమిటండీ ... ఏం జరిగిందీ?" అని యజమానిని అడిగేడు.

'రాజయ్యగారు' కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ "నాయనా వేణూ! గ్రహచారం చాలకపోతే గోచీలో పిడుగు పడటమంటారు! అలాగే జరిగింది. మా రమ టేబుల్ ఎక్కి క్రింద పడింది. చెయ్యి ఫ్రాక్చర్ అయింది. ఆస్పత్రికి తీసుకెళ్ళాం ... కట్టు కట్టారు. గాజులు విరిగి లోపలికి గుచ్చుకున్నాయి. అవన్నీ తీసి కట్టు కట్టారు. ప్రస్తుతం స్పృహలో లేదు. వాళ్ళమ్మ అక్కడే వుంది. ఆవిడ ఏడ్పు చూడలేక నేను ఇలా వచ్చాను. రాత్రికి బ్రెడ్, పాలు, పళ్ళు తీసుకెళ్ళాలి!" అన్నారు.

"అయ్యో! ఎంత పని జరిగిందీ? ఎక్కడ? ఆర్థోపెడిక్ ఆస్పత్రేనా? నేను వెళతాను. బ్రెడ్, పళ్ళూ తీసుకెళతాను. అక్కడ పాలు తీసుకుంటాను. ఫ్లాస్కు ఇవ్వండీ!" అని అడిగేడు.

"సరే! అయితే - ఇదిగో మా మూడోవాడు కూడా వస్తాడు, వెళ్ళిరండి. ఏమిటో ... లేచిన వేళ! ఏ సమయానికి ఏం జరుగుతుందో తెలియదు కదా?" అని నిట్టూర్చేరు రాజయ్యగారు.

వేణు, రాజయ్యగారి మూడో అబ్బాయి చంద్రంతో కల్సి ఆస్పత్రికి బయల్దేరేడు.

"చంద్రం! అసలెలా పడింది?"

"మధ్యాహ్నం స్కూలు నుంచి వచ్చిందండీ! అమ్మ - పాలు తాగవే అంటే, ఉండమ్మా ... మా స్కూలు వాళ్ళంతా సర్కస్‌కి వెళుతున్నారు. నేను వెళతాను. తొందరగా డబ్బులియ్యమంది! అమ్మేమో ... అలా స్కూలు పిల్లలతో వెళ్ళొద్దు - సాయంత్రం వేణూ బాబయ్య గారితో కల్సి, అన్నయ్యతో కల్సి వెళుదువులే అని చెప్పింది. వేణు బాబయ్యతో వెళ్ళను అన్నది! అమ్మతిట్టి, పోనీ నాన్నగారే తీసుకెళతారని చెప్పేక పాలు తాగింది. ఆ తర్వాత నేను చదువుకుంటున్నానండి. తనేమో ... హాల్లో టేబుల్ ఎక్కి దానిమీద స్టూల్ పెట్టి సర్కస్ ఫీట్లన్నీ చేస్తుంటే నేను కోప్పడ్డాను. కానీ ... అది వినకుండా మళ్ళీ ఎక్కింది. కాలు జారి క్రిందపడింది. చూస్తుండగానే చెయ్యి వాచిపోయి ... అది గోలపెడ్తుంటే నాన్నగారి ఆఫీసుకి ఫోను చేసేమండి. ఆయన వచ్చాక ఆస్పత్రికి తీసుకెళ్లితే చెయ్యి విరిగిందని చెప్పారు డాక్టర్!" చంద్రం, మధ్యాహ్నం జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పేడు.

వేణు నిట్టూర్చేడు!

ఆస్పత్రిలో ... తెల్లని బెడ్‌మీద కళ్ళు మూసుకొని పడుకున్న రమ చేతికి కట్లు, కాలికి అక్కడక్కడా ప్లాస్టర్లు అంటించి వున్నాయి! తల్లి అక్కడే నుంచుని వుంది.

"ఏమండీ ... ఎలా వుందీ? తెలివి వచ్చిందా? మాట్లాడుతోందా!" ఆత్రుతగా అడిగేడు.

"ఇప్పుడే వచ్చింది నాయనా! విపరీతంగా భయపడింది. జ్వరం కూడా తగిలింది" బొంగు గొంతుకతో ఆవిడ చెప్తుంటే -

"ఫర్వాలేదు లెండి. చిన్నపిల్ల కదూ? అయినా ... వెర్రిపిల్ల, సర్కస్ ఆటలు ఆడి చెయ్యి విరగ్గొట్టుకుంది!" అంటూ ఫ్లాస్కు క్రిందపెట్టి మంచం దగ్గరకి నడిచేడు.

"రమా! రమా!" మెల్లగా, చెవి దగ్గరగా వినిపిస్తున్న పిలుపుకి కళ్ళు తెరిచి చూసింది రమ.

"బాబాయ్!" అంటూ చెయ్యి చాపబోయి ఆగింది. "నా చెయ్యి విరిగిపోయింది బాబాయ్! ఇంక నేను ఎలా చదువుకోగలను? నీతో సర్కస్ చూడను అన్నాను ... అందుకే నా కిలా అయ్యింది" అంటూ ఏడ్చింది.

"ఛ! తప్పుకదూ ... ఏడుస్తారేంటి? నీకు చెయ్యేం విరగలేదు. అతుక్కుపోతుంది తెలుసా? ఎంచక్కా చదువుకుంటావు. నాతో సర్కస్ చూడకపోతే మాత్రం ఇలా అవాలా? అదేం కాదు. నీకు కాలు జారింది ... అంతే! అంతా తగ్గిపోయి నువ్వు మళ్ళీ మామూలుగా తిరుగుతావు! ఏం ఫర్వాలేదు రమా!" అని చెంపలు తుడిచి తల నిమిరేడు వేణు.

"ఇందాక కూడా ఇలాగే ఏడ్చింది నాయనా! ఎంత ఊరుకో బెట్టినా ఊరుకోలేదు" అన్నది మంచం దగ్గరగా వచ్చిన తల్లి.

"అవునా రమా! ఛ! ఛ! అలా ఏడవకూడదమ్మా - తప్పు కదూ? ఈ సిస్టర్లంతా నవ్వరూ?"

"అవును ... నా చెయ్యి విరిగి నేను ఏడుస్తుంటే ... వాళ్ళంతా నవ్వుతారు."

"అదిగో ... మళ్ళీ అదే మాట!" వేణు మెల్లగా కోప్పడి బుజ్జగిస్తూ వుంటే సిస్టర్ వచ్చి లైట్ వేసింది.

"చూడండీ! మీరు పేషంట్‌ని అలసటపెట్టకూడదు. రెస్టు తీసుకోనివ్వండి. మాట్లాడించడం, ఏడ్పించటం పనికిరాదు. తనకి ఫీవర్ వుంది ... కాస్సేపు పడుకోనివ్వండి. మీరంతా బయటికి వెళ్ళండి!"

సిస్టర్ చెప్పగానే వేణు, చంద్రం, తల్లి బయటికి నడిచారు.

వరండాలోకి రాగానే "వేణూ! నాయనా! చెయ్యి అతుక్కుంటుందా? ఆడపిల్ల కదా! ఎంత ౦?" అంటూ తన భయం వ్యక్తం చేసిందా తల్లి!

"మరేం ఫర్వాలేదండి! లేత ఎముకలు త్వరగా అతుక్కుపోతాయి! ఎటొచ్చీ బ్యాండేజి విప్పేవరకు కొంచెం కష్టం!" ధైర్యం చెప్పాడు.

"ఏమో నాయనా? అన్నీ బాగా వుంటేనే ఆడపిల్లకి పెళ్ళవటం కష్టం! ఇంక ఏ అవకరమైనా వుంటే, చెప్పాలా? అంత ఆదరించి చేసుకునే ఆదర్శ పురుషులు ఎవరుంటారు నాయనా? ఉన్న ఇద్దరు ఆడపిల్లల్లో ఒక పిల్ల అవకరమైతే మా బ్రతుకెంత కష్టమో? దాని బ్రతుకెంత కష్టమో? తల్చుకుంటేనే భయం వేస్తోంది. కోటి దేవుళ్ళకి మొక్కుకుంటున్నాను" అంటూ కళ్ళొత్తుకుంది.

చాలాసేపు ధైర్యం చెప్పి ... చంద్రాన్ని తీసుకొని ఇంటికి వచ్చేసేడు వేణు.

రాత్రి భోజనం చెయ్యాలనిపించలేదు వేణుకి! హోటల్లో టిఫిన్ తిని, కాఫీ తాగి వచ్చాడు.

పడుకున్నా నిద్రపట్టలేదు! తండ్రి రాసిన ఉత్తరం ... రమని గురించి తల్లి పడే బాధ ... ఏమిటోఅన్నీ అల్లిబిల్లిగా తిరుగుతూ రొద చేస్తున్నట్టనిపించింది. రమకి చెయ్యి అతుక్కోకపోతే పెళ్ళి కాదేమోనని ఆ తల్లి బాధ చూస్తే ... ప్రతి ఆడపిల్ల తల్లీ అలాగే బాధపడుతుంది గదా? ... అనిపించింది. ఆవిడ చెప్పింది నిజమే! అవకరం ఉన్నా, ఆమోదించి చేసుకునే ఆదర్శవంతులు ఎందరుంటారు? ప్రపంచంలో అందరూ అందంగానే వుంటారా? ఖర్మ వశాత్తు ఏదైనా లోపం వుంటే, ఇంక వాళ్ళకి పెళ్ళి కాదా? మగాడు అంత మూర్ఖంగా వుంటాడా? తనూ అంతేనా? శ్యామలని తను తీసుకొచ్చాడా? ఉహూ ... శ్యామల సంగతి వేరు!! ఛ! ఏమిటో తల తిరిగి పోతోంది!

లేచి తలుపు తీసుకొని బయటికి వచ్చాడు.

సరిగ్గా అప్పుడే రాజయ్య గారు భార్యకి క్యారియర్ ఇచ్చి తిరిగి ఇంటికి వచ్చారు. "ఏం నాయనా? ఇంకా నిద్రపోలేదా?" అని అడిగితే, వేణు నవ్వి "లేదండి! నిద్ర పట్టడం లేదు!" అన్నాడు.

రాజయ్యగారు ఒకసారి వేణుని చూసి "చూడు వేణూ ... నేను చెప్తున్నానని ఏం అనుకోకు ... నువ్వు మీ ఆవిణ్ణి తీసుకురా! నువ్వు పెళ్లి చేసుకుని వచ్చినప్పట్నుంచీ మునుపట్లాగా లేవు. సహజమే ననుకో! కానీ, ఇన్నాళ్ళు ఆవిణ్ణి మీ వాళ్ళ దగ్గర వదిలి రావడం అంత బాగాలేదు. ఇంక మాకు ఎప్పుడు చూపిస్తావ్?" అని నవ్వేరు.

వేణు మరోసారి నవ్వి "సరే లేండి! మీరంతా ఆవిడ కోసం చాలా ఎదురు చూస్తున్నారు' నేను రేపు తెల్లవారుఝామున మా ఊరు వెళుతున్నాను. మా అమ్మగార్కి ఒంట్లో బాగాలేదు; నన్ను చూడాలని అడుగుతోందిట! నిన్న వచ్చిన కవరు మా నాన్నగారు వ్రాసేరు. ఇందాకనే చెబ్దామనుకున్నాను. రమని చూడడంతో ఆ సంగతి మర్చిపోయేను. ఆ! అది సరే ... రమ ఎలా వుంది? జ్వరం తగ్గిందా?" అన్నాడు.

"ఆ! ఇప్పుడు నేను వచ్చేసరికి నిద్రపోతోంది! ఏదో ఇంజక్షన్ ఇచ్చేరు. ఊ! అయితే ... అమ్మగార్కి బాగాలేదా? వెళ్ళు వెళ్ళు ... పాపం, ఆవిడకి నిన్ను చూడాలనిపిస్తోంది కాబోలు! వచ్చేటప్పుడు నీ భార్యని తీసుకుని రా! ఇలా రాత్రిళ్ళు నిద్రలేకుండా ఎన్నాళ్ళు గడుపుతావ్?" అని నవ్వి "రేపు ఎటూ ఊరికెళుతున్నావు గనుక - ఈ రాత్రికి ఎలాగో నిద్రపో, వెళ్లు లోపలికి!" అంటూ తమ ఇంట్లో కెళ్ళిపోయారు.

క్రాపులోకి వేళ్ళు దూర్చుకుని జుట్టు పీక్కున్నాడు వేణు. 'మీ ఆవిణ్ణి తీసుకురా, మీ ఆవిణ్ణి తీసుకురా! అందరూ ఒకే పాట! తీసుకొచ్చి ఏం చేయను? నా 'జాగరణ'లు నాకెటూ తప్పవు! పైగా ... దానికి వంట చేయడం చేతకాదు కనుక నేనే చేసి పెట్టాలి! రోజూ దాని సేవ చెయ్యాలంటే ఆఫీసులో పని ఎవరు చేస్తారూ? ఈ గోలంతా మీ కెలా చెప్పను?' జుట్టు పీక్కుంటూనే గదిలోకి వెళ్లి పడుకున్నాడు.

# 10

బియ్యపు రవ్వతో కాస్త జావకాచి - పలచని మజ్జిగ పోసి కంచం ముందు పెట్టేడు పురుషోత్తం! మెల్ల మెల్లగా ఊదుకుంటూ తాగుతోంది కామేశ్వరి. ఆ రోజే ఆమెకి జ్వరం తగ్గి కాస్త జావ తాగుతోంది!

కమల, లక్ష్మి మిగిలిన పిల్లలు అన్నాలు తింటున్నారు. శ్యామలకి ఒక కంచంలో ఇంత అన్నం పెట్టి కాస్త కూర పడేసేరు. మిగిలిన వాళ్ళందరూ ఎవరికి కావల్సినవి వాళ్ళు వడ్డించుకుంటూ తింటున్నారు.

ముందుగదిలో జావ తాగుతున్న కామేశ్వరికి చెమటలు పట్టకుండా పురుషోత్తం విసురుతున్నాడు.

"చూసేరా? అబ్బాయి రానేలేదు. ఇంక రాడండీ! నేను బ్రతికి వుండగా రాడేమో?" అంటూ నీళ్ళు పెట్టుకుంది కామేశ్వరి.

"అబ్బబ్బ ... తొందరపడకే? ఇంకా నా ఉత్తరం అంది, వాడు బయల్దేరి రావడానికి టైమ్ పడుతుంది!"

"ఏమో? నాకు నమ్మకం లేదు. ఈ పెళ్ళి ఏ ముహూర్తాన జరిగిందో కానీ, ఇల్లు వరుస మారిపోయింది. ముందు ఈ శని గ్రహాన్ని వాళ్ళింటికి పంపేయండి!" అని కోడల్ని తిట్టింది.

"సరేలే ... ముందు నువ్వు జావ తాగేయి" అన్నాడు పురుషోత్తం.

చేతి సంచితో గుమ్మంలో అడుగుపెట్టేడు వేణు.

"ఎవరూ?! నాయనా వేణూ! వచ్చావా? నా తండ్రీ ... ఇలా రారా?" వెర్రి ఆనందంతో కేక పెట్టింది కామేశ్వరి.

పురుషోత్తం చటుక్కున లేచి గబగబా పక్క గదిలోకి తప్పుకున్నాడు. వేణుకి బాధనిపించినా .... ఆ క్షణంలో ఏమీ మాట్లాడలేదు - తల్లి దగ్గర కూర్చుని యోగక్షేమాలడిగి, అందర్నీ అడిగేడు.

కామేశ్వరికి మాటలే రావడం లేదు. కొడుకు శరీరం నిమురుతూ "చిక్కిపోయావురా! ఎంతకాలం ఆ హోటల్ కూడు తినాలో ...! నీ ప్రాణానికి ఈ పెళ్ళి చేసి నీకు తీరని వెలితి చేసేరు మీ నాన్న! పోన్లే! దాన్ని వాళ్ళింట్లో వదిలేసి ... మళ్ళీ పెళ్ళి చేసుకుందువులే! నీకు నచ్చిన పిల్లని ... నువ్వే చేసుకో!" అంది.

"ఆ సంగతి ఇప్పుడు ఎందుకులే! కమల, లక్ష్మి అంతా బాగున్నారా?" అంటున్నంతలో ఇంట్లోనుంచి ఒక్కొక్కరే వచ్చి 'అన్నయ్యా వచ్చావా?' అంటూ పల్కరించేరు.

"ఏమ్మా కమలా? ఆరోగ్యం బాగుందా? లక్ష్మీ ... పరీక్షలకి బాగా చదువుతున్నావా?" అని తమ్ముళ్ళని దగ్గరికి తీసుకున్నాడు.

"ఒసే లక్ష్మీ! అన్నయ్యకి ముందు కాస్త కాఫీ పెట్టి ఇవ్వవే! తర్వాత స్నానం చేసి అన్నం తింటాడు" అన్నది కామేశ్వరి.

ఎంగిలి చేతుల వాళ్ళంతా మళ్ళీ లోపలికి వెళ్ళేరు. వేణు కూడా వంటింట్లోకి వెళ్ళేడు.

అక్కడ అతను చూసిన దృశ్యం ... !?

రుబ్బురోలు దగ్గర, నీళ్ళ మడుగులా వున్న చోట ... కంచంలో కొద్దిగా అన్నం, కూర ముక్కలు వేసి, కూర్చునేందుకు ఓ గోనె ముక్క పడేసి ... 'శ్యామల' అనే ఒక జీవికి ఆకలిబా తీర్చడానికి, ఓ చిన్న ప్రయత్నం చేసిన సాక్ష్యంలా నిలిచింది ... ఆ పిచ్చిది!

మిగతా వాళ్ళంతా ... కాస్త దూరంగా పీటలు, కంచాలు పెట్టుకుని ... పప్పు, కూర, పులుసులతో నేతి గిన్నె, పెరుగు గిన్నె వంపుకుంటూ తింటున్నారు.

"దానికో మజ్జిగ చుక్క పొయ్యవే అక్కా!"

"పులుసు పోసుకుంటుందేమో!"

"దాని ముఖం! దానికి ఒక ఇష్టం కూడానా?"

మూల వున్న గిన్నెలో మజ్జిగనీళ్లు తెచ్చి కంచంలో వొంచేసింది కమల!

అన్నం, కూర ముక్కలు మజ్జిగ నీళ్ళలో తేలిపోయాయి!

"తిను" అని కసిరింది లక్ష్మి.

ఎందుకో ... తల ఎత్తి చూసింది శ్యామల. గుమ్మంలో వేణు కనిపించేడు!

కళ్ళు ఆశ్చర్యంగా పెట్టి ఎప్పుడో గుర్తున్నట్టు ఓ నవ్వు నవ్వి మెల్లగా దించుకుంది తల.

అంతరాంతరాలలో ... అట్టడుగు పొరల్లో ... గడ్డ కట్టిన మానవత్వం ఒక్కసారి కరిగి ... పొంగింది! హృదయం కదిలినట్టయింది! గుండెలో గుచ్చుకున్నట్లనిపించింది!!

ఎంత దీనావస్థ!

'ఈ ఇంటి కోడలు! కానీ ... ఎంత నిరాదరణ స్థితిలో వుంది?' అనిపించింది వేణుకు. తనను చూసి నవ్వింది. ఎందుకు? గుర్తు పట్టిందా? తెలుసుకో గల్గుతోందా?

"అన్నయ్యా ... కాళ్ళు చేతులు కడుక్కుని రారా, కాఫీ పెడ్తున్నాను." అంది లక్ష్మి.

మెల్లగా కదిలి పెరట్లోకి వెళ్ళిపోయేడు.

కాఫీ త్రాగేక తండ్రిని మామూలుగా వెనకటిలాగానే పల్కరించేడు. పురుషోత్తం సంతోషించేడు. భార్య చెప్పిన సలహా తనూ చెప్పేడు. శ్యామలని వదిలేసి మళ్ళీ పెళ్ళి చేసుకోమని!.

మళ్ళీ వేణు 'ఆ సంగతి వదిలేయి!' అనే చెప్పాడు. ఇక ఆ తర్వాత అందరూ సరదాగా కబుర్లు చెప్పుకున్నారు.

స్నానం, భోజనం కానిచ్చి గదిలో పడుకున్నాక ... 'ఇంతసేపూ శ్యామల ఎక్కడుందా?' అనుకున్నాడు. కమల మధ్యగదిలో పడుకుంది. తండ్రి బయటికి వెళ్ళేడు. లక్ష్మి చదువుకుంటుంది. తల్లి మంచంలో పడుకుని చూస్తోంది.

మరి శ్యామల ఏదీ?

లోపలికి వెళ్ళి చూసేడు. వంటింటి ప్రక్కనున్న చిన్న టిక్కీ లాంటి గదిలో బల్లమీద కూర్చుని కిటికీ లోంచి బయటికి చూస్తోంది!

ఆ ఇంట్లో 'శ్యామల' అనే మనిషి వున్నట్లు ఎవరూ గుర్తించడంలేదు. ఏదో పడేస్తారు ... తింటుంది! ఎక్కడో కూర్చుంటుంది! ఏమనీ అడగరు! గిర్రున వెనక్కి తిరిగి వచ్చి పడుకున్నాడు.

సాయంత్రం మెలకువ వచ్చేసరికి ... కమల కేకలు వినిపిస్తున్నాయి!

"శని గ్రహమా! ఏ జన్మలో చేసుకున్న పాపమో మాకు నువ్వు చుట్టుకున్నావు! మీ వాళ్లు నిన్ను కని మా నెత్తిమీద పారేసేరు. ఏదీ చేతగాదు. తినమంటే తింటావు ... వెర్రి తిండి! ఫో ... మీ వాళ్ళ దగ్గరికి ! నీ కిక్కడ మేం చాకిరీ చెయ్యలేం!"

శ్యామల గొంతు వినిపించలేదు.

"అక్కా! నువ్వు అలసట పడకే ... దానితో నీకేమిటి?"

- అది లక్ష్మి గొంతు.

తమ్ముళ్ళు ఎందుకో నవ్వుతున్నారు.

వేణు లేచి బయటికి వచ్చాడు.

వంటింట్లో శ్యామల ఒక గ్లాసు పట్టుకొని గోడవారగా నిలబడి వుంది. మంచినీళ్ళ బిందె దగ్గర కమల ... అవతల ప్రక్క లక్ష్మి, తమ్ముళ్ళు నిలుచుని .... శ్యామలని అందరూ వింత మృగంలా చూస్తున్నారు.

ఇంతకీ, మంచినీళ్ళు కావల్సి వచ్చి గ్లాసు తీసుకుని స్వయంగా బిందె దగ్గరికి వచ్చిన శ్యామలను కమల చూసి తిడ్తోంది! "కావల్సినది అడగాలి గాని ... స్వయంగా నువ్వు చెయ్యటమేనా?" అని! - నీళ్ళలో చేతులు ముంచేస్తుందేమో ... అని భయంట! తోమి పెట్టిన గ్లాసులు పాడు చేస్తుందిట!

'శ్యామలకు మతి స్థిరం లేక పోవచ్చును కానీ... అంటరానిది కాదు కదా? ఎందుకు తిడ్తుంది?' అనుకున్నాడు వేణు.

శ్యామల చిన్నగా నవ్వుతూ తన చేతిలోని గ్లాసు క్రింద పెట్టేసింది! ... ఆ తర్వాత లక్ష్మి ఇచ్చిన నీళ్ళు త్రాగింది.

వేణు దీర్ఘంగా నిశ్వసించి బయటికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి భోజనాల దగ్గర - ముందుగా వేణు, పురుషోత్తం, మిగిలిన మగపిల్లలు తిన్నాక ... లక్ష్మి, కమల పెట్టుకున్నారు. శ్యామలకి .. మధ్యాహ్నం మాదిరిగానే కంచంలో ఇంత అన్నం, కాస్త పచ్చడి పడేసి రోటి దగ్గర తూము పక్కగా పెట్టేరు.

నెయ్యి వెయ్యడం, కూరా, పులుసులు అడగడం ... అలాంటివేమీ లేవు! పచ్చడి మెతుకులు పిచ్చిగా కలిపి తింటోంది. సగం తిన్నాక చారు పోసేరు ... మళ్ళీ కొంచెం అన్నం వేసి మజ్జిగ పోసేరు! ఏ దానికీ 'వద్దు'- 'కావాలి' అని అనటం లేదు శ్యామల ... అసలు అలా అనడానికి వీల్లేకుండా అన్ని పనులూ వీళ్ళే, వీళ్ళ ఇష్టానుసారంగా ... వీలున్నట్టుగా చేస్తున్నారు.

తినటం అయ్యాక, శ్యామల లేచి తన కంచం తీసుకొని పెరట్లోకి వెళ్ళి చెంబుడు నీళ్ళు కుమ్మరించి తెచ్చింది.

"ఆ! అక్కడే తగలేయి! ఇలారాకు!" అని అరిచింది లక్ష్మి.

శ్యామల మెల్లగా కంచం రోటి ప్రక్కన పెట్టి, చిన్నగా నవ్వి, నిలుచుంది! ఎగుడు, దిగుడుగ ఉన్నాయి చీర కుచ్చిళ్ళు!

"వెళ్ళు- నీ గదిలోకి! ఇక్కడ ఎందుకు దిష్టి పిడతలాగా?" అని కసిరింది కమల.అప్పుడు శ్యామల తల వంచుకుని ఆ టిక్కీలాంటి గదిలోకి వెళ్ళిపోయింది.

అన్నీ గమనిస్తున్నాడు వేణు!

అతనిలో చిన్నగా కంపన ప్రారంభమైంది!

రాత్రి నిద్రపట్టలేదు. అర్ధరాత్రి దాకా పక్కమీద దొర్లి దొర్లి విసుగనిపించి మెల్లగా లేచేడు. ఇంట్లో అందరూ పక్కలు వేసుకొని ఆదమరిచి హాయిగా పడుకున్నారు ... వాళ్ళని చూస్తూ, శ్యామల వున్న గది దగ్గరికెళ్ళాడు!

చిత్రం! ఆమె పడుకోలేదు. మధ్యాహ్నం లాగానే కిటికీ దగ్గర కూర్చుని బయటికి చూస్తోంది!

గుమ్మంలో నిలుచుని ఆశ్చర్యంగా చూసేడు. అర్ధరాత్రి దాటినా నిద్ర రావటం లేదా... అనుకున్నాడు. ఆమెను పరీక్షగా చూసేడు!

పెళ్ళినాటి కన్నా చిక్కిపోయింది! జుట్టు పెద్దదే కానీ, వేసుకోడం చేతగాక వంకర టింకరగా వుంది జడ! వెలిసిపోయిన పాతచీర కట్టుకుంది. సాయంత్రం లక్ష్మి, కమల పూలమాలలు పెట్టుకున్నారు. ఒక్క పువ్వు కూడా శ్యామల తల్లో లేదు! అమ్మా, నాన్న తనని ఎందుకు తీసుకు వచ్చినట్టు? పుట్టింట్లో ఉంచేస్తే బాగుండేది! అనవసరంగా ఇక్కడికి తీసుకువచ్చి ... వాళ్ళు బాధ పడ్తూ ... ఆమెను బాధ పెడ్తున్నారు !!

తన తలంపుకు నవ్వు వచ్చింది. ఆమె బాధ పడ్తోందో? అసలు బాధంటే తెలుసునా? ఆమెకు ఇక్కడ ఎలా ఉందనుకుంటోందో !?

రెండు నిమిషాలాగి దగ్గరికి నడిచేడు.

"శ్యామలా!"

వెనక్కి తిరిగి చూసి "నువ్వా?" అని నవ్వింది.

"అవును" "నేనే !" - అని తనూ నవ్వేడు.

"నిద్ర పోలేదా?"

"ఉహూ ... రావటం లేదు! మరి నువ్వెందుకు పడుకోలేదూ?" అనడిగేడు.

"పడుకున్నాను. మరి ఏమిటో గుచ్చుతున్నాయి! అందుకని లేచి చూస్తూ కూర్చున్నాను" అన్నది పక్కవైపు చూపిస్తూ.

చివుక్కుమన్నది వేణు హృదయం! 'పాపం నల్లులు వున్నాయేమో?'

"పోనీ ... మరి నా కెందుకు చెప్పలేదూ?" ఏమని సమాధానం చెపుతుందోనని అనడిగేడు.

"అమ్మో?!" అంటూ గుండెల మీద చేయివేసుకొని "వాళ్ళంతా నన్ను తిడ్తారు" అంది.

వేణు మనస్సు గిలగిలలాడింది.

"శ్యామలా? పోనీ ... మీ అమ్మవాళ్ళ దగ్గరికి వెళ్ళిపోతావా? అక్కడ మీ అమ్మ నిన్ను బాగా చూస్తుంది"

"ఉహూ! వెళ్ళను! అమ్మ ఇప్పుడు నన్ను బాగా చూడదు. నాకు పెళ్ళైందట కదా? ఇం: నేను వాళ్ళ దగ్గిర వుండకూడదుట!" అంది.

"మరి ఎక్కడ వుండాలీ?" ఆశ్చర్యంగా చూసేడు.

"ఇక్కడేట! ఇది అత్తవారిల్లట కదా?" అనడిగింది.

"అవును! మరి నేను ఎవర్ని అని చెప్పింది".

"ఏమో నాకు చెప్పలేదు. నువ్వు నన్ను పెళ్ళి చేసుకున్నావుట గదా? అందుకని నేను ఇక్కడే వుండాలిట!"

"ఫర్వాలేదు, కొన్నాళ్ళు మీ ఇంట్లో కూడా వుండవచ్చును. వెళ్ళు. ఇక్కడ నీకు బాధగా లేదూ?"

"ఏం బాధ? అక్కడైతే అమ్మ కొడ్తుంది. ఆరోజు నువ్వెళ్ళి పోయావుట కదూ? అందుకని నన్ను బాగా కొట్టింది. ఉహూ ... నేను అమ్మ దగ్గరకెళ్ళను. వీళ్ళు నన్ను కొట్టరు గదా!"

వేణుకి మనసులో కలుక్కుమంది! హృదయం పగిలిపోతున్నట్టనిపించింది.

"ఎంత అనర్థకమైన బ్రతుకు శ్యామలా నీది?" అనుకున్నాడు.

"పోనీలే ... ఇక్కడే వుండు - నేను వచ్చి చూస్తూ వుంటాలే! చలి వేస్తోంది ... దుప్పటి కప్పుకుని పడుకో" అన్నాడు.

"సరే" అంటూ పడుకుని కప్పుకుంది.

నిట్టూర్చి బయటికి వచ్చేసేడు ...

మర్నాడు - తండ్రి మళ్ళీ శ్యామల సంగతి ఎత్తేసరికి

"ఇక్కడే వుండనీయ్ నాన్నా! నేను వచ్చి వెళ్తూ వుంటాలే" అన్నాడు.

పురుషోత్తం విచిత్రంగా చూసేడు కొడుకువైపు!

"అది కాదురా నాయనా! దానితో నువ్వేం కాపురం చెయ్యగలవు? ఎల్లకాలం యిలాగే వుంటావురా?" అన్నది కామేశ్వరి

" ఆ సంగతులు అన్నీ పెళ్ళికి ముందు ఆలోచించలేదా అమ్మా? రెండేళ్ళు వాళ్ళు టైము ఇచ్చారన్నారు గదా? అంతవరకైనా ఆగాలి!"

"అమ్మో! రెండేళ్ళు నేను దీనితో వేగగలనా? అయినా ... అది నా దగ్గర కాపురం చేస్తుందటరా?" భయంతోనూ, సంశయంగానూ అడుగుతున్న తల్లిని చూసి నవ్వి "కొన్నాళ్ళు నీ దగ్గర కాపురం చెయ్యనీయ్! తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు.

కొడుకు ఆ మాత్రం దారిలోకి వచ్చాడని పురుషోత్తం సంతోషించి "నువ్వూరుకో కామేశ్వరీ! అబ్బాయి పట్నవాసంలో దానితో ఏం అవస్థ పడుతాడూ? కొన్నాళ్ళు ఇలా సాగనీయ్" అని సర్ది చెప్పేడు.

ఆ రాత్రి రైలుకి వెళ్ళబోయే ముందు "అమ్మా! నేను అప్పుడప్పుడు వచ్చి వెళుతూ వుంటాలే. నాకోసం దిగులు పడకు!" అని ధైర్యం చెప్పేడు.

చెల్లెళ్ళని, తమ్ముళ్ళని ప్రేమగా పల్కరించి, చేతిసంచీ అందుకున్నాడు. చెప్పులు తొడుక్కున్నాక మళ్ళీ విప్పి లోపల గదిలో శ్యామల దగ్గరికి వెళ్ళేడు!

"శ్యామలా! నేను ఊరికి వెళ్తున్నాను. మళ్ళీ వస్తాలే!" అన్నాడు.

"సరే!" అని తల ఊపింది.

బయటికి వచ్చి చెప్పులేసుకుని "వస్తానమ్మా ...!" అంటూ ముందుకు సాగేడు.

"అమ్మో! అమ్మో! ఆ పిచ్చిపీనుగకి కూడా చెప్పాలా?" అంటూ లక్ష్మి ఆశ్చర్యపోయింది.

"అంతేనే! మనం ఎంత చేసినా పెళ్ళాం అనేసరికి ప్రేమే!" అని దీర్ఘం తీసింది కమల.

పురుషోత్తం కలగచేసుకుని "ఊరుకోండే! మాట మాత్రానికే మూతి విరుస్తున్నారు. దానితో ఏమన్నా ఓ ముద్దా, ముచ్చటా?" అంటూ కోప్పడ్డాడు.

రైలు కదిలింది గానీ ... వేణుకి ఆ చిన్న టిక్కీలో శ్యామల గుర్తు వస్తూనే వుంది!

నెల్లాళ్ళ క్రితం ఇలాంటి తిరుగు ప్రయాణం ఎలా చెయ్యాల్సి వచ్చిందో? ఆనాటి వేదన, సంఘర్షణను తల్చుకుంటే... విచిత్రంగా అనిపిస్తుంది - అనుకున్నాడు. ఇప్పటికీ అప్పటికీ ఎంత వ్యత్యాసం?

నిజమైన సంఘర్షణ ఇప్పుడే ప్రారంభమైంది వేణులో!

# 11

వేడినీళ్ళతో ముఖం కడిగి కాఫీ, బ్రెడ్ ఇచ్చింది రమకి వాళ్ళమ్మ!

"అమ్మా! వేణు బాబాయ్ మళ్ళీ రాలేదేం?" అని అడిగింది.

"వస్తాడమ్మా! వాళ్ళమ్మగార్కి జ్వరం వచ్చిందట! అందుకని వాళ్ళ ఊరికి వెళ్ళేడు! ఇవాళ వస్తాడు!" అంది.

"మరి ... పిన్నిని తీసుకు వస్తాడా?"

"ఆ! ఆ! నేను చెప్పేనులే ... తప్పకుండా తీసుకువస్తాడు!" అన్నారు, ప్రక్కనే వున్న రాజయ్యగారు. రాత్రి తను యథాలాపంగా వేణుతో అన్నందుకు ... ఇప్పుడు కూతురి దగ్గర అబద్ధమాడవలసిన అవసరం లేకపోయింది.

ప్రస్తుతం రమ పేషెంట్! చిన్నపిల్ల! మనస్సుకి తృప్తి కల్గిస్తే ... జ్వరం తగ్గి త్వరగా కోలుకుంటుంది! అందుకనే రాజయ్యగారు అలా చెప్పేరు. నిజంగా వేణు అతని భార్యని తీసుకొస్తాడో, లేదో తెలియదు. అయినా ... ఆ గొడవ తమకి అక్కర్లేదు. రమ బుద్ధిగా బ్రెడ్ తింటూ కాఫీ త్రాగుతుంటే తృప్తిగా చూసి-

"మరి నేను వెళ్ళివస్తాను రమా! అమ్మ ఇక్కడే వుంటుంది గదా! ఇంటి దగ్గర పనులన్నీ చేసుకోవాలి! నేను ఆఫీసుకు త్వరగా వెళ్ళాలి! మరింక వెళ్ళనా?" అనడిగి, రమ తల ఊపేక రాజయ్యగారు ఇంటికి వచ్చేరు.

వంటచేసి క్యారియర్‌లో సర్ది రమకోసం విడిగా చిన్న టిఫెన్ బాక్స్‌లో మెత్తగా పిసికిన రసం అన్నం పెట్టి, చంద్రం చేత ఆసుపత్రికి పంపేరు. అప్పటికి ఆఫీసు టైమ్ అయిపోయింది. హడావిడిగా తయారై ... బయల్దేరబోతూ వుండగా వేణు రిక్షా దిగేడు.

చాలా చిరాకుగా, కంగారుగా వున్న రాజయ్యగార్కి ఆ క్షణంలో వేణు 'ఒక్కడే' రావటం చూస్తే ... ఒళ్ళు మండినట్టయింది! కానీ, వెంటనే తమాయించుకుని "వచ్చావా వేణూ! నాకు ఆఫీసుకు వేళైపోయింది వెళుతున్నా" నంటూనే పరుగులాంటి నడకతో వీధిలోకి వెళ్ళిపోయేడు.

"ఆ! వెళ్ళండీ! వెళ్ళండి!"

- అంటున్న వేణు మాటలు వినలేదు. ఎవరైనా అద్దెకిచ్చుకుంటే - ఏదో 'ఇరుగూ పొరుగూ' అనో ... 'వదినా ... పిన్నీ' అనో ఒకళ్ళకి ఒకళ్ళు చేయూతగా, ముఖ్యంగా ఏదైనా 'ఇలాంటి' అత్యవసరాలు వచ్చినప్పుడు తోడూ నీడగా వుంటారని ఆశపడతాం! కానీ ... వేణు పెళ్ళి చేసుకున్నా భార్యని తీసుకురాకుండా ఇంకా బ్రహ్మచారిగా వుండటం నచ్చటం లేదు. ఇవాళ కనుక అతను భార్యని తీసుకువస్తే ఏదో ఆవిడ ద్వారా ... వేణు తమకి ఏదైనా వంటలో సహాయం చేయగలడనీ ... ఇంటి విషయాలు కొన్ని చూస్తారనీ ఆశపడ్డా ... ప్చ్! లాభం లేకపోయింది! అసలావిడ కాపురానికి రాదా? ... అనుకున్నారు రాజయ్యగారు.

ఎన్నాళ్ళనుంచో వేణుని ఆత్మీయంగా చూస్తున్న ఇంటి యజమానులు ... రాజయ్య గారి కుటుంబం! అందుకనే, అతన్నుండి ఆ మాత్రం సహాయం ఆశించడం జరుగుతోంది! లేకపోతే వేణు పెళ్ళి చేసుకున్నా, చేసుకోకపోయినా ... భార్యని ఏలుకున్నా, ఏలుకోకపోయినా ... ఎవరిక్కావాలీ?

వేణు ఆఫీసుకెళ్ళేడు. రెండురోజులు ఫైళ్ళు చాకలాడికి వేసే మాసిన గుడ్డల్లా టేబుల్ ఎక్కి కూర్చున్నాయి! ఏరోజు కారోజు చూస్తుంటేనే విసుగు పుట్టే వెధవ క్లర్క్ ఉద్యోగం! తనేమైనా ఆఫీసరా, డైరెక్టరా ... కళ్ళు మూసుకుని సంతకాలు పెట్టేయడానికి? ప్రతి లైనూ జాగ్రత్తగా చదివి మరీ చూడాలి! ఏ మాత్రం తొందర పడినా ... ముందు సూపర్నెంటుగారు బ్రతకనీయరు! అయినా ... ఇద్దరి పని తనే చూస్తున్నాడు. 'ఆవిడెవరో లేడీక్లర్క్ అపాయింట్ అయిందిట! ఇవాళో, రేపో వస్తుందేమో! నాకు ఊపిరి తీసుకుందుకు వీలవుతుంది!' అనుకుంటూ ... ఒక్కొక్క ఫైల్ దులిపి తాళ్ళు విప్పడం మొదలెట్టేడు.

నాలుగైదు ఫైళ్ళు ఓపిగ్గానే చూసేడు! తర్వాత విసుగొచ్చింది. రాత్రి అసలే నిద్ర లేదు! కునికిపాట్లు వస్తున్నాయి! లేచి బయటికి వెళ్ళి సిగరెట్ అంటించుకున్నాడు.

ప్రక్కహాల్లో టైపిస్టు 'బాదుతున్న చప్పుడు' వినిపిస్తోంది. 'మహాతల్లి! వేళ్ళు అతి సున్నితం! పప్పు గరిటెలా కొడుతుంది ... టైపు మిషన్ మీద వేళ్ళు! ఆడవాళ్ళు సున్నితంగా కొడ్తారంటారు గానీ ... అందరూ కాదు! అసలే టైపిస్టు అనగానే సన్నగా, నాజూగ్గా, రివటలా, చలాకీగా, షోగ్గా వుంటుందనిపిస్తుంది! ఈ మహాతల్లి టైపిస్టు అంటే భయం వేసి నమ్మబుద్ధి కాదు. పిప్పళ్ళ బస్తాలా... నల్లగా, లావుగా, కూర్చుంటే లేవలేనట్టు ... లేస్తే కూర్చోలేనట్టు ... తన శక్తినంతా టైప్ కొట్టడానికే వినియోగిస్తుంది! ఇంకా 'కుమారి'యే పాపం! ఎవడు చేస్తున్నాడో పూజ?

సరిగ్గా అప్పుడే గేటులోనుంచి ఒకావిడ హేండ్‌బ్యాగ్ తగిలించుకుని ... ఒక చేత్తో నుదుటికి పట్టిన చెమట తుడుచుకుంటూ గబగబా వస్తోంది.

'ఎవరమ్మా నువ్వు! ఏ స్కూల్లో పంతులమ్మో! ఏ లోను అప్లికేషనో ... ఇంక్రిమెంట్ ఆగిపోయి వుంటుంది. హుటాహుటీ పరిగెత్తుకొచ్చింది. అంతకన్నా ఈ 'డి.పి.ఐ' ఆఫీసు పనేముంటుందీ? నా ఖర్మ కాలి ఆ ఫైలు నా దగ్గరే వుండివుంటుంది. ఇప్పుడు నాకు పిలు వస్తుంది!' అనుకుని సిగరెట్ గబగబా నాల్గు దమ్ములు పీల్చి అవతల పారేసి సీట్లోకి వ కూర్చున్నాడు.

కానీ ... 'ఆమె' ఖర్మ కాల్చడానికి రాలేదు. ఉద్ధరించటానికే వచ్చింది! కొత్తగా అపాయిం అయిన లేడీ క్లర్క్ ఆమె! పేరు ... సురేఖ! సంతకం చేసి ... బాస్‌తో మాట్లాడి, కాగితాలు ఇచ్చి వచ్చి సీట్లో కూర్చుంది.

వేణు చూసేడు! మిగిలిన వాళ్ళంతా చూసేరు.

సురేఖ సన్నగా, పొడుగ్గా కాస్త తెల్లగానే వుంది! కాని ... కుడివైపు చెంప, చెయ్యి, వీపు మెడబాగం ... కాలిన తెల్లని మచ్చలు! చూడగానే ... కొంచెం అసహ్యం అనిపించేలా వున్నాయి! ఏదో ప్రమాదం జరిగినట్టూ, చికిత్స చేశాక కాస్త నయమైనట్టుగా ... చెవి ప్రక్కనుంచి మెడమీదికి చిన్న నాటు లాంటి గుర్తు! ... చర్మాన్ని దగ్గరికి లాగి కుట్టినట్టు వుంది! చీర కట్టుకోడం ... బొట్టు ... జడ చక్కగా వున్నాయి! అయితేనేం? ఐదు నిమిషాలు కూడా ఎవరూ ఆమెను చూడలేరు!

ఆమె సీట్లోకి వచ్చి కూర్చున్న వావుగంటలో పనిలో లీనమై పోయింది. చుట్టు ప్రక్కల ఏం జరుగుతుందో పట్టించుకోలేదు ...!

సాయంత్రం ఆఫీసు టైం ఐపోగానే అందరూ వెళ్ళిపోయారు. వేణు మెల్లగా సిగరెట్ అంటించుకుని కదిలేడు! సురేఖ కూడా టేబుల్ మీదున్న కాగితాలు సర్దేసి బయటికి వచ్చింది.

గేటు దాటి ఇద్దరూ బస్‌స్టాప్ చేరేరు. అక్కడున్న జన ప్రవాహానికి ఒక రైలు గాని సరిపోనట్టుంది! ఎన్ని బస్సులో వెళుతున్నా జనం తరగటం లేదు. ఆమె మాటిమాటికీ వాచీ చూసుకుంటూ ... విసుక్కుంటోంది! కొందరామె వైపు వింతగా చూసేరు. మరి కొందరు ముఖం త్రిప్పుకున్నారు.

వేణుకి బాధనిపించింది. 'నల్గురూ తనని నిరసిస్తున్నారని ఆమెకి తెలుసా?! తెలిస్తే ఎంత బాధ పడ్తుందీ? బొత్తిగా మనుషులకి మానర్స్ తెలియవు!' అనుకున్నాడు.

సురేఖ ఏమీ పట్టించుకున్నట్టు లేదు. ఒక రిక్షా మాట్లాడుకుని ఎక్కి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళాక ... అక్కడున్న జనాన్ని పరీక్షగా చూసేడు! అప్సరసలు, రతీదేవిలు ఎవరూ లేదు. పొట్టీ, పొడుగూ, సన్నం, లావూ, నల్లని నలుపూ, తెల్లని తెలుపూ, వాలు జడలూ, ముళ్ళూ, కళ్ళ జోళ్ళూ, ఎత్తుపళ్ళూ, చప్పిడి దవళ్ళూ, బూరె బుగ్గలూ, గుంట కళ్ళూ . . . వీళ్ళంతా అందమైన వాళ్ళా? కానీ ... ఏ వంకా లేకపోవడమే అందం! ఏ కాస్త మచ్చ వున్నా అనాకారి క్రింద లెక్క! ... ఇప్పుడు వీళ్ళందరిలో శ్యామల నిల్చుని వుంటే ఆమె మతిలేనిదని ఎవరికి తెలుస్తుంది? చూడగానే బాగుందనిపించే ఆమె ముఖం పదివందల సార్లు చూస్తారు. అదే ... సురేఖ మనస్సు ఎంతో మంచిదై వున్నా పైకి కనిపిస్తున్న ఆ రూపుని అసహ్యించుకుంటారు! ... మనిషి ప్రకృతి ఇంతేనా? ... లేక కొందరు మాత్రమే అలా వుంటారా?

ఛసెందుకు రూపురేఖలు కోరుకున్నాడూ? మనస్సు మంచిదైతే ... తెలివిగలదైతే చాలని కోరుకోలేదేం? ఊహూ! సమాజంలో వున్నప్పుడు నల్గురికింపుగా వుండాలి! తనొక్కడి ఇష్టంతో ... పదిమందిలో జీవించడం కష్టం ! గిరి గీసుకున్నట్లు బ్రతకాలనుకుంటే సమాజంలో వెలివేసినట్టు చూస్తారు. అందుకే కదా? తను శ్యామలని తీసుకు రాకపోతే ... అందరూ ఏలుకొని కర్కోటకుడిలా చూస్తారు ... నా మనస్సులో ఆవేదన, అసంతృప్తి వాళ్ళ కెందుకు? అయినా ... ఇంక ఇలా దాచుకుని ప్రయోజనం లేదు. ఏదో ఒక రోజు చెప్పేస్తాను.

వేణు మానసిక సంఘర్షణలో వుండగానే బస్సు రావడం, జనం ఘర్షణ పడటం జరిగింది. ఎలాగో సందు చేసుకుని ఎక్కేడు! 'హమ్మయ్య ... ఇవ్వాల్టికి బస్సు ఎక్కేను. ఇదో యుద్ధం ముగిసింది! మళ్ళీ రేపు సంగతి చూసుకుందాం!' అనుకున్నాడు.

సాయంత్రం ఆర్థోపెడిక్ హాస్పిటల్‌కి వెళ్ళేడు. రమ సంతోషంగా కనిపించింది.

"బాబాయ్, నువ్వు ఊరినుంచి వచ్చేసేవా? మీ అమ్మగార్కి ఎలావుంది? జ్వరం తగ్గిపోయిందా? పిన్నిని తీసుకు రాలేదట కదా? నాకు ఇందాక నాన్న చెప్పారులే!"

"అవును రమా! మరి మా అమ్మగార్కి ఇంకా పూర్తిగా తగ్గలేదు కదా? పాపం! ఇంట్లో ఎవరు పని చేస్తారూ? మా చెల్లెలు చదువుకోవాలి ... మరేమో పెద్ద చెల్లెలికి కొన్నాళ్ళలో పాప పుడ్తుంది! అప్పుడు మరి వాళ్ళందరికీ సహాయం చేయడానికి మీ పిన్ని అక్కడ ఉండాలిగా! అందుకని కొన్నాళ్ళయ్యాక తీసుకొని వస్తాను! ఏం? మరి నీకు ఎలావుంది?" మంచం మీద కూర్చుని తల నిమురుతూ లాలనగా అడిగేడు.

"అప్పుడే ఎలా తెలుస్తుంది? ఇంకా కట్టు విప్పలేదు గదా?" అంటూ నవ్వింది రమ

"ఓహ్ .. అది కాదమ్మా! నీకు జ్వరం అదీ తగ్గిపోయిందా? మొన్న ఊరికే భయం ఏడ్చేవు!"

"ఊరికే ఏం భయపడలేదు ... నిజంగానే భయం వేసింది!"

వేణు నవ్వేసేడు. "నీతో మాట్లాడడం కష్టం రమా!"

"ఊ ... మరే పాపం! నువ్వు మాత్రం మంచిగా మాట్లాడుతావేమిటీ? మొన్న మీ ఫ్రెండ్ బర్త్‌డేకి వెళ్ళేవు కదా? ఏం తెచ్చిపెట్టావమ్మా నాకు?"

"నిజమే రమా! ఏం తేలేదమ్మా నీకు! కానీ, అక్కడ వాళ్ళు పెట్టినవి నీకు ఇవ్వడమేమిటీ? నీకు చక్కగా ఇంటికి వచ్చాక స్వీట్లు తెచ్చిపెడ్తాను."

"ఊ! అన్నీ కబుర్లు !! ఏం వద్దులే, అసలు సర్కస్ చూడ్డానికి లేకుండా అయింది!" అంటూ బాధపడింది రమ.

"వెధవ సర్కస్! దానివల్లే ఇంతపని జరిగిపోయిందని నేను ఏడుస్తున్నాను. ప్రతిదానికీ పంతం, పట్టుదల ఎక్కువై పోయాయి! అదృష్టం బాగుండి ఈ కాస్తతో సరిపోయింది కానీ ... ఈ పడటంలో తలకి గనుక తగిలి వుంటే, మతే పోయేది! జన్మంతా ఏడుస్తూ కూర్చోవాలి!" రమ తల్లి కసిరింది.

సాచి లెంపకాయ కొట్టినట్లయింది! వేణు దిగ్గున లేచేడు.

"నేను వస్తానండి, బజార్లో అర్జెంట్ పని వుంది, రేపు మళ్ళీ వస్తాను రమా! వెళ్ళనా?"

"అదేమిటి బాబాయ్! అప్పుడే వెళ్ళిపోతావా? ఇప్పుడేగా వచ్చావు? కాస్సేపు కూర్చో బాబాయ్! నా కిక్కడ ఏం బాగాలేదు. ఎవరూ మాట్లాడరు! నువ్వు వస్తావని చూస్తే ... అప్పుడే వెళ్ళిపోతావా? కూర్చో బాబాయ్!" అని చెయ్యి లాగింది.

"అయ్యో ... అతనికి పని వుందిట! వెళ్ళనీయవే!"

"పోనీలెండి ... కాస్సేపు కూర్చుంటాను" అంటూ తప్పనిసరిగా కూర్చున్నాడు. అన్యమనస్కంగానే ఏవేవో కబుర్లు చెప్తూ అరగంట కాలక్షేపం చేసి 'ఇక వెళతా'నని లేచేడు !

మనిషి ఏ విషయాన్ని దూరంగా జరపాలనుకుంటాడో ... దేనినుండి దాచుకుంటూ, ుచుకు తిరుగుతాడో ... 'అదే' వెంటాడినట్టు, తరుముకుని వస్తున్నట్టూ చుట్టుముడ్తే ... తప్పని ుగా బందీ అయి లొంగిపోతాడు. అడుగడుగునా ఏదో సంఘటనలో, ఏదో సన్నివేశంలో ... తను మర్చిపోదామనుకున్న సంగతే గుర్తు వస్తుంటే ... ఇక తప్పించుకోలేక తప్పనిసరిగా దొరికి పోయిన దొంగలా నిలబడిపోతాడు!

నిజానికి ... ఇది పిరికితనం లాగా, అసమర్థతగా తోచవచ్చును. కానీ సరైన జవాబు అది కాదు ... దాని పేరు 'అంతరాత్మ!' ప్రతి మనిషికి ఇది .. 'అలారం టైంపీసు' లాగా హృదయంలో దాగి వుంటుంది! సరైనా దారిలో నడుస్తున్నంతవరకూ 'లబ్ ... డబ్' లాగే వినిపిస్తుంది దాని శబ్దం! ఏ మాత్రం దారితప్పినా 'అలారం' లాగా గుండెల్లో మోత పెడ్తూ వుంటుంది! అదిగో ...

అటువంటప్పుడే ఉలికిపాటు, గుండెదడ ... లాంటివి కల్గి, ఆత్మవిమర్శకి దారి తీస్తుంది!

ఇది ప్రతి మనిషిలో జరిగే తప్పనిసరి చర్య. దాన్నించి ఎవరూ తప్పించుకోలేరు!ఒకవేళ తప్పించుకోగలవాడుంటే వాడు మనిషి కాకపోవచ్చును. రాతి గుండెవాడై వుండాలి.

# 12

వారం రోజుల తర్వాత రమని ఇంటికి తీసుకువచ్చారు. మరొక ఆరు వారాల తర్వాత ఆసుపత్రికి తీసుకురావాలనీ, అంతవరకూ జాగ్రత్తగా చూడమనీ ... హెచ్చరించి పంపారు డాక్టర్!

ఇప్పుడు రమ ఇంట్లోనే వుండి వేణుతోటి, అన్నలతోటి కులాసాగా కబుర్లు చెప్తోంది! మెడలో వేళ్ళాడదీసిన చేతిపట్టీ!! వాళ్ళమ్మగారు అన్నం తినిపిస్తూ, కాఫీ తాగిస్తూ, చిన్నపాపలా బుజ్జగిస్తూ వుంటే "వేణు బాబాయ్ ... ఇలా చెయ్యి విరిగితే బాగానే వుంది! చక్కగా అమ్మ అన్నీ చేసి పెడ్తూ వుంటుంది. బడికి వెళ్లక్కర్లేదు ... హోంవర్క్ చెయ్యక్కర్లేదు! ఏ పనీ చెయ్యకుండా రాణీగారిలా కూర్చోవచ్చును!" అన్నది కళ్ళు తిప్పుతూ.

"ఆ! ఆ! ఎన్నాళ్ళు ఆ మోజూ? నీ కట్లు విప్పేవరకే ...! ఆ తర్వాత ఇంతకన్నా ఎక్కువ పనులు చెయ్యాలి తమరు!" అని వెక్కిరించేడు చంద్రం.

"అయితే ... నేను అసలు కట్లే విప్పుకోను! ఇలాగే వుండిపోతాను" అంటూ నవ్వింది.

"ఓసి పిచ్చీ! అప్పుడు అంతా అవిటిముండని విసుక్కుని తిడ్తారే! ఇప్పుడైతే కొన్నాళ్ళే అని చేస్తారు!"

"పోనీలే - నీకసలు కుళ్ళు నేనంటే ...!"

"అబ్బబ్బ ... చంద్రం, ఊరుకో! చిన్నపిల్లతో ఏమిటి వాదం? నువ్వెళ్ళమ్మా రమా?" ఽ లోపలికి పంపేసేడు వేణు.

ఇలాంటి చిలిపి కజ్జాలు రోజుకోసారైనా జరిగేవి! కవ్వించడం చంద్రానికి ఇష్ట ఉడుక్కోవడం రమకి అలవాటు!! ఇద్దర్నీ విడదీసి సర్దేసరికి వేణుకి విసుగొచ్చేది. ఒక్కొక్కప్ప అలా విసుగొచ్చి బయటికి వెళ్ళిపోయేవాడు పనుందంటూ!

ఒకరోజు ... అలాగే విసుగనిపించి, కోఠీ వైపు వెళ్ళేడు!

సెలవుల్లో ఒళ్ళు విరిగేట్లు తిరుగుతూ బాగా కాలక్షేపం చేసేడు! 'ఆఫీసు వుంటే అదో రకం! సెలవైతే మరో రకం! ఏమిటో ... అసలు జీవితమే విసుగనిపిస్తోంది!' అనుకుని 'పోనీ - ఏ ఫ్రెండ్ ఇంటికైనా వెళ్దామా?' అనుకున్నాడు! ప్చ్! వద్దు ... వాళ్ళెక్కడికైనా వెళ్తారేమో! తనకైతే పెళ్ళయినా ఓ మిత్రుడు కూడా లేడు గానీ... అందరూ అలాగే వుంటారా?' మరేం చెయ్యాలనుకుంటూ వుండగా - దూరంగా 'సురేఖ' కనిపించింది తనని చూడనే చూసింది!

దగ్గరకి వచ్చి "నమస్కారమండీ! ఏమిటిలా వచ్చారు?" అనడిగింది.

మనిషెలా వుంటేనేం? మాట అతి మృదువుగా, సమ్మోహనంగా వుంటుంది!

"ఏముందండీ ... సెలవు గదా! రోడ్ల పావనం చేద్దామనీ ...!" అని నవ్వి, "అదేమిటి ... మీ చేతిలో ఏమిటో ఫ్లాస్కూ, టిఫిన్ బాక్స్ కనిపిస్తున్నాయి? ఎక్కడికేమిటీ? ఎవరికైనా ఒంట్లో బాగాలేదా?" ఆమె చేతిలో వున్న ప్లాస్టిక్ సంచివైపు చూస్తూ అడిగేడు.

సురేఖ పేలవంగా నవ్వింది. మబ్బులు కమ్మిన వెన్నెల్లాగా ... మసక మసకగా వుంది!

"వేణు గోపాల్‌గారూ? నేను ప్రతి ఆదివారం ఇలాగే కాఫీ, టిఫిన్, పళ్ళు, మంచినీళ్ళు పట్టుకుని వెళ్ళి వస్తూ వుంటాను ... ఎర్రగడ్డ పిచ్చాసుపత్రికి ! మా చెల్లెలు వుంది అక్కడ!"

"వ్వాట్?!! మీరు చెప్పేది నిజమేనా?"

"అబద్ధం ఎప్పుడూ బరువుగా వుండదు. తేలికగా వుంటే అది అబద్ధం అనుకోవచ్చును!"

"అంటే ... మీ సిస్టర్ పిచ్చివారా?"

"అవును ... ఇప్పుడు అలాగే చెప్పుకోవాలి. ఒకప్పుడు దానంత తెలివైనది లేదని గర్వపడే వాళ్ళం!"

నిక్షిప్తంగా చెబుతున్న సురేఖ నిశ్శబ్దంగా ఏడ్చింది మనసులో!

వేణు గాభరాగా నుదురూ, చెంపలూ తుడుచుకున్నాడు.

"ఎన్నాళ్ళనుంచీ ... మీ సిస్టర్‌కి పిచ్చి?"

"దగ్గర దగ్గర రెండేళ్ళయింది! ఇప్పుడు కొద్దిగా నయం! ఇంకా కొన్నాళ్ళు ఆస్పత్రిలో వుంచాలి!"

"అసలేం జరిగింది? పిచ్చి అంటే ... ఆవిడేమి చేస్తుంది?' ... వేణుకి చాలా ఉత్సుకతగా వుంది! ఇలాంటి కేసు తనకి అత్యంత అవసరం!

"అదంతా ఓ పెద్ద కథ! ఇక 'పిచ్చి' అంటారా? అనేక రకాలు! మీ కుతూహలం తీరకపోతే . నాతో ఇప్పుడు హాస్పిటల్‌కి రండి! మీ కళ్ళతో మీరే చూడవచ్చు ... ఎన్నిరకాల పిచ్చిలో ...!" అంటూ నిర్వేదంగా నవ్వింది.

బహుశా ... ఆమె వేదన మర్చిపోయి బ్రతుకుతోందనిపించింది వేణుకి!

"పదండి! నాకెప్పుడూ ఇలాంటి అవకాశం రాలేదు!"

"ఎలా వస్తుందండీ? పార్టీలకీ, మ్యారేజీలకి ఇన్విటేషన్లు ఇస్తారు గానీ ... మెంటల్ హాస్పిటల్‌కి రమ్మని ఎవరూ ఆహ్వానించరు! నా బోటి దురదృష్టవంతుల్ని తప్ప!"

"మీరు దురదృష్టవంతులెలా అవుతారు? హాయిగా జాబ్ చేసుకుంటున్నారు".

నవ్వింది. 'హాయి'కి నిర్వచనమేమిటో నాకు తెలియదనుకోండి! అయినా నాకు తెల్సినంత వరకు మనసుకి కష్టం కల్గకపోవడం, చీకూ, చింతా లేకపోవడం ... అని నా నమ్మకం! మరి నాకు హాయి ఎలా వస్తుందీ? పోనీయండి. మనం ఎర్రగడ్డ బస్సు ఎక్కాలి ప్రస్తుతం! కొంచెం అటు నడవండి. సనత్ నగర్ బస్సు అందుకోవాలి! అదిగో .. వస్తోంది బస్సు!" అంటూ సురేఖ గబగబా నడిచింది!

వేణు ఆమెను అనుసరించేడు.

బస్సు దిగి గేటు ముందు ఆగేడు.

## 'ప్రభుత్వ మానసిక రోగ చికిత్సాలయము'

బోర్డు చూసి 'మెంటల్ హాస్పిటల్' అని మనసులో మననం చేసుకుంటూ, సురేఖతో పాటు గేట్లోకి వెళ్ళేడు వేణు!

ఆమె చకచకా నడుస్తోంది కాని, వేణుకి గుండెల్లో ఏదో సన్నని దడ .. కంపనగా వుంది! అటూ ఇటూగా వున్న చిన్న చిన్న ఇళ్ళ లాంటివి, దాటుకుంటూ బాగా లోపలికి తీసుకెళ్ళి ఆగింది!

అక్కడున్న ఆయాతో "కనకమ్మా ... జ్యోతిని చూడాలి!" అనడిగింది.

"అట్లాగేనమ్మా ... కూసోండి!" అనేసి కనకమ్మ ప్రక్కనున్న వార్డులోకి వెళ్ళిపోయింది.

సురేఖ, వేణుగోపాల్ వరండాలో వున్న బెంచి మీద కూర్చున్నారు.

కొందరు యువతులకి గుళ్ళు చేసి, స్లీవ్‌లెస్ చొక్కాలేసి వుంచారు! ఒక నడివయస్సావిడ అస్తమానం నవ్వుతూ, చేతులు త్రిప్పుతూ ఏదో చెప్తోంది! ఎదురుగా వున్న కటకటాల ఊచలలో మధ్య మధ్య సీరియస్‌గా ఊచని పట్టుకుని ఊపేస్తోంది! ఇంకొక ముసల్ది మూలగా కూర్చుని సన్నగా ఏడుస్తూ ... ఎవరో కొడ్తున్నట్టుగా భయంగా చూస్తూ, చేతులు అడ్డం పెట్టుకొని తల వంచుకుంటోంది! ఇంతలో- ఒకావిడ గంతులు వేస్తూ ... చిందులు త్రొక్కుతూ నాట్యభంగిమలో తిరుగుతోంది!

ఇవన్నీ వేణు గమనిస్తూ ఆశ్చర్యబోతున్నాడు. కానీ, సురేఖ అవన్నీ చాలా అలవాటై పోయిన విషయాల్లాగా అతి మామూలుగా కూర్చుంది.

కనకమ్మ జ్యోతిని తీసుకొచ్చి కూర్చోబెట్టింది!

రాగానే . . . ఒక్కసారిగా చేతులు చాపి, "అక్కా!" అంది. మరునిముషంలో "అబ్బా! ఇంత చీకట్లో కూర్చున్నావేమిటీ? లైటు వెయ్యి!" అంటూ గాలిలో స్విచ్ నొక్కినట్టు నొక్కి "టిక్" అంది. "చూసేవా! వంద కాండిల్ బల్బ్! మెర్క్యురీ లైట్! చలి కాచుకోవచ్చును, నీళ్ళు కాచుకోవచ్చును, అన్నం వండుకోవచ్చును ... అన్నం, అన్నం ... అక్కా, నాకేం తెచ్చావ్?" అంటూ ఆగి, క్రింద కూర్చుంది.

కనకమ్మ వెళ్ళిపోయింది.

సురేఖ కూడా క్రింద కూర్చుని ... ప్లాస్టిక్ సంచీలో నుంచి ఒక ప్లేటు తీసి క్రింది పెట్టింది. ...న్ బాక్స్ తెరిచి నాలుగు ఇడ్లీలు, పచ్చడీ వేసింది. సీసాలో తెచ్చిన చల్లని మంచినీళ్ళు గ్లాసులో ...సి యిచ్చింది.

జ్యోతి ప్లేటందుకుని గబగబా తినేస్తోంది! వేణు మౌనంగా, విచిత్రంగా చూస్తున్నాడు.

జ్యోతి తినడం పూర్తికాగానే ... సురేఖ ఇంకో పొట్లం విప్పి కోవా బిళ్ళలు, కారప్పూస ప్లేటులో వేసింది.

"నువ్వు చేసేవా?" అని అక్కని అడిగింది జ్యోతి.

"అవునమ్మా! కారప్పూస నీ కిష్టమని చేసేనమ్మా!" అని తల నిమిరింది సురేఖ.

ఆదరా బాదరాగా నమిలేస్తోంది జ్యోతి! మధ్యలో ఆపి మంచినీళ్లు అందించింది సురేఖ! తాగింది జ్యోతి! ముఖం మీద పడ్తున్న చెమట బిందువుల్ని కొంగు పెట్టి తుడుస్తోంది సురేఖ!

వేణుకి కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

'ఎంత పిచ్చిదైనా చెల్లెలు కదా? పాపం!' అనుకున్నాడు.

పూర్తిగా తినేశాక, ఫ్లాస్కులో నుంచి కాఫీ పోసి కొద్దికొద్దిగా తాగించింది!

"అక్కా! మోహన్ రావేనా ఇతను? మళ్ళీ వచ్చాడా? నమ్మకు! మగ వెధవల్ని ఛస్తే నమ్మరాదు. ఏయ్ ... ఏయ్, ఎందుకు వచ్చావ్? మా అక్కని పెళ్ళి చేసుకుంటావా? తంతాను!" అంటూ లేవబోయింది.

వేణుకి భయం వేసింది.

సురేఖ వెంటనే చెయ్యి పట్టుకుని ఆపి - "జ్యోతీ! అతను మోహన్ కాదు ... అన్నయ్య! మన బాబాయి కొడుకు! మనింటి కొచ్చాడు. నిన్ను చూడాలని వచ్చాడు" అని చెవి దగ్గరగా జరిగి - రహస్యం చెప్తున్నట్లు చెప్పింది.

జ్యోతి కళ్ళింత చేసి ఆశ్చర్యంగా చూసింది. "అన్నయ్యా! బాగున్నావా?" అనడిగింది.

"ఆ! ఆ!" అన్నాడు కంగారుగా వేణు.

కాస్సేపటికి మళ్ళీ మరొక ధోరణిలో పడిపోయింది జ్యోతి.

ఇంతలో ... ఇంకొక పిచ్చి అమ్మాయి పరిగెత్తుకుంటూ వచ్చింది. "హల్లో. . . మై డియర్ ఫ్రెండ్! హౌ ఆర్ యూ?" అంటూ వచ్చి జ్యోతిని పలకరించింది.

వేణు బిగబట్టుకుని కూర్చున్నాడు!

సురేఖ ఆ పిచ్చిపిల్లని కూర్చోమన్నది. అక్కడ ప్లేటు, గ్లాసు చూసి "ఏం తెచ్చారండీ? నాకూ పెట్టరూ?" అనడిగింది.

సురేఖ వెంటనే పొట్లాంలో మిగిలిన కారప్పూస తీసి ఆ పిల్లముందు పెట్టింది.

"అబ్బ! భలే బాగుంది. మీరు చేసేరా? నా కిది ఎంతిష్టమో?" అని ఆ పిల్ల తింటూంటే, "ఊ - మరే ... ఆశ! మా అక్కేం చెయ్యలేదు. నా కోసం కొని తెచ్చింది!" అని దబాయించింది జ్యోతి.

"ఓసి నీ పిచ్చి తెలివి మండిపోనూ! నేను మళ్ళీ అడుగుతానని అబద్ధం చెబ్తున్నావా? నాకేం వద్దులే! నాకు మా అన్నయ్యే తెస్తాడు. ఇప్పుడు వస్తాడు" అన్నది . . . దర్జాగా చూస్తూ ఆ పిచ్చి పిల్ల!

"ఊ! మరైతే ఎందుకొచ్చావ్ ...షో!"

"పోతాలే ... నా నోట్సు పుస్తకాలు తీసుకుని పోతాను - నేను ఎగ్జామ్స్ రాయాలి గదా?"

ఇంతలో ... కనకమ్మ వచ్చి ఆ పిచ్చిపిల్లని "రా! కుమారీ ... మీ అన్నయ్య వచ్చాడు" అని లాక్కుపోయింది!

సురేఖ నిట్టూర్చింది "పాపం! బి.య్యే స్టూడెంట్‌ట! సడన్‌గా ఏదో షాక్ తగిలి పరీక్షల ముందు మతి పోయిందట! బాగానే మాట్లాడ్తుంది. కానీ, సడన్‌గా మారిపోతుంది!" వేణుతో చెప్పింది.

తల పంకించేడు వేణు.

మరొకపావుగంట తర్వాత కనకమ్మ వచ్చి జ్యోతిని "రా...!" అని పిల్చింది.

సురేఖ చెల్లెలి తల నిమిరి "నేను వెళ్ళిరానా?" అంది.

"ఊ! ఈసారి దోసెలు, పూరీలు తీసుకురా! ఇక్కడ ఆమ్లెట్ నాకు బాగులేదు"

"అలాగేలే!" అని "చూడు కనకమ్మా! కొంచెం చెల్లిని కనిపెట్టు - నేను నీకు ..."

"అట్లాగేలేమ్మా ... నాకు తెలుసు! జోతమ్మని నే చూసుకుంటా గదా! నేను డ్యూటీలో న్నంత వరకు జ్యోతమ్మకి ఏం ఫర్వాలేదు" అని భరోసా ఇచ్చింది కనకమ్మ.

వేణు, సురేఖ తిరిగి మెయిన్ గేట్ దగ్గరికి వచ్చారు. బస్‌స్టాండ్‌కి వచ్చాక కూడా చుట్టూ వున్నవాళ్ళంతా ఆ ఆసుపత్రి నుండి వచ్చిన పిచ్చివాళ్ళలాగే కనిపించేరు . . . వేణు కళ్ళకి!

"చూసేరా వేణుగోపాల్‌గారూ? ఎన్నెన్ని రకాల పిచ్చివాళ్ళో పాపం ... ఏదో మూమెంట్‌లో దెబ్బ తింటుంది మైండ్! అంతే! జీవితం అంతా ఇలా బందిఖానాలో ... నిరర్థకంగా గడపాలి! ఆ డాక్టర్లూ, నర్సులూ, ఆయాలూ ఇరవైనాలుగు గంటలు వీళ్ళని కనిపెట్టుకుని సేవలు చేస్తుంటే ... వాళ్ళకెంత విసుగు రావాలీ? కానీ, వాళ్ళకి రాదు!! మామూలు పేషంట్లను చూసే డాక్టర్లు, నర్సులు

ఆయాలకన్న ఇలా మెంటల్ వాళ్ళని చూడ్డం ఎంత గొప్ప విషయం? జీవితంలో దెబ్బతిని దారి తప్పిన వాళ్ళని ... ఓదార్చి చికిత్స చేసి మళ్ళీ దారిలోకి తేవాలని చేసే వాళ్ళ ప్రయత్నం ఎంత విలువైందీ? రెండేళ్ళ క్రితం మా చెల్లి పిచ్చి చాలా ఉధృతంగా వుండేది! ఇప్పుడు చాలా నయం! ఇంకా ముందు ముందు బాగుపడి ఇంటికి తీసుకురాగల్గితే నేను ఆజన్మాంతం ఈ మెంటల్ ఆసుపత్రికి ఋణపడి వుంటాను" అని ఆగి, "వచ్చేజన్మలో ఒక మెంటల్ హాస్పటల్లో డాక్టర్ గానో, నర్సుగానో పుట్టాలని కోరుకుంటాను! ప్రతి పిచ్చివాళ్ళ జీవితం వెనకాల వాళ్ళ బంధువుల దు:ఖం, ఆవేదన, హృదయఘోష సుళ్ళు తిరుగుతూ వుంటుంది. వాటిని చల్లార్చగల్గితే ఎంత తృప్తి, ఆనందం కల్గుతుందీ? వేణుగోపాల్‌గారూ ... నిత్యం మనం చూసే ఈ ప్రపంచానికీ, ఆ కాంపౌండ్ లోపల నడిచే ప్రపంచానికి ఎంత తేడా వుందో తెలుసా? ఎంతసేపూ నేను, నా ... అనే స్వార్థపూరితమైన ఆరాటంలో ... వినోదాలకీ, విలాసాలకే ప్రాకులాడే కంటే ... జాలితో కూడిన నిస్వార్థసేవలో ఎంతో తృప్తి, ప్రశాంతి దొరుకుతాయి. కాదంటారా?" సురేఖ సూటిగా అడిగిన ప్రశ్నకి వెంటనే జవాబు ఇవ్వలేకపోయాడు వేణు.

అంత తేలికగా ఇవ్వగలిగే జవాబు కాదది!

"ఏమో ... నా అనుభవం నేను చెప్పేను. అందరి మనస్తత్వాలు ఒకలాగే వుండవనుకోండి నేను ఆసుపత్రిలో మూడు నెలలు బెడ్‌రెస్టులో వున్నప్పుడు నేను ఈ ప్రపంచానికి భిన్నమైః మరొక ప్రపంచం చూసేను. నాలాంటి బాధా తప్త హృదయులు ఎందరో కనిపించేరు. ఏ రోగమూ, బాధా లేనప్పుడు మనకి వీళ్ళెవ్వరూ కనిపించరు. ఏదైనా తేడా వస్తే ... 'శాశ్వతం' అని భావించే ఈ సుఖాలన్నీ బంద్! కట్టిపడేసినట్టున్నప్పుడు ఈ సుఖాలన్నీ ఎంత నీటిబుడగలో అనిపిస్తాయి! ఇ నా అనుభవంలో నేర్చుకున్న పాఠం సుమండీ!" అని నవ్వింది సురేఖ!

వేణు సురేఖనే చూస్తున్నాడు.

ఆమె ముఖంలో ... మెడభాగంలో, చెయ్యిమీద ... ఆ మచ్చలన్నీ ఇప్పుడు వికారంగా కనిపించటం లేదు! యోగనిష్టలో సంపాదించుకున్న జ్ఞాన ముద్రల్లాగా వున్నాయి. సుఖలాలసలో తేలే అల్పజీవికి... నిలబెట్టి నిజాన్ని ఆలోచింపచేసే వెలుగు రేఖలుగా కనిపిస్తున్నాయి. ఎక్కడ నేర్చుకుంది ఈమె ఈ పాఠం? ఎంత ఉన్నతంగా వుంది ఈ ధోరణి?!

"సురేఖగారూ... అసలు మీ సిస్టర్‌కి మెంటల్‌షాక్ ఎలా తగిలింది? మీరు ఆసుపత్రిలో మూడు నెలలు ఎందుకున్నారు? మీ అమ్మగారు, నాన్నగారు వున్నారా? సారీ ... నేను తప్పుగా అడగలేదు కదా?"

"అబ్బే! దాంట్లో తప్పేమిటండీ? మా అమ్మగారు లేరు! నాన్నగారు వున్నారు. అన్నయ్య, వదిన, తమ్ముడు ... వున్నారు. రెండేళ్ళ క్రితం మా అమ్మ వుండేది. కానీ ... అనుకోకుండా ఒక దుర్ముహూర్తాన 'స్టౌవ్' అంటుకుని నేను ప్రమాదానికి గురైతే ఆ దృశ్యాన్ని చూసి మా చెల్లి జ్యోతి షాక్ తిని మతి పోగొట్టుకుంది! నేను ఆసుపత్రిలో ట్రీట్‌మెంట్‌లో వుండగానే ... మా అమ్మ నా కోసం, మా చెల్లికోసం ... భరించలేని దు:ఖంతో బెంగెట్టుకుని పోయింది!"

"అయామ్ సారీ! మీ పాత విషయాలు జ్ఞాపకం చేసి మిమ్మల్ని బాధించినట్టున్నాను"

"అవి మర్చిపోతే కదా?! మాకు ఎప్పుడూ జ్ఞాపకంగా నిలిచే వున్నాయి!" అంటూ అర్థపూరితంగా నవ్వింది.

వేణు కొంచెం సంశయించి, 'మోహన్ ఎవరు?' అని అడుగుదామనుకున్నాడు గాని ... బస్సు వచ్చేసింది!

కోఠీలో దిగేక "వేణుగోపాల్‌గారు! ఇవాళ మీకు చాలా శ్రమ కలుగచేసినట్టున్నాను. అనవసరంగా నాతో తీసుకెళ్ళానేమో!?" అనడిగింది సురేఖ.

"అవసరంగానే వచ్చానులెండి! తీసుకెళ్ళినందుకు మీకు థాంక్స్!" అని నవ్వేడు.

"జోకు బాగానే వుంది. వస్తామరి! మా ఇల్లు ఆ సందులోనే వుంది ... వస్తారేమిటి?"

"వద్దులెండి ... ఇంటికెళ్ళాలి. మరోసారి వస్తా!" అనేసి హోటల్‌వైపు దారి తీసేడు.

"బాబా - ఏక్ పైసా హైతో దేవ్‌నా ... బాబా - ఏక్ పైసాహై ..." రెండు కాళ్ళు మొండి ముక్కల్లా వున్నాయి. చంకల క్రింద కర్రలతో నడుస్తున్నాడు వాడు. జేబులో నుంచి పావలా తీసి పడేసేడు. ఎందర్నో ఎన్నోసార్లు చూసేడు. చూసినప్పుడల్లా దానం చెయ్యాలనిపించలేదు!

హోటల్లో కాఫీ తాగి, టిఫిన్ తింటూంటే ఆ ఇడ్లీలు ... జ్యోతిని గుర్తుకు తెచ్చాయి? ఆ గేటు లోపల ఆ గదుల్లో బందీగా వున్న ఆమె గుర్తుకు రాగానే 'పాపం' అనుకున్నాడు. వెంటనే ...

శ్యామల, ఆ చిన్ని టిక్కీ గుర్తుకు వచ్చాయి. బాధేసింది. సురేఖ చెల్లెలికోసం ఎంత ఆప్యాయంగా, ఆపేక్షగా టిఫెన్లు పట్టుకెళ్ళి తినిపిస్తోంది?

మరి ... తనూ??

చెల్లెళ్ళు శ్యామలకి పెట్టిన భోజనం జ్ఞాపకం చేసుకున్నాడు! పుట్టింటికి వెళ్ళమంటే అమ్మ కొడ్తుందని భయపడిన శ్యామలని తలుచుకుంటే జాలేసింది. ఇప్పుడు చెల్లెళ్ళు మాత్రం కొట్టకుండా వుంటారా? ప్రొద్దున రమని చంద్రం తిట్టేడు. ఎల్లకాలం కట్లు వుంటే విసుక్కుని 'అవిటి ముండా' అంటారని? ... ఏ తల్లయినా ప్రాణం విసిగితే తిట్టి, కొడ్తుంది! అంటే తల్లికి ... కూడా బరువు, భారం అయి విసుగు కల్గుతుందన్నమాట!? తను ఒకవేళ శ్యామలని వదిలేస్తే ... పుట్టింట్లో తల్లితో తిట్లూ, దెబ్బలూ తింటూ వుండాల్సి వస్తుందా? పోనీ ... తను ఇక్కడికి తీసుకువచ్చి జ్యోతిలాగా పిచ్చి ఆసుపత్రిలో వుంచి వైద్యం చేయిస్తే ...?? అలాంటి ట్రీట్‌మెంట్లు చాలా జరిగేయట కదా? కేవలం మానసిక పరిణామం కలగాలట! అంటే ... తను తీసుకొచ్చి కాపురం పెట్టాలి! ఎలా చేస్తుంది కాపురం? ట్రై చెయ్యాలి. తనే ఓ డాక్టర్ లాగా, నర్సులాగా ట్రీట్ చెయ్యాలి!' నవ్వుకున్నాడు.

'అందరూ మామూలు రోగులకి సేవలు చేసుకుంటే, నేను మానసిక రోగానికి వైద్యం చెయ్యాలి!' ... ఎలా వుంటుందో చూద్దాం!!

హోటల్లోనుంచి బయటికి వచ్చిన వేణు సిగరెట్ తాగుతూ నడుస్తుంటే కారేదో ప్రక్కన ఆగింది. చూస్తే రాజారావున్నాడు!

"హలో! ఏమిటి సంగతి? మీ ఆవిణ్ణి తీసుకువచ్చావా? ఇంకా అత్తగారి సేవకే వదిలేవా...? స్టీరింగు మీద చేతులు తీయకుండానే అడిగిస్తున్నాడు ...!

వేణు చిన్నగా నవ్వి, తను ఊరు వెళ్ళి వచ్చిన సంగతి చెప్పాడు.

"ఐసీ! సరే ... తీసుకొస్తే మటుకు మా ఇంటికోసారి రండి మీరిద్దరూ!" అని చెప్పి కారు స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయేడు.

వేణుకి మళ్ళీ సంశయం వచ్చింది. శ్యామలని తీసుకొస్తే ఎంత మందితో ఎన్నెన్ని గొడవలు పడాలో ... అని!

అయినా ...' చూద్దాం లే' - అనుకుని చింతల బస్తీ వెళ్ళాడు.

# 13

రెండు రోజులు చాలా వేదన పడి ప్రసవించింది కమల. అప్పటికి కామేశ్వరి బాగా కోలుకొని ఇంటిపనులు చూసుకుంటోంది. లక్ష్మి పరీక్షలు రాసేసింది. అటు బాలింతరాలు, చంటిపిల్ల, ఇటు వంటపని చూసుకుంటూ ... మధ్య మధ్య ఎందుకూ పనికిరాని కోడల్ని తిట్టుకుంటూ కామేశ్వరి కమలకి పురిటినీళ్ళు పోయించింది.

బాలసారె నాటికి వియ్యాలవారు వస్తే... శ్యామలని చూస్తే ఎన్ని ఎత్తిపొడుపులు పొడుస్తారో.. ఇదైనా సరిగ్గా వుంటుందో వుండదో! ... అని అనేక విధాల ఆలోచించుకుని భర్తతో చెప్పి శ్యామల పుట్టింటి ప్రయత్నం నిశ్చయించింది - కామేశ్వరి.

'వెళ్ళ'నని ఏడ్చింది శ్యామల!

'వెళ్ళవూ? ఏం... ఇక్కడ నా నెత్తిమీద కూర్చుంటావా?'

"ఛీ! ఎవరైనా నెత్తిమీద కూర్చుంటారా? క్రిందే కూర్చుంటాను'' అంది బుద్ధిగా శ్యామల.

"అఘోరించలేకపోయావ్? అక్షరంముక్కలు వచ్చేయి నోటికి ఎలాగో! మూగ పీనుగైతే బాగుండును! చావు తెలివిలాగా మర్యాదలు కూడా తెలుసా నీకు? క్రింద కూర్చుంటుందిట? ఎన్ని జన్మల్లో చేసానో నీలాంటి కోడలి కోసం పూజ! ఆ పుణ్యం అంతా ఈ జన్మలో నా నెత్తి మీద గుమ్మరించేడు ఆ దేవుడు!'' అంటూ కామేశ్వరి నెత్తిన మొత్తుకుంది.

శ్యామల చూస్తూ నిల్చుంది! ఆ ప్రక్కనున్న కుంపటి మీద పాలు పొంగుతున్నాయి. అప్పుడే అక్కడికి వచ్చిన లక్ష్మి "అయ్యయ్యో... పాలు పొంగుతున్నా చూడరేం?'' అంటూ నీళ్ళు దిమ్మరించింది... పాలగిన్నె పైన!

"చూసినట్టే వుందిలే సంబడం? దీపపు సెమ్మెలాగా నిల్చుంది గానీ, పాలు పొంగుతున్నట్టు కూడా తెలియదూ? దిక్కుమాలిన కోడలు ...! అందరిదీ ఓ దారి, ఉలిపి కట్టెలది ఓ దారి అనీ... కాంతమ్మగారు ... సీతమ్మగారు కోడళ్ళతో ఎంతో సుఖంగా వుండి, సారెలు, పండుగ వేడుకలు జరుపుకుంటున్నారు. నాకు ఈ పిచ్చి పీనుగతో, చావు యాతనగా వుంది. చూడు ... ఎన్ని అన్నా అలా చూస్తుంది గానీ, ఏ పనీ చేయదు. ఫో ... అవతలకి, శనిగ్రహమా!'' ఒళ్ళు తెలియని కోపంతో పళ్ళు బిగించి శ్యామల బుగ్గల్లో పొడిచింది కామేశ్వరి.

"ఏం లాభం? మన నోరు నొప్పి పుట్టుంది తప్ప - 'దానికేం' నొప్పి? అసలు అలా కాదు ... పని రాదు, రాదు అంటే 'అది' అలాగే ఊరుకుంటోంది. తినడం రావడం లేదూ? అలాగే పని కూడా రావాలి. ఉండు... నే చెప్తా!" అంటూ శ్యామల జబ్బ పట్టుకుని బరబరా పెరట్లోకి లాక్కెళ్ళింది లక్ష్మి.

"నూతిగట్టుమీద కాఫీగ్లాసులు, టిఫిన్ ప్లేట్లు పడేసి వున్నాయి. ఇవన్నీ ఆ పిండి పెట్టి తోము. ఆ తర్వాత కడిగి బోర్లించు. సరిగా చెయ్యక పోయావో?... ఇవేళ నీకు కూడు పెట్టం! తెల్సిందా?" అని అరచి ఇంట్లోకెళ్ళి పోయింది లక్ష్మి.

శ్యామల రెండు నిముషాలు అలాగే కూర్చుంది!

తర్వాత బుర్రలోకి ఏం దూరిందో ... ఒక్కొక్క గ్లాసే అందుకుని పిండి పట్టించడం మొదలు పెట్టింది.

కామేశ్వరి చాలాసేపు గొణుక్కుంటూ పనులు చేసుకుంటోంది. లక్ష్మి స్నేహితురాలి ఇంటికి వెళ్ళింది. పిల్లలు స్కూలు కెళ్ళేరు. పురుషోత్తం పొలాని కెళ్ళిపోయేడు.

కామేశ్వరి వంటకి అన్నీ సిద్ధం చేసుకుని ... మనుమరాలికి సందులో నీళ్ళు పోసి ... సాంబ్రాణి పొగ చేసి కమలకి అందించింది. "అంతా మీ ఆయన పోలిక!" అంటూ కమల ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ పిల్లకి పౌడరు రాసి, కాటుక బొట్టు పెట్టి పక్కవేసి పడుకోబెట్టింది.

అప్పటివరకు కామేశ్వరి అక్కడే వుండి బారసాల నాటికి ఏమేమి చేయించాలో చెప్తోంది. ఇంతలో లక్ష్మి కూడా వచ్చి అక్క కూతుర్ని కాసేపు ముద్దులాడి, "అమ్మా... ఇంకా వంట కాలేదా? ఆకలేస్తోందే అప్పుడే! ..." అనడంతో -

"అయ్యో ... అప్పుడే! సరేలే - ఇదిగో స్నానం చేసి వంట మొదలెడ్తాను. ఎంత ... గంటలో వండేస్తాను." అంటూ గబ గబా పెరట్లో నూతి దగ్గరికి వెళ్ళింది.

అక్కడ శ్యామల గ్లాసులకి, ప్లేట్లకి పిండి పట్టిస్తూనే వుంది!! డబ్బాడు పిండి దట్టంగా పట్టించి ఒక్కొక్కటే పక్కన పెడ్తోంది. అవన్నీ ఎండిపోయి అట్టలు కట్టి ఎండలో పడి ఉన్నాయి.

"ఓసి... నీ దుంప తెగ? ఇంకా అవలేదుటే? నీకు ఈ పని చెప్పి గంటన్నరైంది. నా వంటై పోయేది ఈ పాటికి! హవ్వ ... అవన్నీ ఎలా వదులుతాయి? అమ్మా లక్ష్మీ! ఇలారా! వచ్చావా! చూడు... దీని పని! పిండంతా పట్టించి ఎండబెట్టింది అవన్నీ! ఇప్పుడు ఏ వేణ్ణీళ్ళో పోసి, సోడా వేసి

కడుక్కోవాలి. ఏం పని చెప్పు ఇది? నేనందుకే దానికే పనీ చెప్పటం లేదు. ఇప్పుడు చూడు, మన దుంప తెంచింది ... మొద్దు పీనుగ!"

లక్ష్మి కోపం ఆపుకోలేక గబగబా వెళ్ళి శ్యామల వీపులో ఒక్క గుద్దు గుద్దింది.

"అమ్మో...!" అని అరచి లేచి, ఏడుస్తూ ప్రక్కకి జరిగింది శ్యామల.

"అవతలకి పోయి ఏడు... దరిద్రపు మొఖమా! ఈ మాత్రపు పని చేతకాకపోతే నీ జన్మ ఎందుకు ?" అని తిట్టుకుంటూ ఆ గ్లాసులు, ప్లేట్లు అన్నీ మళ్ళీ బకెట్‌లో పడేసి వెళ్ళిపోయింది లక్ష్మి.

కామేశ్వరి సణుక్కుంటూ, గొణుక్కుంటూ శ్యామల తల్లినీ, తండ్రినీ తిట్టుకుంటూ స్నానం చేసి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

శ్యామల చాలాసేపు అలాగే నిల్చుని ... మెల్లగా 'టిక్కీ'లోకి వెళ్ళిపోయింది.

పురుషోత్తం వచ్చాక కోడలి ప్రతాపం వర్ణించి చెప్పి "ఏమైనా సరే ... దీన్ని ఇవాళే పంపేయం"డని చెప్పింది. ఆ రోజు శ్యామలకి తిండి ఎలా పెట్టేరో, కోపంలో గ్రహించుకో లేదు వాళ్ళు. కంచంలో అన్నం, మజ్జిగ, ఊరగాయ ముక్క అన్నీ పడేసి టిక్కీలోనే పెట్టేరు.

వెర్రి శ్యామల అక్కడే తిని పడుకుంది !

ఇంటిముందు బండి ఆగేక మళ్ళీ ఒకసారి 'వెళ్ళ'నని ఏడ్చింది !

"వెళ్ళవూ?" అని కామేశ్వరి ఆ చెంపా ఈ చెంపా ఈడ్చి కొట్టింది !

"మరి ... మరి .. వాడు వెళ్ళవద్దన్నాడు!" ... బెక్కుతూనే అన్నది శ్యామల.

"ఎవడు వాడూ?" బుగ్గలు నొక్కుకుంది.

"వాడే! పెళ్ళి చేసేడే... వాడు! ఇక్కడికి వచ్చాడు గదూ?" కళ్ళు తుడుచుకుంది.

"ఆ !!? ఓసి... నీ అఘాయిత్యం మండిపోనూ? మొగుడు వెళ్ళొద్దని చెప్పాడా నీకు? పోనీ... వాడి దగ్గరకే వస్తానని చెప్పకపోయావా? చూసేరా! దీని మాటలు? ఇది పిచ్చిదంటే ఎలా నమ్మాలి? కొన్నిట్లో తెలివితేటలు వెలిగిపోతున్నాయి? కొన్నింటికి మండి మసిబొగ్గులవుతున్నాయి! చాల్లే నీ తెలివి! వాడు వచ్చాక వాడివెంట వెళ్ళిపోదువుగానిలే. ఇప్పుడు మీ అమ్మా వాళ్ళింటికి వెళ్ళు!" బలవంతంగా బండి ఎక్కించేరు.

బండి ఎక్కే వరకు వెళ్ళనని మొరాయించిన శ్యామల, బండిలోకి ఎక్కించేక చక్కగా మఠం వేసుకుని కూర్చుంది! ఒక్క ఊపులో బండి కదిలేసరికి కిలకిలా నవ్వింది.

నీరెండలు పల్చబడి పోతున్న వేళ ... కాలిబాటలో, రెండెడ్ల బండిలో ... పచ్చని పొలాల గట్లమీద ... పుట్టింటికి వెళుతున్న శ్యామల ... తనకి అత్తింట్లో సుఖంలేదని కానీ ... వాళ్ళు తనంటే ఇష్టపడటం లేదనీ ... భర్త చూడటం లేదనీ ... తన బ్రతుకు ఏమవుతుందనీ ... ఏ విధమైన ఆలోచనలూ లేకుండా హాయిగా కూర్చుంది ... వెర్రి శ్యామల!

కూతుర్నీ ... వియ్యంకుణ్ణీ చూసి మొదట కాస్త కంగారు పడినా ... శ్యామల తండ్రి 'మాధవయ్య' "రండి! రండి!" అంటూ ఎదురెళ్ళేడు.

శ్యామల బండి దిగి తల్లి దగ్గర కెళ్ళి "అమ్మా! నేను వచ్చాను!" అంటూ, తల్లినీ, చెల్లినీ వెర్రిగా చూస్తూ నిలబడింది.

"వచ్చావా అమ్మా!" ఆప్యాయంగా కూతుర్ని హృదయానికి హత్తుకుని, తల నిమిరి "ఎలా వున్నావమ్మా అక్కడ? నిన్ను బాగా చూసేరా వాళ్ళు? అన్నం తిగగల్గేవా? ఏమిటో వెర్రి పిల్లవు... ఇరవై ఏళ్ళు వచ్చినా ఏదీ తెలియదు. పెళ్ళంటే చేసేం గానీ, నీ ముఖం... నువ్వెలా బ్రతుకుతావో నమ్మా!" అంటూ కౌగలించుకొని కళ్ళనీళ్ళు పెట్టుకుంది!

"అక్కా! మరి అక్కడికి బావగారు ఎప్పుడైనా వచ్చేరా?"

"ఊరుకోవే... దాన్ని ఇప్పుడేం అడగకు. అవతల వియ్యంకుడు వున్నాడు. తర్వాత అడగ వచ్చులే!" అని చిన్న కూతురు రాజ్యాన్ని కసిరింది ... "నువ్వు అక్కకి ముఖం కడిగించి, కాఫీ నీళ్ళు పెట్టు. నేను అలా బయటికి వెళ్ళి ఆయనతో మాట్లాడుతాను" కొంగు నిండుగా కప్పుకుని త బయటికి వెళ్ళగానే ... "రా అక్కా ముఖం కడుక్కో పళ్ళపొడి చేతిలో వేస్తాను రా!" అని బాత్‌రూమ్ లోకి తీసుకెళ్ళింది.

"బాగున్నారా అన్నయ్యగారూ? ఇంటిదగ్గర అంతా కులాసాగా వున్నారా? కమలా, పిల్లా ఆరోగ్యమేనా?" తలుపుచాటునుంచే యోగక్షేమాలు మొదలుపెట్టి మెల్లగా వీధి గదిలోకి వచ్చింది శ్యామల తల్లి సీతమ్మ.

"ఆ! ఆ! అంతా కులాసాయే. అమ్మాయి అక్కడికి వచ్చి నెల్లాళ్ళు ఐపోయింది. ఒకసారి మిమ్మల్నందర్ని చూపిద్దామని తీసుకొచ్చాను. అదీగాక, అవతల బాలింతరాలు, చంటిపిల్ల, రేపు

బాలసారె అదీ జరిగితే వియ్యాలవారు వస్తారు గదా ... అన్నిటికీ మీ వదిన గారే చేసుకోవాలి ... ఇవతల ఈ అమ్మాయిని కనిపెట్టి చూస్తుండాలంటే కష్టం కదాని ... కొన్నాళ్ళు ఇక్కడ వుంచుదామని తీసుకొచ్చాను. అయినా నెల్లాళ్ళు కొత్త చోట్లో వుంటే కొంచెం భయంగా వుంటుంది గదా?..."

"అయ్యో ... ఎంతమాట? అలాగే మరి. ఏమిటో దాని దురదృష్టం! లేకపోతే ఆ వయస్సుకు ఇంటెడు పనీ చేసి చిలకలా వుండాల్సిన మాట! ఏం చేస్తాం? మీరు సహృదయులు కనుక కడుపులో దాచుకుంటున్నారు. ఎప్పటికైనా భగవంతుడు అనుగ్రహించితే పిల్ల కాస్త తెలివిన పడ్తుంది! ... మరి అబ్బాయి ఏమంటున్నాడు?" సంశయిస్తూనే అడిగింది.

పురుషోత్తం కాస్త సర్దుకొని కూర్చున్నాడు. "అనడానికి ఏముందీ? 'చూద్దాం!' అంటాడు. కాని, తీసుకెళ్తాననలేదు. బలవంతంగా పంపలేము కదా? అసలే - హైద్రాబాదు... ఆఫీసుకెళ్ళే అబ్బాయి... ఈ భార్యతో ఎలా బ్రతకగలడు? కొన్నాళ్ళు మీ వదినగార్నైనా పంపాలి. ఆవిడ ఇప్పట్లో వెళ్ళడానికి వీలుగాదు. ఇంటి దగ్గర బాలింతరాలు, చంటిపిల్ల వున్నారు గదా? ఈ లోపుగా మీరు కాస్త పిల్లకి పనులు నేర్పించండి. అసలు బొత్తిగా ఏదీ చేతకాదు. గ్లాసు, కంచం కడగడం కూడా రాకపోతే ..."

"అందుకే కదా మా బాధంతా! బావగారూ, మీకు కష్టంగా వుంటుందని మాకు తెల్సు! అయినా... కడుపుతీపి కొలది ఈ సాహసం చేసేం! డాక్టర్ సలహా ప్రకారం అమ్మాయిలో ఏదైనా ·ర్పు వచ్చిందా... సంతోషమే?! లేదా... సరే - మా పాప ఖర్మం... అనుకొని విడాకులు ఇప్పించేద్దాం! ౹ లోపులో పొలంమీద ఆదాయం మీరు వాడుకోవచ్చును ...."

మాధవయ్య మాటకి అడ్డు తగిలి "సరే లెండి! ఆ విషయాలన్నీ తర్వాత చూసుకుందాం! నేను మళ్ళీ మధ్యాహ్నమే వెళ్ళిపోవాలి. చాలా పనులున్నాయి ఇంటిదగ్గర" అంటూ తొందర పడ్డాడు.

ఆ తర్వాత వియ్యంకుడి మర్యాదలన్నీ పొంది ఇంటికి ప్రయాణమయ్యాడు పురుషోత్తం.

రెండు రోజులయ్యాక ... చిన్న కూతురు రాజ్యం ఇంట్లో లేని సమయంలో సీతమ్మ-శ్యామల దగ్గర కూర్చుంది.

"అమ్మా శ్యామలా! నీ మొగుడు ఎప్పుడైనా నీతో మాట్లాడేడా!" అల్లుడు అసలు కూతుర్ని ఎలా చూస్తున్నాడో తెలుసుకుందామని ఆ తల్లి ఆత్రం!

"ఎవడూ? పెళ్ళివాడా?"

"ఆ... వాడే! చూడూ ... 'వాడు' అనకూడదు, తప్పు! 'అతను' అనో, 'వారు' అనో అనాలి! మరి, నీకు మొగుడు కదా...!" కూతురి తప్పుని సరిదిద్ది - "మరి, అతను నీతో ఏమన్నాడు?" అనడిగింది.

"వాడూ ... కాదు ... వారూ ... ఊ ... ఆ! ఆ!" అని జ్ఞాపకం తెచ్చుకున్నట్టు ఆగి, "నన్ను అక్కడే వుండమన్నాడు. ఎప్పుడైనా వస్తాట్ట!" అంది.

సీతమ్మ ఇంకాస్త దగ్గరగా జరిగి "ఎక్కడా? వాళ్ళమ్మ దగ్గరా? తను వస్తూ వుంటానన్నాడా? ఆహా! సరే! అయితే, మరి ఇంకేం చెప్పేడు?" అంటూ కూతురి చెంపలు నిమిరింది.

"ఇంకేం చెప్పలేదు!"

"పోనీ... ఇంకేం చేసేడూ !" రహస్యంగా అడిగింది.

'తను కోరుకున్న దేదైనా జరిగిందా?' అసలు విషయం రాబట్టాలని ఆమె కాంక్ష!

"ఇంకేం చేస్తాడూ? నన్నేం కొట్టలేదు ... కోప్పడలేదు"

"ఆహా ! అయితే ... నిన్ను దగ్గరకు తీసుకున్నట్టే?" అంతకన్నా వివరంగా అడగటానికి ఆమెకే సిగ్గేసింది. ఏదో పిచ్చిమొద్దు కనుక కాపురం చక్కబరచాలనే తాపత్రయంతో ఆ మాత్రమైనా అడిగింది. అదే రేపు రాజ్యానికి పెళ్ళైతే ఒక్క ముక్క అడగ్గలదా? అది అసలు పెళ్ళయ్యాక తనతో మాట్లాడుతుందా ఈ విషయాలు?

"ఛీ! పాడు! నన్నెందుకు ముట్టుకుంటాడూ? చాలా మంచివాడు! అతని గది పడుకున్నాడు ... నేను నా గదిలో పడుకున్నాను ..."

"అయ్యో! రాత ?!" నీరు కారిపోయింది. "మీ అత్త కెంత బుద్ధిలేదు ... ఇంకెలా ఉ కాపురం కుదటపడ్తుంది ? ఇక్కడ వుంటే ఎంతో... అక్కడ వున్నా అంతే! ఊ!! ఖర్మ ఖర్మ" ఆ తల కొట్టుకుంది.

ఈ 'ఖర్మ' అన్నపదం చాలాసార్లు వింటోంది శ్యామల.

"అమ్మా! ... అక్కడుండే ... వాళ్ళమ్మ? 'అది' కూడా ఇలాగే 'ఖర్మ ! ఖర్మ !' అని నీ తలకొట్టుకుంటుంది ..." ఎంతో కనిపెట్టిన దానిలాగా సంతోషంగా చెప్పింది.

"కొట్టుకుంటుందీ? ఏం చేస్తుందీ? కొట్టుకోమను ..." కోపంతో లేచి వెళ్ళిపోయింది సీతమ్మ.

శ్యామల వెంటనే చాపమీదకి జారిపోయి పడుకుంది.

రోజులు గడిచి పోతున్నాయి!

పెళ్ళి ముహూర్తాలున్న రోజులు! మళ్ళీ రెండు నెలల దాకా మూఢాలు వున్నాయని ... డబ్బు ఇబ్బందులు వున్నా తట్టుకొని పెళ్లిళ్ళు చేసేస్తున్నారు... ఆడపిల్లలు గల తల్లి దండ్రులు! వాళ్ళ బాధ్యత తీరిపోతే నిశ్చింత! కానీ 'పెళ్ళి' కొందరి జీవితాలలో సుఖాంతమైన మలుపు తిరిగితే... మరికొందరి జీవితాలలో తీరని సమస్యలా నిలుస్తుంది. అయినా సరే... 'పెళ్ళి' ఓ పవిత్రమైన బంధం! దానికి వున్న విలువ మరి దేనికీ లేదు.

మతిలేని శ్యామలకి కూడా పెళ్ళయింది. 'దాని వల్ల ఆమెకి ఏ విధమైన లాభం కలగక పోయినా సరే... 'పెళ్లి' అనే తంతు మాత్రం ఆ మతిలేని దాని అంతరంలో ... నిద్రపోతున్న మొద్దు మెదడులో ... ఎక్కడో ఏవో కొన్ని స్మృతులు నిలిపింది' అనుకోడానికి నిదర్శనమే - ఓనాటి సంఘటన...!

ఆ రోజు ...

ఓ పెళ్ళి ఊరేగింపు వస్తోంది! బాగా డబ్బున్న వాళ్ళు! చాలా భారీగా చేస్తున్నారు పెళ్ళి. ట్యూబులైట్లు ... బ్యాండ్ మేళాలు ... పూలరథం లాంటి కారు ... సాక్షాత్తూ దేవతలే దిగివచ్చినట్టున్న పెళ్ళికొడుకు, పెళ్ళి కూతురు ...! ఇళ్ళ ముందు, మేడలమీద, అరుగుల మీద, రోడ్లమీద ... జనం నిలబడిపోయి ఆ వేడుక చూస్తున్నారు.

సీతమ్మ, రాజ్యం, శ్యామల వాళ్ళ ఇంటిముందు నిలబడి కన్నుల పండగ చేసుకుంటున్నారు.

ముందు బ్యాండు వాళ్ళు ... తరువాత సన్నాయి మేళం ... తరువాత మరొకటి ... మొత్తం మీద ఊరేగింపు అంతా దాటి వెళ్ళడానికి పావుగంట పట్టింది!

'ఎంత చక్కగా చేస్తున్నారో' అనుకుంటూ సీతమ్మ, మాధవయ్య చెప్పుకొని ఆనందిస్తూ ఇంట్లోకి వచ్చారు. అంతకు మునుపే శ్యామల ఇంట్లోకి వచ్చేసి ... మంచం మీద పడుకుంది. మామూలుగానే పడుకుందనుకుని ... మాధవయ్య, సీతమ్మ ఊరుకుని ... ఆ పెళ్ళి గొడవే చెప్పుకుంటున్నారు.

ఇంతలో రాజ్యం - "అమ్మా ... అక్క ఏడుస్తోందే?" అని పిల్చింది !

"ఎందుకూ ! ఇప్పుడేమైందీ ? నువ్వేమన్నా అన్నావా ?"

"నయమే- నేను మీ దగ్గరే వున్నాను గదే ? అదే ఎందుకో ఏడుస్తోంది !"

సీతమ్మ వెళ్ళి శ్యామల వీపుమీద చెయ్యి వేసి "ఎందుకే శ్యామలా ! ఎందు కేడుస్తున్నావ్ ?" అని అడిగినా శ్యామల లేవలేదు. ఎంతో బ్రతిమాలి లేపి కూర్చోబెట్టే ...

కళ్ళు తుడుచుకుంటూ "అప్పుడేమో... నా పెళ్ళి అని 'అతను' చేసేడా ? మళ్ళీ ఇప్పుడు అక్కడ చేస్తున్నాడా ?" అనడిగింది, బేలగా ...!

'చేసుకున్నాడ'ని అనడానికి బదులు 'చేసేడని' అంటోంది శ్యామల.

"ఎవరూ ? ఎక్కడ ? ఓసి పిచ్చి ! ఆ పెళ్ళి కొడుకు మీ ఆయన కాదే ? ఆ అబ్బాయి పేరు ... బాగానే వుంది, వెనుకటికి ఎవరో 'పెళ్ళికొచ్చిన వాళ్ళంతా నా పెళ్ళాలే' అని ముద్దులు కురిసేట్ట! నీ పిచ్చి మండినట్టే వుంది! ఎవరికి పెళ్ళయినా ... ఆ పెళ్ళి కొడుకు మీ ఆయనే అనుకుంటున్నావా? ఊరుకో" అని నవ్వింది సీతమ్మ.

"ఏం కాదు ... ఆ పెళ్ళి కొడుకు, నా పెళ్ళివాడు ఎందుకు అవుతాడూ ? నా పెళ్ళివాడు ... అదే 'వారు' ... ముందు నిలబడి బ్యాండ్ వాయిస్తున్నారు ..." ఇచ్చితంగా చెప్పింది శ్యామల.

"ఆ ? ! ! ! !" అన్నాడు మాధవయ్య.

సీతమ్మ నిర్ఘాంతపోయింది, రాజ్యం అక్కని వింతగా చూసింది.

"అవును... నేను చూసేను. ప్యాంటు వేసుకుని షర్టు వేసుకుని, తల ఇలా పైకి దువ్వుకోలేదూ ... నాక్కనిపించేడు !" అంటూ మరింత గట్టిగా అంది.

తేరుకుని ... వాస్తవంలోకి వచ్చారు ముగ్గురూ.

వేణుగోపాల్ లాంటి పోలికలతో వున్నవాడెవడో బ్యాండ్ వాయించే వాళ్ళలో వుం వుంటాడు!!

'నా మొగుడు ! నా పెళ్ళివాడు, ఇంకో చోట ఎందుకుండాలీ ?' .... అనే ఈ స్మృతి కలగడం ... జీవితంలో నూతన అధ్యాయానికి తొలిమెట్టుగా గుర్తించి ... సీతమ్మ మురిసిపోయింది!

"నా తల్లీ !" అంటూ కౌగిలించుకొని తలమీద ముద్దెట్టుకుని ... "చూడమ్మా ! మీ ఆయన చక్కగా హైద్రాబాద్‌లో ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాడమ్మా ! ఇక్కడికి వచ్చి బ్యాండ్ వాయించే ఖర్మ అతనికేం పట్టిందీ ! పిచ్చితల్లీ ! వాడెవడో ... మీ పెళ్ళి వాడి పోలికలతోటే వున్నాడు గానీ, అతను కాదమ్మా !" అని నచ్చ చెప్పి ఊరుకోబెట్టింది.

మాధవయ్యకి చాలా విచిత్ర మనిపించింది ! ఆ తర్వాత సంతోషం కల్గింది !

'ఇదీ ఒకందుకు మంచిదేలే!'... అనుకుని తృప్తిగా పడుకున్నాడు !

# 14

పగలంతా ఎండ చుర్ర్... మంటుంది. సాయంకాలం కాస్త ఎండ తగ్గిపోగానే ... చిన్నగా వణికించే చలి మొదలవుతుంది ! హైద్రాబాదులో శీతాకాలం ... ఓ వింత అనుభూతిని కల్గిస్తుంది! పగలు పరిగెత్తుకుంటూ ... రాత్రి నిలబడి నవ్వుతున్నట్లుంటుంది. రగ్గులు, స్వెట్టర్లు, మఫ్లర్లు ... సాయంత్రానికి పురివిప్పిన నెమళ్ళల్లాగా అందరి మీదికి ఎక్కి నాట్యం చేస్తూ ఉంటాయి. దుకాణాల్లో ... పేవ్‌మెంట్లమీద ... స్వెట్టర్ల గిరాకీ బాగా పెరిగి పోతుంది !

కొత్త జంటలకి ... కొత్తగా కాబోయే జంటలకి, వెచ్చని కోరికలే బొచ్చు కోట్లంత వేడి వేడిగా శరీరం అంతా కప్పేస్తాయి.

వేణుకి పెళ్ళయి నాలుగు నెలలైంది ! పేరుకే పెళ్ళి ! ఏ కోరికా తీరలేదు ! దాంపత్య ఖం ఇప్పటివరకు లేదు, ఇకముందు ఎలా వుంటుందో తెలియదు ! నిద్ర పట్టని రాత్రిళ్ళు ... గరెట్లు ... ఆఫీసులేని రోజుల్లో షికార్లు ఓదారుస్తున్నాయి ! అద్దెగదిలో ... హోటల్ కూడు తింటూ ... గాలికి తిరుగుతూ, చెత్త బ్రతుకులా వుందని విసుక్కునే వాడు. రోడ్లమీద, అందమైన అమ్మాయిలు కనిపించినా ... జంటలు కనిపించినా నవ్వుతూ, తుళ్ళుతూ, ఎవరు కనిపించినా ... కసి, కోపం. వాళ్ళందరి మీద ఏదో పగ! ఓ వారం రోజులు వరుసగా సినిమాలు చూసినా తృప్తి కలుగలేదు. పందెం వేసుకుని ప్యాకెట్ల కొలది సిగరెట్లు తగలేసినా ... తాపం తగ్గలేదు. రేసులకీ, బార్‌లకీ వెళ్ళాలనిపించినా ... డబ్బు చాలదని .... ఊరుకున్నాడు.

ఒక్కోసారి- తనకీ పిచ్చి ఎక్కి పోతుందేమో... అనుకునేవాడు. పీడా పోతుంది. పిచ్చి పెళ్ళాం, పిచ్చి మొగుడు .... ఆ తర్వాత, పిచ్చి పిల్లలు ... అక్కడ ఆగిపోయి నవ్వుకున్నాడు. తనకి

పిల్లలా? ఎలా పుడ్తారు ? ... ఆ పెళ్ళాంతో కాపురం చేస్తే గదా ? ఉహూ ! తనకి భార్య, సంసారం, పిల్లలు, ఈ అదృష్టాలు ఈ జన్మకి లేవేమో ? పోనీ ... 'రమని పెంచుకుంటాను' అనుకున్నాడు ఒకటి, రెండు సార్లు. కాని, వాళ్ళు వొప్పుకుంటారా ? ఎందుకు ఒప్పుకోరూ ? తన పరిస్థితి అంతా చెప్తే జాలి కల్గదూ ?...

'జాలి ??'

తనకి కల్గిందా ? పాపం... శ్యామల ఆ చిన్న గదిలో అనాథలా అసహాయంగా పడివుంది ! తనకి మతి సరిగా లేకపోవచ్చును ... కాని, పుట్టింట్లో వాళ్ళ వాళ్ళు ఎంతో జాగ్రత్తగా చూచుకుంటారు గదా! తనకి భార్య అయినందుకు ... తనింటికి వచ్చి అలా దిక్కులేనట్టు .... వెలివేసినట్టు బ్రతకాలా ? తనికి జాలి వుందా ? రెండేళ్ళపాటు సంసారిక జీవితంలో ... 'భర్త' అనే నీడలో నడిస్తే మానసికమైన మార్పు రాగలదని డాక్టర్లు చెప్తున్నారట గదా! అసలు ... తను ఆ ప్రయత్నం చేయగల్గుతున్నాడా ?

ఛస్ ! ఎలాగ ? తెల్లవారిన దగ్గర్నుంచి అందరితో పరిచయాలు పెంచుకొని కల్సి మెల్సి తిరగాల్సి వుంటుంది. నల్గురూ వచ్చిపోతూ వుంటారు. ఎలా మనగల్గుతుందీ ? తనకి పెద్ద సమస్య అయిపోయింది !

తరచూ వేణుకి తలపోటు తెప్పించే ఈ తలపులతో గదిలో వుండలేక ... బజార్లలో తిరగడం మొదలెట్టేడు!

సిగరెట్ దమ్ములు పీలుస్తూ ... వచ్చే పోయే ఆడపిల్లల్ని చూస్తూ ...టైం పాస్ చేస్తున్నాడు చీకటి పడింది. లైట్లన్నీ వెలిగేయి ! మ్యాట్నీ నుంచి వచ్చే జనం ... ఫస్టు షో కోసం వెళ్ళే జనం ... ఏదో ఉపద్రవం ఊడిపోతున్నట్టు పరుగులు పెడ్తున్నారు. లిబర్టీలో ఏదో ఇంగ్లీషు పిక్చర్ ! అర్ధనగ్నమైన పెద్ద బొమ్మ ! చెరువులాగ, థియేటర్ పైభాగం అంతా పరుచుకుని వుంది ! బొమ్మని చూసి ఆనందించేవాళ్ళు కొందరు ! టికెట్ కోసం నిలబడ్డ 'క్యూ' పాము మెలికలా తిరిగి రిక్షాలకి, ఆటోలకి అంతరాయం కల్గిస్తోంది ! దూరంగా టాంక్‌బండ్ పైనుంచి వచ్చే గాలి చల్లగా తగిలి సన్నగా వణుకు వస్తోంది. చెవుల చుట్టూ మఫ్లర్ చుట్టుకొని, స్వెట్టర్ చేతులు ముంజేతుల వరకు లాక్కుని

... [illegible] గా తిరుగాడు వేణు.

'రామ, రామ, నారాయణ, ఆ .... రామ, రామ, నారాయణ !' పాట వినిపించింది. నల్గురు గుడ్డివాళ్ళు ఒకరి నడుము నుంచి మరొకరి నడుముకు తాడు బిగించుకుని ... ముందువాడి చేతిలో ఒక సత్తుగిన్నెతో ... నేలమీద కూర్చుని దేక్కుంటూ వస్తున్నారు ... ఒకరి కొకరు సహాయం చేసుకుంటున్న ఆ గుడ్డివాళ్ళు ... అలా దేక్కుంటూ రోడ్లన్నీ తిరుగుతారు ! ఎంత కట్టుగా వుంటారూ? కళ్ళున్న వాళ్ళకన్నా కళ్ళు లేని వాళ్ళే నయం.

బస్సు దిగి ఒకడు హడావిడిగా రోడ్డు క్రాసు చేస్తూ ఆ గుడ్డివాళ్ళని తన్నేసి ... 'ఛీ ! వెధవ న్యూసెన్సు !' అని తిట్టుకుంటూ లిబర్టీవైపు పరిగెత్తేడు! టిక్కెట్లు అయిపోతాయేమో ... అన్న తొందర అతనిది ! ప్రక్కకి పడిపోయిన గ్రుడ్డివాళ్ళు మిగిలిన వాడు లేపితే లేచి దులుపుకుని ... మళ్ళీ మొదలెట్టేరు ... 'రామ, రామ, నారాయణ ....'

వేణు జేబులో నుంచి పైసలు తీసి పడేసేడు ! మెల్లగా కదిలి ... ముందుకు వెళ్ళేడు. ఇంతలో రయ్... మని వచ్చి ఆగింది, రాజారావు కారు! అందులో నుంచి ఉష దిగింది. రాజారావు లేడు. డ్రైవర్ కారును వెనక్కి త్రిప్పుకొని వెళ్ళిపోయాడు!

ఉల్లిపొరలా చీర ! స్లీవ్‌లెస్ జాకెట్ ! భుజాల మీదకి చిన్నముడి ... ఎత్తు చెప్పులు ... ఈ వేషంతో చకచకా టికెట్ తీసుకుని భుజానికి తగిలించుకున్న బ్యాగ్ తిప్పుకుంటూ ... మెట్లెక్కి బాల్కనీలోకి వెళుతున్న ఉషని ... రోడ్డు మీద నుంచుని చూసేడు వేణు !

ఇలాంటి సెక్స్ పిక్చర్‌కి ... ఉష ఒంటరిగా రావడం వింతగా, కొంత అయిష్టంగా తోచింది. రాజారావు ఊళ్ళో లేడా ? లేక ఏదో పని వుండి రాలేదా ? ఇద్దరూ కల్సి చూస్తే బాగుండేది. అసలు... తను మాత్రం ఎలా వచ్చింది ? రాజారావు ఇంటిలోనే వున్నాడా ?... ఇప్పుడు రాజారావు ఏం చేస్తూ వుంటాడు ? అదొక వెర్రి ! ఏం తోచకపోతే అంతులేని ఆలోచన్లు వస్తాయి ! అప్రయత్నంగా ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్ బస్సు రాగానే ఎక్కేసి, చిక్కడపల్లిలో దిగేడు వేణు.

గేటులోకి అడుగు పెట్టేముందు, చాలాసేపు రోడ్డుమీద నిలబడి సంశయించేడు. ఒకవేళ ఆనందరావు ఇంట్లో వుంటే, ఏ చెస్స్ బోర్డు దగ్గరో కూర్చోవాలి. తనకి ఇప్పుడు ఆటమీద దృష్టి లేదు. అందుకని ... చాలాసేపు, ఇంచుమించు అరగంట, ముప్పావుగంట గేటు బయటే నిలబడిపోయి, ఆఖరికి ఏదైతే అదవుతుందని ... ముందుకు నడిచేడు ...!

వీధి వరండా తలుపు వేసి వుంది. ఏ గదిలోనూ లైటు లేదు. హాల్లో ట్యూబ్‌లైట్ వెలుగు వేసివున్న గాజు తలుపుల్లో నుంచి కన్పిస్తోంది. టైగర్ ఓ మారు అరచి ... మనిషి వాసన తెలిసేక ఊరుకుంది ! ఆ మాత్రపు అరుపుకే తలుపు తెరిచి బయటికి వచ్చి "ఎవరూ ?" అని వరండాలో లైటు వేసేడు... వంట చేసే నాయర్!

"మీరా... వేణు బాబూ ? రండి. చిన్న బాబుగారు మేడమీదున్నారండీ!" అని లోపలికి వెళ్ళడానికి దారి ఇచ్చేడు. వేణు మేడ మెట్లెక్కి రాజారావు గది తలుపు తోసేడు ... లోపలికి అడుగెయ్యబోయి చటుక్కున ఆగిపోయాడు ...!

సోఫాలో కూర్చుని ముందు వున్న టీపాయ్‌మీదకి తల వంచి స్పృహలేని స్థితిలో ఉన్నాడు రాజారావు. ప్రక్కనే స్టూలు మీద సీసాలు, గ్లాసు ... జీడిపప్పు పొట్లం ... క్రింద కార్పెట్ మీద కుప్పలు కుప్పలుగా అగ్గిపుల్లలు, సిగరెట్ పీకలు ...

పరిస్థితి అర్థమైంది వేణుకి ! రాజారావు డ్రింక్ పుచ్చుకుంటాడని తెలుసు గాని ... మరీ :ఇంత చిత్తుగా తాగడం ఎప్పుడూ చూడలేదు. ఉష ... ఇంగ్లీషు పిక్చర్ చూడడానికి ఒంటరిగా వెళ్ళడం ... ఇంటి దగ్గర రాజారావు ఈ వరుసన తాగి పడి వుండడం ... వేణుకి ఏదో అనుమానం అనిపించింది! 'ఇద్దరికి ఏదో భేదాభిప్రాయాలు వచ్చి వుంటాయి !'

మెల్లగా రాజారావు తలమీద చేయివేసి పైకి ఎత్తేడు, ప్చ్ ! మళ్ళీ వాల్చేసేడు రాజారావు. బలవంతంగా ఎత్తేసరిగి పాకం చలిమిడిలాగా పక్కకి జారిపోయాడు !

'ఓహో ! స్వర్గాన్ని అవరోధించే దాకా వెళ్ళాడన్నమాట !' అనుకొని తన నోట్లో వున్న సిగరెట్ తీసి యాష్‌ట్రేలో వొదిలి, రెండు చేతుల్తో బలవంతంగా రాజరావు శరీరాన్ని లేపి సోఫాలో పడుకో బెట్టేడు. ప్రక్కనున్న బాత్‌రూమ్‌లో నుంచి నీళ్ళు తెచ్చి ముఖాన చల్లి కుదిపేడు. కొంచెం చలనం వచ్చి "ఏయ్" అన్నాడు, రాజారావు. మరొకసారి చల్లేక "ఎవడూ ! ఆ ! ఉషా !" అని పిల్చేడు మూసిన కళ్ళు బలవంతంగా తెరుస్తూ ...!

"నేను వేణును. రాజారావ్ ... చూడు. నేను వేణును !" అంటూ కుదిపేడు.

"ఎవడూ ? వేణా ? అంటే ? ... ఓహో వేణు ... మురళీ లోలుడు ... గోపాల బాలుడు నువ్వేనా ?" అంటూ లేవబోయి 'దబ్..' మని క్రింద పడ్డాడు. వేణు చటుక్కున వంగి రాజారావుని

లేపి కూర్చోబెట్టేడు. ఐదు నిమిషాల తర్వాత మత్తు తగ్గి ... "ఎవరూ ? వేణూ నువ్వా ?" అంటూ మెల్లగా లేవబోతే వేణు చేయూత నిచ్చి సోఫాలో కూర్చోబెట్టేడు ... ఎదురుగా వున్న గ్లాసుడు నీళ్లు తాగి ... "వేణూ ! కూర్చోరా ! ఎంతసేపైంది ? క్రింద ఉష వుందా ?" అనడిగేడు.

వేణు కూర్చున్నాడు. "క్రింద నాయర్ వున్నాడు. మరింక ఎవరూ కనిపించలేదు." అన్నాడు.

చాలారోజుల తర్వాత ... కాలేజీ చదువు చాలించేక ... ఇన్నాళ్ళకి మళ్లీ రాజారావు - వేణుని 'రా' అని సంబోధించేడు. ఈ మధ్య కాలంలో ఎప్పుడూ ... అంత చనువుగా పిలవలేదు. అందుకే వేణు ఒక్కసారి పాత రోజులు గుర్తు తెచ్చుకొని పులకించేడు.

రాజారావు సిగరెట్ వెలిగించుకుని మొదలెట్టేడు.

"వేణూ ! నేను తాగేను. బాగా తాగేను. ఎందుకో తెలుసా ? మనస్సు బాగా లేక ! చిత్రం ఏమిటో తెలుసా ? మనస్సు బాగా వున్నప్పుడు కూడా తాగుతారు ! అంటే ... రెండింటికీ ఒకే గమ్యం అన్నమాట ! అందుకే తాగేవాళ్ళని 'తాగుబోతు వెధవ' లంటారు. వెధవలకి భేదం తెలియదన్న మాట ! ఆల్ రైట్ ! అసలు విషయం ఏమిటంటే ... నా మనస్సేం బాగాలేదురా ! ఎందుకో అప్పుడప్పుడు మన పాతరోజులు గుర్తు వచ్చి అవే బాగున్నాయనిపిస్తుంది ! ఓహ్ ! జీవితం వెనక్కి తిరగదు ! తిరిగితే ... ప్రపంచం తల్లక్రిందులవుతుంది ! ఇప్పుడు ఏడుస్తున్న వాళ్ళు నవ్వుతారు. ఇప్పుడు నవ్వేవాళ్ళంతా అప్పుడు ఏడుస్తారు ...! ఎందుకో తెలుసా ? కొందరికి మంచి రోజులు పోయి ... చెడ్డ రోజులు వచ్చి వుంటాయి. మరి కొందరికి ఆనాటి చెడ్డరోజులు దాటి సుఖంగా వుంటుండవచ్చును. తారుమారవుతుంది గదా ? పోనీయ్ ! వదిలేద్దాం ! ఇప్పుడు అసలు విషయం ఏమిటంటే ... నేను నీకో సలహా చెప్పాలిరా !"

సిగరెట్ దులుపుకుని రెండు నిముషాలాగి ... "డబ్బుకి ఎప్పుడూ దాసోహం అవకు ! మనిషికి ఎప్పుడూ డబ్బు ముఖ్యమే ... కాదనను ..! కానీ ... డబ్బు కంటే ముఖ్యమైనది మరొకటుందిరా ... అది ... ఈ గుండెల్లో నుంచి రావాలి ! దాన్నెప్పుడూ జాగ్రత్తగా చూసుకో ! దాన్ని మరచిపోకు. అదేమిటో తెలుసా ... ప్రేమరా ... ప్రేమ !" అని నవ్వి, "ఏమిటో ... తాగేను కదూ ? నా ఇన్స్పిరేషను సరిగా చెప్పలేక పోతున్నాను. మళ్ళీ ఎప్పుడైనా చెప్తాలే ... ఆ ! అవునూ ? మీ మిసెస్‌ని తీసుకువచ్చావా ? లేదూ ? ఓరి నీ ! ఇదేం వ్రతం రోయ్ ? జన్మంతా బ్రహ్మచర్యం పాటిస్తావా? ఆవిడెలా వూరుకుంటోందిరా ! మీ వాళ్ళ కెంత తోచటం లేదూ ? నో, నో ... ఈ పద్ధతేం

బాగాలేదు. వెంటనే తీసుకు రాకపోతే నేను ఊరుకునేది లేదు. తెల్సిందా ? నేనే వెళ్ళి తీసుకొచ్చి నీ గదిలో పడేస్తా ! జాగ్రత్త !!" అని బెదిరిస్తూ నవ్వేడు.

వేణు కూడా నవ్వేసేడు ...!

ఆ తర్వాత చాలాసేపు ఇద్దరూ కాలేజీ రోజుల్ని ... ఆ నాటి తమ అనుభవాల్ని చెప్పుకుంటూ.. కులాసాగా గడిపేరు. నాయర్ వేడి వేడి కాఫీ ఇస్తే తాగి, "ఇక వెళతా"నని లేవబోతున్నప్పుడు - క్రింద కారాగిన చప్పుడైంది. నాయర్ తలుపు తెరచిన చప్పుడూ అయింది.

హై హీల్స్ టకటక లాడించుకుంటూ ఇంట్లోకి వచ్చింది ! "రాజా వున్నాడా ?" అని నాయర్‌ని అడిగి, వేణు క్రిందకి వచ్చే లోపులో ... ఆమె పైకి వచ్చేసింది ! "హల్లో ! వేణు వచ్చేడా ? అయితే పర్వాలేదు. మీకు మంచి కంపెనీ దొరికే వుంటుంది. ఒక్కరే వుంటారేమో ... అనుకున్నాను. ఎంత త్వరగా వద్దామన్నా కుదర్లేదు. మా ఫ్రెండ్ రానీయలేదు. చాలా రోజులకి కల్సుకున్నాం కదా ... ఏవో కబుర్లు చెబ్తూ కూర్చోబెట్టింది. ఆల్‌రైట్ ! నేను క్రిందకి వెళుతున్నాను ... మీరు కూడా రండి...!" అంటూ మళ్ళీ హీల్స్ టకటక లాడించుకుంటూ దిగిపోయింది.

ఆనందరావుగారు ఊళ్ళోలేరు !

'ఏమిటీ ... ఉష చెప్తున్నదేమిటి ? ఫ్రెండ్ ఇంటికా ? ఎంత అబద్ధం ? ఎందుకలా చెప్తోంది? ఓహ్ ... వీళ్ళిద్దరి మధ్య ఏదో వుంది !' అనుకుంటూ వేణు 'గుడ్ నైట్' చెప్పి బయట పడ్డాడు.

# 15

ఆఫీసులో పని ఎక్కువగా వుంది. సురేఖ కూడా చాలా అలసి పోతోంది. అసలు ఆమెకి ఓపిక ఎక్కువ. దానికి తోడు ఎక్కువగా ఎవరి తోటీ మాట్లాడదు. అంతకంటే ... ఎవరూ ఆమెతో అంతగా కల్పించుకొని మాట్లాడరంటేనే సబబు ! అవసరం అయితే తప్ప ! అందుకు ఆమె బాధ పడదు. తన పనేమిటో ... తనేమిటో!

వంచిన తల ఎత్తకుండా ఫైళ్ళు చూడాల్సి వచ్చింది. కొత్త ఆఫీసరు వచ్చాడు, పాత వివరాలన్నీ లాగుతున్నాడు...!

మధ్యాహ్నం కాస్త టీ తాగే సమయంలో బయటికి వచ్చి నిల్చుంది సురేఖ. వేణు బయటికి వెళ్ళి టిఫిన్ కాఫీ తీసుకుని వచ్చాడు.

"చూడండి !' నెమ్మదిగా పిల్చింది సురేఖ. 'నేను రేపు సి.యల్. పెట్దామనుకుంటున్నాను. కాస్త ఆ ఫైల్, అదే ... నారాయణరావుగారి ప్రమోషన్ సంగతి ... కాస్త చూసి పెట్టగలరా ?"

"చంపేరు ! నేను కూడా రేపు లీవ్ పెట్టాలనుకుంటున్నాను."

"అలాగా ? అయితే ... నేను పెట్టనులెండి. ఎలాగో పని పూర్తి చేసుకున్న తర్వాతనే... నా సంగతి చూసుకుంటాను ...."

"అంటే ... మీకు అత్యవసరమైన పని వుందా ? వుంటే, పోనీ ... నేనే లీవ్ పెట్టను ...!"

సురేఖ పేలవంగా నవ్వింది.

"అత్యవసరమైనది కాదనుకోండి. కానీ ... వీలైతే అవసరమైనదే మరి !" సందిగ్ధంగా చెప్పింది.

వేణు ఆమెవైపు చూసేడు. "ఏమనుకోకండి ... మీకేమైనా 'మాచ్' సెటిల్ కాబోతోందా ?"

దెబ్బ తిన్నట్టు చూసింది ! ఒక్క క్షణం ఆమె పెదవులు వణికేయి ! జవాబు చెప్పలేనన్నట్టుగా బేలగా చూసి ... నిర్జీవంగా నవ్వింది !

"కాదు ! ... రేపు మా సిస్టర్ బర్త్‌డే ! దానికి టీనేజ్ కంప్లీటై .. ట్వంటీ ఇయర్స్ రాబోతున్నాయి! దానికి ఆ విషయం తెలియదనుకోండి ... కానీ, నాకు తెలుసుగదా ? తెలిసీ మామూలుగా ఊరుకోలేక ... ఏదో నా తృప్తికోసం ... దాని బర్త్‌డే చేద్దామనీ ..! మీకు వింతగా వుంది కదూ?"

"అహ... ! అబ్బే - నాకేం వింతగా లేదు కానీ ... ఎక్కడ చేస్తారూ ? ఇంటికి తీసుకుని వస్తారా?"

"ఉహూ ! ఇంటికి తీసుకుని వస్తే ... మా నాన్నగారు అసలే గుండె జబ్బు మనిషి ! దాని చర్యలకి, ఆయన తట్టుకోలేరు. ఇక, మా వదిన ... అదొక రకం ! ఆమెకు ఈ రకంగా చెయ్యడం నచ్చదు. పిచ్చిదానికి సరదాలు, పార్టీలు ఏమిటని నవ్వుతుంది ! నిజమే ననుకోండి ! కానీ - ఈ సరదా దానికోసం కాదు నాకోసం ... నా తృప్తికోసం! నావల్ల దానికి మెంటల్ షాక్ తగిలింది ! అది బాగు పడేవరకు నాకు మనశ్శాంతి లేదు. నిజానికి ... నేను బ్రతికి వున్నది దానికోసమే ! ఈ ఉద్యోగం కూడా అందుకే చేస్తున్నాను. అన్నయ్య ఎన్నాళ్ళని దానికి ట్రీట్‌మెంట్ ఇప్పించగలడు ..? అదీగాక ... నాన్నగార్కి కూడా మందులు అవసరమే ! కొంతవరకైనా ... నేను సహాయం చేయాలి!"

"నిజమే ననుకోండి ...! కానీ, మీరు మాత్రం ఎన్నాళ్ళని చెయ్యగలరు ? ... రేపు మీకు మ్యారేజ్ అయితే ... వీలవుతుందా ?"

"మ్యారేజ్ !?? హూ ! అది ఇంక జరగదు ! ప్లీజ్... ఆ విషయం వదిలేయండి ! సరే ... రేపు మీరు సెలవు పెడ్తారా ? నన్ను పెట్టుకోమంటారా ? ఆ విషయం తేల్చండి !" నవ్వింది.

వేణు కూడా చిన్నగా నవ్వుతూ "ఓ పని చేద్దాం. ఇద్దరం పెట్టకుండా యధావిధిగా వర్క్ పూర్తి చేసుకుని ... సాయంత్రం మీ సిస్టర్‌కి పార్టీ చేద్దాం !" అన్నాడు.

సురేఖ ఆశ్చర్యంగా చూసి "మరి ... మీరు సెలవుపెట్టి ఏం చెయ్యాలనుకున్నారు? ఫైళ్ళ దుమ్ము దులపలేక ఇంట్లో కూర్చుందామనుకున్నారా? " అని నవ్వి ..., "సరే లెండి - రేపటి సంగతి ఆలోచిద్దాం కాని ... ఇప్పుడు కొన్ని కాయితాలైనా క్లియర్ చేద్దాం పదండి !" అని ముందుకు కదిలింది.

వేణు భుజం మీద చెయ్యి వేసి వెనక్కి లాగేడు ... ప్రక్క సీటు క్లర్క్ ప్రకాశం ! అతను అప్పుడే బయటి నుంచి వస్తున్నాడు. నోట్లో సిగరెట్ జారడానికి సిద్ధంగా వున్న పెదవులతో నొక్కి ... దాని నుండి వచ్చే పొగకి కళ్ళు చికిలించి, వేణు ముఖంలోకి చూసేడు ...! ప్రకాశం ఎక్కువగా నోటితో మాట్లాడడు, కళ్ళతో మాట్లాడుతూ వుంటాడు ! షార్టుహాండు నేర్చుకున్న ప్రతిభ ... రాత విషయంలోనే కాక , చేతల్లో కూడా చూపించాలని ప్రయత్నిస్తాడు !

కనుబొమ్మ లెగరేసి చూసిన ఆ చూపులో 'ఏమిటి కధ ? ఏదో గ్రంధం నడుపుతున్నట్టున్నావ్! పెళ్ళైన వాడివి కదోయ్ ?' అన్న అర్ధం స్ఫురించింది వేణుకి. చిరాకనిపించింది.

"చాల్లే ... మహా కనిపెట్టేవ్ ?" భుజం మీదున్న ప్రకాశం చెయ్యి వదిలించుకోబోయేడు.

ప్రకాశం గట్టిగా నొక్కి పట్టి ... రెండో చేతితో సిగరెట్ తీసి పట్టుకొని "అది కాదోయ్ నడిపితే నడిపేవ్ ? పెళ్ళైనవాడు నీతిగా వుండాలనే వెధవ రూల్స్ గురించి నే చెప్పను. కానీ ... దొరికి దొరికి ఈ అందాల బొమ్మె దొరికిందా ? ... ఏదో ఆఫీసులో కొలీగ్ కదా ? అని మాట్లాడగలమే తప్ప .... హి ... హి ... ఒక ఛాన్స్ చూసే రకమా?" అంటూ వంకరగా నవ్వేడు.

"ప్రకాశం ??! మరీ అంత చవకబారుగా మాట్లాడకు ! నేనేం దిగజారి పోవటం లేదు. ఆ పైన ... సురేఖని గురించి విమర్శించవలసిన అవసరం మనకి లేదు ! ఆమె ఎలా వుంటే మనకెందుకు? ఆఫీసులో కొలీగ్ కనుకనే ... ఆఫీసు విషయమే నే మాట్లాడుతున్నాను. అనవసర ప్రసంగం మానెయ్!" విసురుగా వెళ్ళిపోయాడు !

'దొంగ రాస్కెల్ ! నాకు తెలియదనుకుంటాడు. దబాయింపు ఒకటి ! ఆరు నెల్ల క్రితం పెళ్ళయితే ... ఓ పార్టీ లేదూ పాడు లేదు ...! అసలు పెళ్ళాన్ని కాపురానికే తెచ్చుకోలేదని ... ఎవరో చెప్పేరు ! నిజంగా పెళ్ళి చేసుకున్నాడా ? కట్నం కోసం మోసం చేసేడా ? లేకపోతే ... భార్యని తీసుకు రాలేని దద్దమ్మ లుంటారా ? ...' సిగరెట్ నేలకేసి విసురుగా కొట్టి ... ఆఫీసు రూమ్‌లోకి నడిచేడు.

సీటుమీద కూర్చుని వేణు పళ్ళు బిగించుకున్నాడు. 'ఛీ ! వెధవ బుద్ధి ! అన్నింటికీ అపార్థాలే! అపహాస్యాలే ! ఇలాంటి వెధవల మధ్య శ్యామలను తీసుకువచ్చినా ఎలా వేగగలను ? అయినా... వీళ్ళని పట్టించుకోకూడదు. సురేఖకి ఉన్నపాటి ధైర్యం నా కెందు కుండగూడదూ ?' అనుకున్నాడు.

సాయంత్రం ఆఫీసు వదిలేక ... "రేపు మీరు సి.యల్. పెట్టుకోండి. నేను పెట్టుకోవడం లేదు" అన్నాడు సురేఖతో.

"సరే లెండి !" అంది ముక్తసరిగా.

గదికి వచ్చేసరికి ... వరండాలో రమ నవ్వుతూ నిల్చుంది. మూడు నెలల క్రితమే చేతికట్టు విప్పేసేరు. కానీ ... ఆ చెయ్యి ఏమిటో అతుక్కున్నట్టే వున్నా ... అప్పుడప్పుడు ... సలుపుతున్నట్టు ... లాగుతున్నట్టు ... వుంటుందిట ! అటువంటప్పుడు రమ ఏడుస్తూ కూర్చుంటుంది. ఆసుపత్రికి తీసుకెళ్ళి చూపిస్తే ... వాళ్ళు సరిగా చెప్పక -

'ఏం ఫర్వాలేదు ... చిన్నపిల్ల కనుక అలా అంటోంది! అదే తగ్గిపోతుంది. రోజూ ఈ 'బామ్' రుద్ది మర్దనా చెయ్యి"మని ఓ బామ్ సీసా ఇచ్చేరు. ఆ పనే చేస్తూ వుంటుంది వాళ్ళమ్మ ... కానీ, వాళ్ళకి భయంగానే వుంది. చెయ్యి సరిగా అతుక్కుని వుండదనీ ..., ఏ రాయవెల్లూరో తీసుకెళ్ళాల్సి వస్తుందీ, రమ వినకుండా అనుకుంటున్నారు.

"హాయ్ ! హాయ్ ! ఏమిటి సంగతీ .." అన్నాడు రమని.

"ఎవరు వచ్చేరో చెప్పుకో !" అంటూ కళ్ళు త్రిప్పింది.

"ఓహో ! ఎవరో వచ్చేరన్నమాట ! ఊ ... సరే ! అయితే .... మీ అక్కయ్య!"

"ఉహూ !"

"కాదా ? అయితే ... మీ మెడ్రాస్ మామయ్య !"

"కానే కాదు!" తల అటూ ఇటూ వూపింది.

"ఊఁ ... సరే చెప్పేస్తున్నాను. మీ అత్తయ్య..!"

కాదన్నట్టు తల ఊపింది.

"అయితే ఎవరూ రాలేదు ! అన్నీ అబద్ధాలే !" చిన్న పిల్లాడిలా బుంగమూతి పెట్టేడు.

"ఓడిపోయేవ్ ! ఓడిపోయేవ్ ! నేనే చెప్తున్నాను. చెప్పేస్తున్నాను ... మీ మామగారు, మా ఎన్ని వచ్చారు. ఇవాళ మధ్యాహ్నం వచ్చారు." చప్పట్లు కొట్టి చెప్పింది, రమ.

ప్రక్కలో బాంబ్ పేలినట్లయింది వేణుకి.

ఎప్పుడో పడుతుందనుకున్న పిడుగు పడనే పడింది !

గుండె కొట్టుకోవడం మానేసిందేమో ... అనుకొని చెయ్యి పెట్టి చూసుకున్నాడు.

"ఏంటి బాబాయ్ ... అలా వుండి పోయేవ్ ! నమ్మట్లేదా ? అయితే ... మా యింట్లోకి వచ్చి చూడు పిన్ని కూర్చుంది. మరేమో తాతయ్యగారు బైటికి వెళ్ళేరు. రా ! చూడు !" అని చెయ్యి లాగింది.

"ఉండు రమా ! ముందు గది తాళం తియ్యనీయ్ !" గబగబా గది తాళం తీసేడు.

రమ లోపలికెళ్ళి వాళ్ళమ్మగార్కి చెప్పింది. ఆవిడ వచ్చింది.

"నాయనా వేణూ ! రమ చెప్పే వుంటుంది ... మీ మామగారు, మీ ఆవిణ్ణి తీసుకొని వచ్చారు. పాపం ... ఇంటి అడ్రసు తెల్సుకుందుకు చాలాసేపు పట్టిందట ! ఎర్రని ఎండలో వచ్చారు. భోజనం అదీ చేసేరులే ! ఇప్పుడే అలా బయటికి వెళ్ళేరు. మీ ఆవిణ్ణి అక్కడ కూర్చోబెట్టేను. వచ్చి తీసుకెళతావా ? నేను తీసుకురానా?" ఆవిడ నవ్వుతూ చెప్తుంటే వేణుకి తల తిరిగిపోతోంది !

'తను లేని సమయంలో ... మామగారు, భార్య వచ్చి ఇంటివాళ్ళని ఇబ్బంది పెట్టేరు, పైగా... శ్యామల విషయం అంతా మామగారు చెప్పే వుంటారు ! తనకెంత చిన్నతనంగా వుంటుందీ? ముందుగా ఒక్క ముక్కైనా రాయకుండా ఇలా అర్ధాంతరంగా దిగుతే ... తన గతేం కానూ ? ఈ మామగాడ్ని ఏం చేసినా పాపం లేదు. నా ప్రాణానికి సైతాన్‌లా దాపురించేడు ...!'

"కాఫీ పెట్టేను ... రమతో పంపిస్తాను ఉండు. ఇప్పుడు మళ్ళీ ఏ హోటల్‌కో వెళ్ళి తేనక్క రేదు" ... అని వేణు వద్దంటున్నా వినకుండా ఆవిడ వాళ్ళింట్లోకి వెళ్ళిపోయింది.

బూట్లు కూడా విప్పుకోకుండా అలాగే కూర్చుండిపోయేడు వేణు. మెదడు మొద్దుబారి పోయినట్లయింది ! ఇది సడన్ 'షాక్ !' '...ఆనాడు 'షాక్' తిన్నా, తెల్లవారకుండా పారిపోయి వచ్చేసేడు. ఇప్పుడు 'షాక్' తిన్నా బందీ అయిపోవల్సిందే తప్ప తప్పించుకునేందుకు మార్గం లేదు! ఇక నుంచి బ్రతుకెలా వుంటుందా?' అనుకున్నాడు.

రమ కప్పు, సాసర్ పట్టుకొని వస్తూ గుమ్మం దగ్గర చేయి బెణికినట్టయి వదిలేసింది ! కాఫీ అంతా నేలపాలై ... కప్పు, సాసర్ ముక్కలై పోయాయి. "అరెరే !" అంటూ వేణు లేచి రమ ఫ్రాకు మీద పడిన కాఫీ దులుపుతూ వుండగా ... చప్పుడు విని వాళ్ళమ్మ లోపల్నుంచి గబగబా వచ్చింది.

"ఏమైందీ ? అయ్యో ! వొంచేసేవా ? నే ననుకుంటూనే వున్నాను. ఉత్త అవిటి ముండవై పోయేవు. నడు ... ఇంట్లోకి !" అని కసిరింది.

వేణు చివ్వున తల ఎత్తి ఆవిణ్ణి చూసేడు !

రమ బిక్క ముఖం వేసుకుని ఇంట్లో కెళ్ళిపోయింది.

"పాపం ! అలా తిట్టకండి, రమ బాధపడ్తుంది. ఇప్పుడేమైందనీ ? చెయ్యి నొప్పి పుట్టి వుంటుంది !" అన్నాడు బాధగా.

"ఏం చెయ్యను నాయనా ? ఈ మధ్య అన్నీ ఇలాగే చేస్తోంది. శుభమా ... అని మీ ఆవిడ వొస్తే ... ఈ అవిటి పిల్ల గుమ్మంలో కాఫీ వొంపేసింది !" వొంగి ఆ పింగాణి ముక్కలు ఏరుతూ చెప్తోంది.

"ఆ ! ఏం ఫర్వాలేదు" అన్నాడు గాని, వేణు మనసులో..., 'రేపు శ్యామల ఏదైనా పొరపాటు చేస్తే ఇలాగే తిడ్తుందా ఈవిడ!' అనుకొని భయపడ్డాడు.

ముక్కలన్నీ ఏరేసి, పాతగుడ్డ పెట్టి అక్కడ శుభ్రం చేసి ... మళ్లీ కాఫీ తీసుకొచ్చిందావిడ. నొచ్చుకుంటూ తీసుకొని త్రాగే... ఇంటివాళ్ళ ఇంట్లోకి వెళ్ళేడు ..!

చాప మీద మోకాళ్ళ చుట్టూ చేతులు చుట్టుకొని కూర్చుంది శ్యామల. ప్రక్కన పెట్టి, బెడ్డింగ్, ఒక బ్యాగ్, చిన్న చీనారేకు డబ్బా ... ఓ బుట్ట, మరచెంబు ... అబ్బో - కొత్త కాపురానికి వచ్చిన సాక్ష్యాలు, ఆమె చుట్టూ చాలానే వున్నాయి! కొత్త చీర కుచ్చెళ్ళు పసుపు రాసిన పాదాల మీద జీరాడుతూ మట్టెల అందానికి మెరుగు పెడ్తున్నాయి.

తల వంచుకుని ముగ్ధలా కూర్చున్న శ్యామలని పరీక్షగా చూసి, 'ఈమె మతి స్థిరం లేనిదంటే ఎవరైనా నమ్ముతారా ?' అనుకున్నాడు.

వెంటనే కర్తవ్యం గుర్తుకు వచ్చింది. ఎంతసేపని శ్యామల వీళ్ళింట్లో కూర్చుంటుందీ ? మామగారు ఇంకా రానే లేదు ..!

"శ్యామలా !" మెల్లగా పిల్చేడు.

తల ఎత్తి చూసింది. సరిగ్గా ఆనాటి లాగే నవ్వింది. గుర్తు పట్టినట్టు నవ్వింది !

'ఫర్వాలేదు - నయమే' అనుకొని "లేచిరా మనిల్లు ఈ ప్రక్క వాటా !" అన్నాడు.

అంతే ! లేచింది వేణు వెనకాలే గదిలోకి వచ్చింది.

"ఆ మంచం మీద కూర్చో!" అనగానే కూర్చుంది.

చిన్నగా ఊపిరి తీసుకుని ... ఇంటివాళ్ళ ఇంట్లో వున్న సామానంతా తన గదిలోకి చేర్చేడు. రమా వాళ్ళమ్మ కూడా సహాయం చేసింది, సామాను చేర్చడంలో! ఇంతలో... మాధవయ్య వచ్చాడు. చేతిసంచీ నిండుగా పళ్ళు ... టిఫిన్ పొట్లాలు ... పూల పొట్లాం తెచ్చేడు ఆయన.

"వచ్చావా నాయనా !" అంటూ సంచీ అక్కడ పెట్టి, "నీకు ఒక ఉత్తరమైనా రాయకుండా హఠాత్తుగా రావల్సి వచ్చింది నాయనా ! నీకు ఇబ్బంది కల్గించేను. నన్ను కోపగించుకోకు ... ఆడపిల్లని గన్న తండ్రిని .. అందునా .. మామూలు పిల్ల కూడా కాదు ..! " దీనంగా మొదలెట్టేడ

"సరే లెండి ! ముందుగా ఇంట్లోకి కావల్సిన సరుకుల సంగతి చూసుకోవాలి గదా '

"అక్కర్లేదు నాయనా ! మీ అత్తగారు వారం రోజులకి సరిపోయే సరుకులన్నీ ఆ చీనారే డబ్బాలో మూటలు కట్టి పెట్టింది. అన్నీ తీసి సర్దుదాం. ముందు నువ్వూ, అమ్మాయి ఈ టిఫి తినండి. పాపం ! మీ ఇంటివాళ్ళు చాలా మంచివాళ్ళు, ఎంత ఆప్యాయంగా మాట్లాడిందో ఆవి శ్యామల సంగతి తెలిసి ... చాలా నొచ్చుకుని, ధైర్యం చెప్పింది. ఇదుగో, ఈ పొట్లాం ఆ పి అదే వాళ్ళమ్మాయి రమట ! ఆ ! అమ్మాయికి ఇయ్యి నాయినా... లడ్డూ వుండలున్నాయి అంద అంటూ పొట్లాం అందించేడు.

ఆ క్షణంలో మామగాడి మీద గౌరవం కల్గి - వెంటనే లేచి ఆ పొట్లాం అందుకుని "రమా" అని పిలుస్తూ వాళ్ళింట్లోకి వెళ్ళేడు. ఇందాక వాళ్ళమ్మ తిట్టిందని అలిగి కూర్చున్న

బ్రతిమాలి, "ఇదిగో ... నీకు లడ్డూలు ఇస్తానని ఎన్ని సార్లో అన్నానా ? మరి, పిన్ని రాగానే ఇస్తున్నాను... తీసుకో" అని అందించేడు. రమ అందుకున్నాక గదిలోకి వచ్చేసేడు.

చిన్నపిల్లయినా 'అవిటిముండ'నగానే అంతసేపు అలిగింది. కానీ ... శ్యామలకి ఏదీ తెలియదు కదా - అని బాధగా చూసేడు ఆమె వైపు. తండ్రి అందించిన దోసెలు తింటూ కూర్చుంది.

నిట్టూర్చుకున్నాడు !

తెల్లవారుతూనే మాధవయ్య వెళ్ళిపోయేడు.

వెళ్ళేముందు - కూతుర్ని పసిపిల్లలా చూసుకోవాలనీ ... సాధ్యమైనంత వరకూ కొట్టే ప్రయత్నం చేయకనీ ... నీకు విసుగనిపించినప్పుడు, తనకి ఉత్తరం రాస్తే ... తను వచ్చి తీసుకెళతానని ... చెప్పి ... "నాయనా వేణూ ! ఏదైనా నీకు సహనం చచ్చిపోనంతవరకే ... తర్వాత దాని ఖర్మ - మా ఖర్మ ! రెండేళ్ళు దాన్ని భరించు, తర్వాత వదిలేద్దూ గాని ... నిన్ను బాధ పెట్టను ... నేనే జీవితమంతా ఏడుస్తాను. కొన్నాళ్ళు మాత్రం నువ్వు భరించు నాయనా !" అని కళ్ళనీళ్లు పెట్టుకుంటూ అల్లుడి చేతుల్లో ముఖం దాచుకున్నాడు ...!

వేణుకి అప్రయత్నంగా కళ్ళనీళ్ళు తిరిగేయి. వెంటనే నిగ్రహించుకుని, "అలాగే లెండి ! వెళ్ళి రండి !" అని సాగనంపేడు.

'పాపం ! 'మామగాడు' కాదు ... 'మామగారు' మంచివాడే !' అనుకున్నాడు.

ఆ రోజు నుంచి వేణు జీవితంలో క్రొత్త అధ్యాయం ప్రారంభమైంది !

శ్యామలకి ముఖం కడిగించడటం ... స్నానం చేసుకుందుకు ఏర్పాట్లు చేయడం .... కాఫీ, భోజనం, అన్నీ అమర్చి ఆఫీసుకు బయల్దేరే సరికి చాలా ఆలస్యమైంది. ఇంటివాళ్ళింట్లో కూర్చోబెట్టి ... గదికి తాళం వేసి ఆఫీసుకి బయల్దేరేడు !

సురేఖ సెలవులో వుంది !

'అనవసరంగా నిన్న ఆమెను సి.యల్. తీసుకోమన్నాను' అనుకుని, కాదు ... పాపం! వాళ్ళ చెల్లెలు దగ్గరకు వెళ్ళాలంది కదా ? అనుకున్నాడు. తనకిక మ్యారేజ్ కాదనుకుని పెళ్ళి మాట తలపెట్టవద్దందా ! నిజమే, ఎవరు చేసుకుంటారూ ? తన బ్రతుకిక చెల్లికోసమే నంది ! ఆ చెల్లి పిచ్చిది ... తను అంద వికారం కలది ! ఇద్దరూ ఒకరికొకరు తోడుగ వుండిపోతారా ? 'ది గ్రేట్ సిస్టర్స్ !!'

ఇవాళ ఆ జ్యోతికి పార్టీ ఎలా చేస్తుంది ? పిచ్చిదైనా బర్త్‌డేకి పార్టీ ఇచ్చే అక్కని పొందగల్గిన జ్యోతి అదృష్టవంతురాలే ! అయితే ... శ్యామలకి కూడా ఇలా పార్టీలు అవీ చేయాలా ... అనుకుని నవ్వుకున్నాడు.

ఆ వేళ ఆఫీసంతా తనకి కొత్తగా కనిపించింది ! తనకి తనే క్రొత్తగా ఫీలయ్యాడు ! తను క్రొత్త కాపురం మొదలెట్టేడు ...! తన స్వంత వంటతో ! 'సతీవ్రత ధర్మం' అక్షరాలా పాటించేడు !

ఆఫీసు వదిలేక, తిన్నగా ఇంటికి వెళ్ళలేదు. సనత్ నగర్ బస్సెక్కి ఎర్రగడ్డ 'ప్రభుత్వ **మానసిక రోగ చికిత్సాలయం**' వద్ద దిగేడు. ఇంతకు మునుపు సురేఖతో వెళ్ళిన గుర్తుల ప్రకారం లోపలికి పర్మిషన్ తీసుకుని వెళ్ళేడు. ఆ సరికి సురేఖ వెళ్ళి పోతుందనుకున్నాడు. కానీ, వెళ్ళబోతూ వుంది !

"హలో ... సురేఖ గారూ!" అని పల్కరించేడు.

"ఇదేమిటి ? ఇలా వచ్చేరు ... సర్‌ప్రైజ్ చేద్దామనా ?" అన్నది తెల్లబోతూ.

"కాదులెండి ! ఇక్కడి పార్టీ ఎలా వుంటుందో చూద్దామని ...! " అని నవ్వేడు.

"భలేవారే ! ఇదేమన్నా మినిష్టర్ల పార్టీనా ? కలెక్టర్ల పార్టీనా ? పోనీ అంటే ... ఇంటిలో చేసుకునే మామూలు పార్టీ కూడా కాదు. పిచ్చివాళ్ళ పార్టీ ! దీన్ని చూడ్డానికి మీరు వచ్చేరా ?" అని నవ్వింది.

"అవును ! ఎప్పుడూ గొప్ప గొప్ప పార్టీలు చూసి విసుగెత్తి పోయింది. ఇది ఎలా వుంటుందో చూద్దామని ...!"

"అయితే రండి ... చూడండి !" అని, "కనకమ్మా ఒక్కసారి జ్యోతిని తీసుకురా !" అ. చెప్పింది.

అంతకు ముందే కనకమ్మ చేతిలో ఐదు రూపాయలు పెట్టింది సురేఖ ! అందుచేత కనకమ్మ ఏ అభ్యంతరం చెప్పకుండా ... ఐదు నిమిషాల్లో జ్యోతిని తీసుకుని వచ్చింది. చిన్న చిన్న చుక్కలున్న లేత ఆకుపచ్చ రంగు ఫుల్ వాయిల్ చీర - కొత్తది కాబోలు ... మిసమిస లాడి పోతోంది! చక్కని జాకెట్ ! తల్లో పూల దండ ... చేతికి కొత్త గాజులు ... జ్యోతి నిజంగా 'జ్యోతి'లా వెలిగి పోతోంది!

"మా జ్యోతితో పాటు దాని 'క్లాసుమేట్స్' అందరికీ ఇవాళ స్వీట్లు పంచి పెట్టేను. అందరితో కల్సి కాస్సేపు నేను డాన్సు చేసి మా జ్యోతి బర్త్ డే పార్టీ ముగించేను !" అని గర్వంగా చూసింది సురేఖ.

వేణు చలించి పోయాడు !

జేబులో నుంచి చాక్‌లెట్లు తీసి "తీసుకోమ్మా జ్యోతీ ! ఇది నా ప్రజంటేషన్ !" అంటూ అందించేడు.

జ్యోతి అందుకోబోతూ ... "ఎవరు నువ్వు ? మోహన్ వేనా ? మళ్ళీ ఎందుకొచ్చావ్ ? ఈ సారి నిన్ను తన్నవలసిందే ?" అంటూ కాలు ఎత్తబోయింది.

చప్పున సురేఖ పట్టుకుని "జ్యోతీ !! అతను మన బాబాయి గారి అబ్బాయి, అన్నయ్య!" అని చెప్పింది ! ఆ తర్వాత కాస్సేపుండి కనకమ్మ వచ్చి తీసుకెళ్ళిపోయింది జ్యోతిని.

వేణు, సురేఖ బస్సు స్టాప్ చేరేరు.

"సురేఖ గారూ ... ఎవరా మోహన్ ? ఇంతకు ముందు కూడా మీ జ్యోతి ఆ మోహన్ పేరు తల్చుకొని మండి పడింది ! ఏమన్నా 'లవ్ ఎఫేర్సా ?" అనడిగేడు.

సురేఖ ఒకసారి చూసి అటు తిరిగి నుంచుంది.

"జ్యోతికి మోహన్‌కి ఏం సంబంధం లేదు !"

"మరి ! ఓహ్ ! మీ తెల్సిన వాళ్ళలో ఎవరైనా రౌడీనా ?"

"కాదు !"

"మరి ??"

"చెప్పాలంటారా ?" సురేఖ వేణువైపు సూటిగా చూసింది.

"పోనీలెండి ! అంత చెప్పకూడనిదైతే చెప్పకండి !"

"కూడనిదేం కాదు. కానీ ... నేను మర్చిపోయిన విషయం మళ్ళీ జ్ఞాపకం చేసుకోవాలని ... అయినా చెప్తాలెండి !" అని అటు తిరిగి నుంచుంది...

"ఒకప్పుడు ... అతనూ నేనూ ప్రేమించుకున్నాం! అప్పుడు నా అందం అతన్ని ఆకర్షించింది. అతను మనసు నేను గెల్చుకున్నాను. పెళ్ళి చేసుకోవాలని ... పెద్దల ఆశీస్సులు కూడా పొందేం ! ఇంతలో ఒక దురదృష్టకరమైన రోజున నాకు ప్రమాదవశాత్తు వొళ్ళు కాలింది!

బ్రతకననుకున్నారు. మా చెల్లి నా దురవస్థను చూసి ... కొయ్యబారిపోయి, ఇంక నేను బ్రతకనని, బ్రతికినా మోహన్ నన్ను చేసుకోడనీ, మెదడుకు తట్టగానే దానికి మతి పోయింది ! నిజంగా దానికి మతిపోయింది గనుకే బ్రతికే వుంది. లేకపోతే, మోహన్ నన్ను చూసి అసహ్యించుకున్న రోజున అది అక్కడ వుండి వుంటే ... అతన్ని చంపి ... అది చావడమో ... జన్మ ఖైదులో వుండటమో జరిగేది ! నిజానికి ఇదీ ఖైదే ననుకోండి. కానీ ... దానికా సంగతి తెలియదు కదా ? కాని, పిచ్చి ఎత్తే సమయానికి దాని బుర్రలో మెరిసిన ఊహే ... దానికి గుర్తు వస్తూ వుటుంది! వింటున్నారా" అంటూ ఇటు తిరిగింది.

వేణు సురేఖ వైపు చూసేడు. ప్చ్ ! మనసారా ప్రేమించిన వాడు ... ప్రమాదవశాత్తు 'రూపు' చెడిపోతే ... తిరస్కరించేడా ? అప్పుడు ఈమె ఎలా భరించింది? చచ్చిపోలేదా ? తల్లికోసం, చెల్లికోసం భరించి బ్రతికి వుంటుంది ! ఆ తల్లి కూడా పోయింది గనుక ఇప్పుడు చెల్లెల్నే ప్రాణంగా చూసుకుంటోంది ! వెధవ ఆ మోహన్ ! పెళ్లయిపోయాక ఈ ప్రమాదం జరిగివుంటే ఏం చేసేవాడూ?

"ఇప్పుడు ఆ మోహన్ ఎక్కడున్నాడండీ ?"

"ఎందుకు ? వెతికి తెచ్చి నా కిచ్చి పెళ్ళి చేస్తారా ?" అని నవ్వింది సురేఖ.

"ఎందుకు చెయ్యకూడదూ ?" ఆవేశంగా అడుగుతున్న వేణుని నిదానంగా చూసి ... "శాంతించండి ... అది జరగదు ... అతనికి పెళ్ళయిపోయింది. పిల్లలు కూడా పుట్టేరు" అన్నది.

"ఓహ్ ! ఎంత దురదృష్టం ! అయితే ... మీరింక జన్మంతా ఇలాగే వుండిపోతారా ? మరెవర్నయినా ... "

"వేణు గారూ ... జోకులు వేయకండి ! నా సంగతి తెల్సి అలా అడుగుతారా ? గంభీరంగా, ప్రశాంతంగా వున్నా ఆ కంఠంలో వేదన లేకపోలేదు.

"సారీ ! జోకులు బరువుగా భారంగా వుండవు ! మనస్ఫూర్తిగానే అంటున్నాను మనుషులంతా ఒకలాగే వుండరు. మంచి మనసున్న వాళ్ళు కూడా వుండవచ్చునని నా ఆశ ! ఒక సత్యం చెప్పమంటారా ? నా భార్య మతి స్థిరం లేనిది ... అంటే పిచ్చిది ! నమ్ముతారా ? అన్నాడు.

"వేణుగారూ ??!!" ఆశ్చర్యం నుంచి తేరుకోక మునుపే బస్సు వచ్చింది.

# 16

సంధ్య వేళ దాటిపోయింది. స్ట్రీట్ లైట్సన్నీ వెలిగేయి.

వేణు ఇంటి దగ్గరకొస్తున్నప్పుడు అకస్మాత్తుగా గుర్తుకొచ్చింది.

'అరే ! ఇంట్లో శ్యామల ఉంది కదూ? ఇంతసేపు ఇంటివాళ్ళింట్లో కూర్చునే వుంటుంది ! ఎంత పొరపాటు చేసేను ?'

గబగబా ఇల్లు చేరేడు ... గది తాళం తీస్తున్నప్పుడు రమ వచ్చింది !

"ఇంతసేపు ఎక్కడి కెళ్ళేవు బాబాయ్ ?" నిలదీసింది.

"ఎక్కడికీ లేదమ్మా ... ఆఫీసులో పని ఎక్కువగా వుంటోంది." తాళం తీసి లోపలికి అడుగు పెడ్తూ ... "పిన్ని ఏం చేస్తోందమ్మా ?" అనడిగేడు. మనసులో బెదురుగానే 'ఏం గొడవ చేసిందో? వాళ్ళకెంత విసుగు కల్గిందో ?' అనీ ... 'ఇకనుండి తొందరగా రావాలి' అనీ అనుకున్నాడు.

"ఏం చేస్తుందీ ? అలా కూర్చుని వుంది !" రమ మామూలుగానే చెప్పినా ... వేణుకి అనేక అర్థాలు స్ఫురించేయి. కొద్దిగా 'గిల్టీ'గా ఫీలయ్యాడు...!

'నిజమే ఏం చేస్తుందీ ? ... పిచ్చిది ఒక పని సహాయం చేస్తుందా ? రమకి కబుర్లు, కథలు ప్తుందా !, జడవేసి అలంకరిస్తుందా ?' ఏదీ లేదు. బెల్లం కొట్టిన రాయిలా అలా కూర్చుంటుంది పాపం ! రమ ... పిన్నితో ఎంతో బాగా ఉండొచ్చు ననుకుని వుంటుంది ! వాళ్ళమ్మగారు కూడ ... అద్దెకున్న వాటాలో కొత్త కాపురానికి వచ్చిన అమ్మాయితో చక్కగా కాలక్షేపం అవుతుందనుకునే వుంటారు. ప్చ ! ప్చ ! అంతా చిత్రంగా, చిరాకుగా మారిపోయింది.

"వేణు వచ్చాడమ్మా ... వెళ్ళు !" రమ వాళ్ళమ్మగారు శ్యామలని చెయ్యి పట్టుకొచ్చి తీసుకొచ్చారు ... మెల్లగా లోపలికి అడుగేసి నిలబడింది !

"పాపం ! మీకు చాలా శ్రమ కలిగి వుంటుందండి. ఏమిటో ... అనుకోకుండా నాకు ఆఫీసులో ఆలస్యం అయిపోయింది. ఇక మీదట త్వరగా వచ్చేస్తూ వుంటాలెండి !" సంజాయిషీ ఇచ్చుకునే ముద్దాయిలా తల వంచుకున్నాడు.

ఆవిడ నవ్వింది ... "నాకు శ్రమేముంది నాయనా ? నువ్వే శ్రమ పడాల్సి వస్తోందని ... బాధగా వుంది ! అసలు - కొన్నాళ్ళు మీ అమ్మగారు వచ్చి వుండాల్సింది. ఇలా అమ్మాయిని ఒక్కదాన్నే పంపేయడం అంత బాగాలేదు ! తనంతట తను అన్నీ చేసుకోగల్గితే అనుకోనక్కర్లేదు. కానీ ..." సందిగ్ధంలో ఆపేసి ... "సరే ! నేను వస్తా నాయనా ... రమా ! ఇంక చదువు అక్కర్లేదా ! ఈ సంవత్సరం స్కూలుకి వెళ్ళకుండా ఈ చెయ్యి విరగడం ఒకటి వచ్చి పడింది. ఇంట్లోనే వుండి పోవాల్సి వచ్చింది ! కాస్త చదువుకో ! రా !" అంటూ రమని తీసుకెళ్ళిపోయింది.

శ్యామల చిన్నగా నవ్వుతూ చూస్తోంది.

వేణు శ్యామలని చూసేడు. తలదువ్వి పూలదండ పెట్టేరు తల్లో ! ముఖం కడిగి బొట్టు పెట్టినట్టున్నారు .. ఆవిడ ఓపికకి మనసులోనే నమస్కరించేడు.

"శ్యామలా ... కాఫీ తాగేవా ?"

"అది ఇచ్చింది కదా ? తాగేను !"

"తప్పు ! 'అది' అనకూడదు. అక్కయ్యగారు అనాలి !"

"నాకు అక్కల్లేరు కదా ...?"

"అందుకనే ... ఈవిడ్ని అక్కయ్య అనుకో ..!"

తల ఊపింది - 'సరే' అన్నట్టు ...!

వేణు డ్రస్సు విప్పి కాళ్ళు, చేతులు, ముఖం కడుక్కొని స్టౌ వెలిగిస్తుండగా రమ వాళ్ళ కాఫీ తీసుకొని వచ్చింది.

"చ్చొ ! చ్చొ ! చ్చొ ! మీరు ఇంక, తీసుకురాకండి. పాలున్నాయి ... నేను పెట్టుకుంటాను!" ... నొచ్చుకున్నాడు.

"సరేలే ... ఇవాళ్టికి తీసుకో !" అంటూ కాఫీ గ్లాసు అక్కడ పెట్టి వెళ్ళిపోయింది. వెలిగించి స్టౌ మీద బియ్యం కడిగి పడేసేడు. కనీసం ఆ కాఫీ గ్లాసు తీసుకొచ్చి భర్తకి అందించాలన్న ధ్యా కూడా లేని శ్యామల గోడవారగా అలా నిలబడి, మండుతున్న స్టౌ వంక వింతగా చూస్తోంది.

నిట్టూర్చుకుని ... గ్లాసు అందుకున్నాడు.

ఉదయం హడావిడిగా చేసిన వంట ! గబగబా శ్యామల కంచంలో కొద్దిగా పడేసి తను తిని ... అవన్నీ తూములో పారేసి ఆఫీసు కెళ్ళిపోయేడు. ఇప్పుడవన్నీ తనే తోముకోవాల ! ఎనిమనిషి వచ్చి వెళ్లిపోయి వుంటుంది ! తను ఎప్పుడూ అంట్లు తోమించుకునే అలవాటు లేకపోవడం చేత .. అవి బైట పడేసి వెళ్ళాలన్న గుర్తు లేకపోయింది !

ఎన్నడూ అలవాటు లేకపోయినా - చచ్చినట్టు రెండు కంచాలు, గ్లాసులు, గరిటలు తోమి... అన్నం దింపి, మంచం మీద కూర్చున్నాడు.

శ్యామల గోడవారగా కూర్చుంది.

వేణుకు నవ్వు వచ్చింది ! 'ఏమిటీ కాపురం ?' ఎవరికైనా ఇలాంటి అనుభవం కలుగుతుందా? పెళ్ళయ్యాక ఎన్నేసి సరదాలు, వేడుకలు, చిలిపి కజ్జాలు వుంటాయో ... అనుకున్నాడు. కొన్నాళ్లు సెలవు పెట్టేసి ... 'లైఫ్ ఎంజాయ్' చెయ్యాలనుకున్నాడు ! అన్నీ కల్లలై, చిల్లు గిన్నెలోనుంచి జారినట్లు జారిపోయాయి ! ఎదురుగా 'భార్య' అనబడే ఆ 'మొద్దు' అలా కూర్చుంటే ఏం అనుభూతి కలుగుతుంది ? కొత్తగా భార్య వస్తే ... సాయంత్రం పూట ఇంత నీర్సంగా గడుపుకునే దౌర్భాగ్యం ఎంత మందికి కలుగుతుంది?

వేణు చిన్నగా అడిగేడు .. "నీకు ఇక్కడ బాగుందా?"

బాగుందన్నట్టు తల ఊపింది !

"ఎందుకనీ ?"

"ఏమో మరి ! ఆ ! ఆ 'పిల్ల' . . . 'అది' ... కాదు - అక్కయ్యగారు ... మరేమో - నన్నేం అనరు గదా ? చక్కగా తలదువ్వేరు. కాఫీ కూడా ఇచ్చేరు ..!"

"మరి - మా వాళ్ళ యింట్లో బాగా లేదా ?"

"నాకేం తెలుసు ?"

"నువ్వు అక్కడ వున్నావు గదా ? నేను వచ్చేను కదూ ?"

"అక్కడా ?! ఆ ! మరి ఆవిడ ... ఆవిడ ..."

"అత్తయ్య అవుతుంది."

"ఆ ! ఆ అత్తయ్య ... దాని పిల్లలు నన్ను తిట్టేవారు. మరేమో ... నేను మా అమ్మ దగ్గరికి వెళ్లనంటే కొట్టింది !" గుర్తు చేసుకుంటూ చెప్పింది.

"ఏమిటీ ?? మా అమ్మ నిన్ను కొట్టిందా ??!!" వేణు హృదయం గాయపడింది.

"అవును ! అది నీకు అమ్మవుతుందా ?"

ఆ అమాయకపు ప్రశ్నకి జాలేసింది. 'శ్యామలని అమ్మ కొట్టిందా ?'

"అన్నం తిందామా ? ఆకలేస్తోందా ?"

"ఏమో ! తినమంటే తింటాను "

శ్యామల ముఖమే చూస్తూ 'ఎంత పిచ్చి మొద్దూ ?' అనుకున్నాడు. లేచి రెండు కంచాలు పెట్టి ... వాళ్ళు తెచ్చిన ఊరగాయ, తను ప్రొద్దున చేసిన పులుసు, అన్నం వడ్డించేడు. నెయ్యి వేసి 'తిను' అన్నాడు ... తినడం మొదలెట్టింది.

ఒక్కసారి... ఆనాడు రోటి దగ్గర కూర్చుని తింటున్న శ్యామలని ఊహించుకుని బాధపడ్డాడు. తినమంటే తినడం ..., ఫలానాది కలుపుకో - అంటే కలుపుకోడం ... తప్ప తనకై తను స్వతంత్రంగా ఆలోచించడం తెలియని పసిమొగ్గ లాంటిది !

భోజనాల తంతు ముగించేక సిగరెట్ వెలిగించుకున్నాడు.

అలమార్లో నుంచి పుస్తకం ఏదో జారి క్రిందపడింది. ఆ ప్రక్కనే నిలుచున్న శ్యామల ఆ పుస్తకం అందుకుని ... అందులో బొమ్మలు చూస్తూ కూర్చుంది. నిజానికి - పుస్తకం పడిపోకుండా అందుకోవాలన్న ఉద్దేశం కాదు. దాని అట్టమీదున్న పిల్లి బొమ్మ, చంటి పిల్లాడి బొమ్మ ... ఆమెని ఆకట్టుకున్నాయి. అదేదో ఇంగ్లీషు మాగజైన్ ! ఆ బొమ్మలు చూస్తున్నంత సేపూ ... ఆమె ముఖంలో కనిపిస్తున్న ఆశ్చర్యం గమనిస్తూనే వున్నాడు వేణు! ఆ పుస్తకం ఎప్పుడో రమ అక్కడ పడేసింది. శ్యామల మనస్తత్వం అర్థం చేసుకొనేందుకు ప్రయత్నిస్తున్నాడు వేణు.

బొత్తిగా చంటిపిల్ల ! 'జూ'లో జంతువుల్ని ... రోడ్డు మీద 'కోతి ఆట' చూసి సంతోషించే చిన్నపిల్లలాగా ... పిల్లి బొమ్మల్ని, చిలక బొమ్మల్ని చూసి ఆనందిస్తోంది ! భర్త ఎదురుగా వున్నాడన్న తలపే లేదు !

సిగరెట్ కాలుతున్నంత సేపూ ... శ్యామల పుస్తకం చూస్తూనే వుంది. ఆ తర్వాత ఆవలింి ... పుస్తకం పక్కన పడేసి నేల మీదకి జారి పడుకుంది !

'అచ్చం ! చంటిపిల్లే ! ఆటలాడుకోడం అయిపోగానే పిల్ల అలసిపోయి ఆవలించే విధాన ఇదే !' ... మరో సారి అనుకొని లేచి, సిగరెట్ కిటికీలో నుంచి పారేసి, మంచం మీద పరుపు తీి క్రిందవేసి, "శ్యామలా ... లేచి ఆ పరుపు మీద పడుకో" అన్నాడు. వెంటనే లేచి పరుపు మీ పడుకుంది.

నిట్టూర్చి, గది తలుపులు తెరచుకుని బయటికి వచ్చి, తలుపులు చేరవేసి బయటికి నడిచేడ

రాత్రి పదిగంటలవుతోంది -

ఫస్టు షో చూసిన వాళ్ళు కొందరు, గాలి మేసి షికార్లు కొట్టిన వాళ్లు కొందరు ... తిరి వస్తున్నారు. ఓ జంట రిక్షాలో అతుక్కు పోయినట్లుంది. ఇంటికి వెళ్ళేవరకు ఆపుకోలేని వల తలపుల్లో, పరిసరాల్లే మరచి పోతున్నారు ... చింతల బస్తీ నుండి ఆనంద్ నగర్ వైపు వచ్చే చో .. మురిక్కాలవ దగ్గర బ్రిడ్జి కింద ... కంపు బ్రద్దలవుతూ వుంటే ... ప్రక్కనున్న ఇళ్ళల్లో నుం కిలకిలలు వినిపిస్తున్నాయి ... ఇంకా ముందుకు ... ఆనంద్‌నగర్‌లో ... మేడల్లో నీలితెరలు బెడ్‌లైట్లు ... క్రీ నీడలు ... కనిపించేయి ! స్కూటర్‌మీద వెడుతున్న ఓ భార్య, భర్త నడుం గట్టి పట్టుకుని వీపు మీదకి ఒరిగి కూర్చుంది. వాళ్ళు చిన్నవాళ్ళేం కారు ! నడి వయసు దాటిన వాళ్ళ అయితేనేం ? పట్నం నేర్పిన పాఠం, వొంట బట్టించుకుని ... చిన్న నాడు తీరని ముచ్చట్లు ఇప్పు తీర్చుకుంటున్నారు !

అసలు ... ప్రేమకి, అనురాగానికి వయస్సుతో పనిలేదు ! మనసు ముసలిదై, మూ పోనంత వరకు ... మనిషిలో చైతన్యం మాసిపోనంత వరకు ... ప్రపంచం చక్కగా ... జీవిత పచ్చగా వుంటుంది ! లేకపోతే ... ??!

లేకపోతే ... ఇలాగే పాతికేళ్ళకే ... మిగల ముగ్గిన పండులా, జవచచ్చిన కాయలా, చప్ప ఇంకా చెప్పాలంటే ... సారంలేని పిప్పిలా ఏడుస్తుంది! కాని చిత్రం ! తనకు మనసు ముసలి పోలేదు ! మూగపోలేదు ! పక్కానికి వచ్చి ... నవరాగాలు పలుకుతోంది !!

ఏం లాభం ?

అందుకోడానికీ, వినడానికీ ... ఎదుట వాళ్ళకి హృదయం లేదు !!

ఈ పాటికి గాఢనిద్రలో వుంటుంది !

వెంకటరమణ కాలనీ వరకు వచ్చి ... మళ్ళీ వెనక్కి తిరిగేడు. దారిలో కుక్కలేవో అరుస్తున్నాయి ! మీదపడ్తాయేమో ... అని భయం వేసింది ! కొన్ని కుక్కలు కరిస్తే ప్రమాదం కూడా! పిచ్చికుక్కలు కాదు గదా ? ఏమిటో ... వెర్రి ఆలోచనలు! సిగరెట్ వెలిగించాడు. తనకి ఇదొక్కటే శరణ్యం ! ఊపిరి పీల్చుకోకుండా సిగరెట్టే పీల్చుకుంటూ ... బ్రతకాలి !! ఎవరింట్లోనో గడియారం పదకొండు గంటలు కొట్టింది ! చకచకా అడుగులు వేసి చింతలబస్తీ చేరేడు ..

వరండాలోకి రాగానే అప్పుడే తలుపు తీసుకుని బయటికి వచ్చారు రాజయ్యగారు.

"ఎవరూ? వేణూ?" చీకట్లోకి చూస్తూ అడిగేరు.

"అవునండి ... నేనే !"

"అదేమిటీ ? బయట తిరిగి వస్తున్నావా ?"

వెర్రి నవ్వొకటి నవ్వి "అవును" అన్నాడు.

"భలేవాడివే !" అని నవ్వి, దగ్గరకొచ్చి "చూడు వేణూ! నువ్వేం అనుకోకు గానీ ... అసలు నీ పెళ్లి నీ ఇష్టం మీదే జరిగిందా?" అని ప్రశ్నించేరు.

"అనుకోడం, అనుకోకపోవడం అంతా పాత రోజుల్లో సంగతి ! ప్రస్తుతం ... ఏమీ అనుకోక పోవడం, ఒక్కటే నేను నేర్చుకుంటున్నాను. ఇంక నా పెళ్ళి సంగతంటారా? ఒక విధంగా ఇష్టంమీదే జరిగింది. కాకపోతే చేసుకున్నాక ఇష్టం లేకపోతోంది ! అందుకే ... ఈ తిరుగుళ్ళు ...!" నవ్వేడు.

రాజయ్యగారు కొద్దిగా కంగారుగా -

"అహ! నా ఉద్దేశ్యం అదికాదు వేణూ ! అమ్మాయికి కొంచెం మతి సరిగా లేదన్నట్టూ ... నువ్వు ఇష్టపడనట్టూ ... మీ మామగారు చెప్పేరుట ! మరి, పెళ్ళికి ఎలా ఒప్పుకున్నాడంటే ? ... మీ నాన్న ఎలాగో ఒప్పించేడన్నట్టుగా చెప్పేరుట ! అందుకని ... నీవసలు మొదట్నుంచీ అయిష్టంగానే వున్నావా ? కానీ, పెళ్ళి ముందు నువ్వు చాలా హుషారుగా, చలాకీగా, కనిపించేవు ... తర్వాతనే

దిగులుగా, డీలా పడినట్టు ... అమ్మాయిని తీసుకు రాకుండానే వచ్చేసేవు. మరి, మీ నాన్నగా
నిన్ను ఒప్పించటమనేది ఎలా జరిగింది ?'' మెల్లని స్వరంలో అడిగేరు.

అరచేత్తో ముఖం రుద్దుకుని ... క్రాపు మీద రాసుకున్నాడు వేణు.

"చూడండీ ! దురదృష్టం అంటారు ... చూసేరా? అది నన్ను ఆవరించింది ! మా నా
మీద గౌరవంతో పిల్లని చూడవలసిన బాధ్యత ఆయనకే వదిలేసేను. తీరా, పెళ్ళయిపోయా
తెల్సింది నాకు - శ్యామల అమాయకురాలనీ ... మతి సరిగా లేదనీ ... ఏం చెయ్యాలీ ?
పరిస్థితిలో వున్న మరొకడైతే మా నాన్న పీక పిసికి వుండునేమో ? నేను మాత్రం నా పీక పిసుక్కు
చావలేక, బ్రతికి బయటపడి ఇక్కడికి వచ్చేను. మీరంతా చాలా ఆశతో ఎదురు చూసేరు. నా
తెలుసు ! కానీ - నా ఆశే నిరాశై పోయాక మీ కందరికీ ఎలా జవాబు చెప్పగలను ? అందుక
తప్పుడు సమాధానాలు చెప్తూ తప్పించుకుని తిరిగేను. ఇప్పుడు ఇంక తప్పించుకునేందుకు వీలులేద
మామగారు శ్యామలని తీసుకువచ్చి మీ అందరి ముందు నిల్చోబెట్టేరు ! కాకపోతే ... ఒకటే అదృష్ట
నా నోటితో నేను చెప్పుకోనక్కర్లేకుండా ... మీకు తెల్సిపోయింది ! ఇంక దాచుకుని బ్రతకాల్సి
అవసరం నాకు లేదు...!''

"ఛ ! ఛ ! అలా అనుకోకు వేణూ ? నీకు అన్యాయమే జరిగింది. కాదనను ... కానీ, జరి
పోయాక ఏం చెయ్యాలీ ? ఇక ఇప్పుడు చెయ్యదగ్గ దేమిటో ఆలోచించాలి ! ఒకవేళ - ఈ దురదృష్ట
పెళ్ళయ్యాక ఏ ప్రమాదవశాత్తో జరిగితే ఏం చేస్తాం ? తగిన ట్రీట్‌మెంట్స్ ఇప్పిస్తామా, లేదా
అలాగే శ్యామలని మనం డాక్టర్‌కి చూపిద్దాం ! అవసరం అయితే ఎర్రగడ్డ ఆసుపత్రికి తీసుకెళ్దాం
రాజయ్యగారు ధైర్యం చెప్తూ భుజం తట్టేరు.

"ఏం లాభం వుండదండీ ? అన్ని రకాల వైద్యాలు చేయించేరుట ! డాక్టర్ సలహా ఏమిటం
.. 'పెళ్ళయితే .. పిచ్చి కుదురుతుం'దనీ, మానసిక పరిణామం కలిగితే మార్పు రావచ్చుట ! అ
వాళ్ళ అంచనాయే తప్ప - నిజజీవితంలో అదెంత కష్టమో ... వాళ్ళకి తెలియదు.''

"నిజమే ననుకో ! అయినా - శ్యామల ఇప్పుడు నీ భార్య కనుక ... నువ్వు చెయ్యద
ప్రయత్నాలన్నీ చెయ్యి ! అప్పటికీ ఏం మార్పు రాకపోతే ఏం చేస్తావ్ ? వాళ్ళింట్లో వదిలిపె
వచ్చేయి ! అంతకన్నా ఏం చెయ్యగలవు ?''

"చూద్దాం లెండి. ప్రస్తుతం రోజులు గడిస్తే ... తర్వాత సంగతి ఆలోచించ వచ్చును..!"

"చూడు వేణూ ... శ్యామల విషయంలోనే కాదోయ్ ... మొదట్లో కొందరు ... చాలా విడియంగా, సిగ్గుగా వుంటారు. అలాంటి వాళ్ళతో కొంత చిక్కే కదా? అందుకని ... కేవలం శ్యామలని మతిలేనిదనే చూపుతో కాకుండా ... కొత్తగా వచ్చిన భార్య సిగ్గుపడుతోందనే భావంతో చూడు. బొత్తిగా నిరాశ పడకు. కొన్ని కొన్ని కేసులు సక్సెస్ అయినవి కూడా వుంటాయి ! ఆల్‌రైట్ ... చాలా ప్రొద్దు పోయింది వెళ్ళి పడుకో !" భుజం చిన్నగా నొక్కి రాజయ్యగారు వెళ్ళిపోయారు.

వేణు గది తలుపులు తెరిచి లోపలికి వెళ్ళి తలుపు వేసేడు.

బెడ్‌లైట్ వెలుగులో శ్యామల, అమాయకంగా నిద్రపోతూ కనిపించింది !

పది నిమిషాలు గడిచేక ... వేణు మెల్లగా శ్యామల పక్కనే కూర్చుని మెల్లగా వొంగి నుదుటి మీద ... మొదటి సారిగా ముద్దు పెట్టుకున్నాడు !

ఆమె కదిలి ... పక్కకి ఒత్తిగిలి పడుకుంది ! చాలా సేపు తదేకంగా చూపి, మెల్లగా లేచేడు...!

'ఉహూ ! నాకే అనుభూతి కల్గడం లేదు.' అనుకుని మంచం మీద పడుకుని, చాలా సేపటికి నిద్రపోయేడు.

తెల్లవారగట్ల పని మనిషి పిలవడం, తనే లేచి అంట్లు వేసి, అవన్నీ తోమేక ఇంట్లో పెట్టుకు ... మళ్ళీ కాఫీ పెట్టడం, వంట చెయ్యడం, యధావిధిగా పనులన్నీ చేసి ... శ్యామలను స్నాన చెయ్యమన్నాడు. నీళ్ళన్నీ దిమ్మరించుకుని ... పట్టించుకున్న సబ్బు వదిలీ వదలకుండానే చీర చుట్టబెట్టుకుంది ! ఎగుడు దిగుడు చీర కుచ్చెళ్ళు ... అడ్డదిడ్డంగా జాకెట్టు వేసుకుంది.

తల దువ్వుకోవడం చేతకాలేదు. చిన్న పిల్లల్లాగా జడపాయలు మెలిచుట్టి జడ వేసుకుంది! పౌడర్ బూడిద లాగ రాసుకుంది ! ఇంత కుంకం ముఖాన మెత్తుకుంది.

అన్నీ చూసేడు ... ఒక పక్క వంట చేసిన అలుపు, మరొక ప్రక్క ఆఫీసుకెళ్ళే తొందర ... ఆ పైన శ్యామల పగటి వేషం ... అన్నీ కల్సి ఒళ్ళు మండి ... 'చావనీ! ఎలాగో ఒకలాగ!' అనుకుని ఇంత కూడు పెట్టి, ఇంటి వాళ్ళింట్లో కూర్చోబెట్టి ఆఫీసు కెళ్ళిపోయాడు.

# 17

'ఉషారాజ్ కంపెనీ ' అమోఘంగా నడుస్తోంది!

చిన్న చిన్న బ్రాంచీలు కూడా ... ఆబిడ్స్‌లో ... కాచిగుడాలో... తెరిచారు. దానివల్ల కొందరు నిరుద్యోగులకు ఆశ్రయం దొరికింది. అయితే నమ్మకస్థుడైనవాడు ఒకడుంటే వాటన్నిటిమీద ఆజమాయిషీ చేస్తూ... కనిపెట్టి చూడవచ్చును. అలాంటివాళ్ళు ఎవరుంటారూ? ... అనుకున్నప్పుడు - వేణుగోపాల్ గుర్తొచ్చాడు .

ఒకరోజు రాజారావు వేణు ఆఫీసుకు వచ్చాడు.

సాయంత్రం ఆఫీసు అయిపోగానే ... వేణు, సురేఖ, ప్రసాదు ... అందరూ బయటికి వస్తున్నారు. దూరంగా వున్న లేత ఆకుపచ్చ కారు చూసి 'రాజారావుదే' అనుకున్నా - ఈ మధ్య ఈ రంగు కార్లు చాలా వచ్చాయని సందేహించి ఊరుకున్నాడు. బస్సుస్టాప్‌లో నిల్చున్నాడు.

ఇంతలో రాజారావే వచ్చి ... "ఏం వేణూ? కారు చూసి కూడా ఇటు రాకుండా వెళ్ళిపోతున్నావ్?" అని నవ్వేడు.

"సారీ ... రాజారావ్? నీ కారు అవునో, కాదో అని సందేహించేను ...!"

గుంపులో నుంచి బయటికి వచ్చి ... రాజారావుతో కారు వైపు నడిచేడు.

"మాట్లాడాలి కూర్చో!!" డోరు తెరిచి, వేణు ఎక్కగానే తలుపేసి కారు స్టార్టు చేసేడు.

టాంక్‌బండ్ వైపుగా సాగింది కారు. విషయం అంతా వివరించి ... "రోజూ సాయంత్రం పూట ఒకటి, రెండు గంటలు పార్టుటైమ్ జాబ్‌లాగా చెయ్యాల్సి వుంటుంది! ఏమంటావ్?" అని అడిగేడు.

వేణు మాట్లాడలేదు.

"ఏమిటో సందేహిస్తున్నావ్? ఏమిటి అభ్యంతరం? నీకు టైమ్‌పాస్‌లాగా వుంటుంది ... రాబడి కూడా వుంటుంది..!"

"అహ ... అది కాదు ! మొన్నీ మధ్యనే నా మిసెస్ వచ్చింది!"

వేణు మాట పూర్తి కాకముందే ... "సో ... ఇంక నీకు ఈవినింగ్ టైమ్ టైట్ ప్రోగ్రామ్స్ వుంటాయన్నమాట. ఆల్‌రైట్! కొన్నాళ్ళు ... అంటే - రెండు, మూడు నెలలు నిన్ను వదిలేస్తాను.

ఆ తర్వాత ... సండేస్ వుంటాయి గదా? అవి చాలవా? అందుచేత అప్పుడే మొదలెట్టు ఈ జాబ్. ఈ లోపులో నేను వేరే ఎరేంజిమెంట్లు చేసుకుంటాను" ... అంటూ ప్రాబ్లం సాల్వ్ చేసినట్టు చెప్పేసేడు.

వేణు చిన్నగా నవ్వి, " ఆ తర్వాత సంగతి నేను చెప్పలేను గాని ... ప్రస్తుతం మటుకు వీలు గాదు ..." అన్నాడు.

"సరే లేవోయ్! నాకా మాత్రం తెలియదా? అఫ్‌కోర్స్ ! డబ్బుని బట్టి రకరకాల ఎంజాయ్ మెంట్సు వుంటాయనుకో ...! ఆ ! అన్నట్టూ - నీకేమైనా డబ్బు కావల్సివస్తే తీసుకో! పోనీ ... అడ్వాన్సు అనుకో - తర్వాత చెయ్యబోయే జాబు కోసం!"

వేణు దెబ్బతిన్నట్టు చేసేడు!

"నో! థాంక్స్! నేను ఇంక ఇంటికి వెళ్ళాలి. కారు ఆపితే దిగి వెళ్ళిపోతాను ...!"

కారాపి మళ్ళీ ఒకసారి గుర్తుచేసి ... "రెండు మూడు నెలల తర్వాతనే పని మొదలెట్టు!" అని చెప్పేడు రాజారావు.

"చూద్దాం!" అంటూ వెనక్కి నడిచేడు వేణు. కారు దూసుకుపోయింది!

"వెధవ ఉపకారం! ఉన్నచోటు నుండి రెండు ఫర్లాంగులు వెనక్కి తీసుకొచ్చి వదిలేడు ... ఇప్పుడు ఈ స్టాప్‌లో బస్సులు త్వరగా దొరికి ఏడవ్వు!" అని విసుక్కుని కాళ్ళీడ్చుకుంటూ మళ్ళీ ఆఫీసు ముందుకు వచ్చేసరికి బస్‌స్టాప్‌లో మూడు వంతులు జనం వెళ్ళిపోయేరు.

'ఛ! ఈ పాటికి నేను కూడా వెళ్ళిపోయేవాడిని !' మరోసారి చిరాకు పడ్డాడు. దిక్కుమాలిన బస్సులు! టైమ్ దాటిపోతే దొరకవు! వస్తే జంటలు, తోరణాలు!! లేకపోతే ... అసలే రావు! మునుపటిలాగా, ఇష్టం వచ్చినట్టు ఇంటికి వెళ్ళడానికి లేదు. శ్యామలని ఇంటివాళ్ళింట్లో కూర్చోబెట్టే వాళ్ళకెంత ఇబ్బందీ? ఇక లాభం లేదనుకుని రిక్షా మాట్లాడుకుని ఎక్కి నాల్గు అడుగులు కదిలేసరికి, వరుసగా రెండు బస్సులు వచ్చేయి!! నిట్టూర్చుకోవడం మినహా ఏమీ చెయ్యలేక నెత్తిమీద చెయ్యి పెట్టుకున్నాడు.

  

రాజయ్యగారు, వాళ్ళావిడ కలిసి ప్రక్కనున్న గది ఖాళీ చేసేరు. ఆ గది వేణు ఉన్న గదికి ఆనుకుని ... ఇంటివాళ్ళ హాల్లోకి గుమ్మం వుంది! వేణు రిక్షా దిగేసరికి గదంతా శుభ్రంగా కడిగి ... ముగ్గుపెట్టి "ఇదిగో నాయనా... వేణూ? ఈ గది ఖాళీ చేసేం! మీ ఆవిడ వచ్చాక ఇవ్వాలనుకున్నాం గదా? ఆ ఒక్క గదిలో వంట, పడక - అంటే మరీ ఇరుకైపోతుంది. అదీగాక... నువ్వు ఆఫీసుకి వెళ్ళినా అమ్మాయి ఈ గది తలుపు తెరుచుకుని వుంటే సరిపోతుంది" అంటూ రాజయ్యగారు గదంతా చూపించేరు.

వేణుకి ఆ పద్ధతి బాగానే అనిపించింది. తను అసలు గదికి తాళం వేసుకుని వెళ్ళటం కూడా అంత బాగాలేదు. అందుకని - ఇలా ఇంట్లో నుంచి తలుపు తెరుచుకోవడం బాగానే అనిపించింది.

ఆ తర్వాత మంచం ముందు గదిలోనే వుంచి వంట సామానులన్నీ క్రొత్త గదిలోకి మార్చేసేడు. యధావిధిగా కాఫీ చేసి, వంట ముగించి కూర్చున్నాడు.

'వెధవ డ్యూటీ! హాయిగా హోటల్‌కెళ్ళి భోజనం చేసి, ఇష్టం వచ్చినట్టు తిరిగేవాణ్ణి! ఎన్నడూ గరిటె పట్టుకునైనా ఎరగను...! ఈనాడు... భార్య వచ్చేక... వంట చెయ్యాల్సి వస్తోంది.'

శ్యామలకి చీకూ - చింతా లేదు... కిటికీ దగ్గర నిలబడి వీధిలోకి చూస్తోంది! పొద్దుట ‘ట్టుకున్నట్టు లేదు చీర! బహుశా, రమ వాళ్ళమ్మగారు మంచిగా కట్టి వుంటారు. జడ కూడా క్కగా వేసేరు. బొట్టు చిన్నగా పెట్టేరు. ఆవిడ శ్రద్ధకి మరోమారు మనసులోనే నమస్కారం ‍సేడు. ఈ మాత్రపు ఓపిక తమవాళ్ళకి ఎందుకు లేకపోయిందో?... అనుకున్నాడు. 'కోడలు కదా' సహజంగా వుండే 'శత్రుత్వం' కావచ్చును.

"అన్నం తింటావా శ్యామలా?"

వెనక్కి తిరిగి చూసింది. మళ్ళీ అదే మాట అడిగేడు.

"తినమంటే తింటాను!"

'ఒకటో రకమైన పిచ్చిమొద్దు...' అని నవ్వుకుని "సరే రా!" అంటూ వడ్డించేడు. ఏది వడ్డిస్తే అదే తింది. కంచంలో నీళ్ళు పోసి తొల్చి ... సగం సగం ఎంగిలితోటే ... అక్కడ పెట్టింది.

'ఆహా! ఎంత శుభ్రంగా తోమిందో!' అనుకుని మళ్ళీ ఆ కంచం కూడా తన కంచంతో

కల్పి అంట్లగిన్నెలన్నీ తూములో పడేసేడు! తను కడిగిన తర్వాత కూడా మళ్ళీ ఆ కంచం ఎందుకు అంట్లల్లో పడేసేడన్న దృష్టి కూడా లేదు శ్యామలకి. వేణు పనులన్నీ చేస్తూ వుంటే చూస్తూ నిల్చుంది!

పరుపు వేసి పడుకోమంటే పడుకుంది.

అర్ధరాత్రి దాకా సిగరెట్లు కాల్చి, క్రితం రోజులాగే చాలా ప్రయత్నం మీద ... ఒక ముద్దు పెట్టుకుని ... బలవంతంగా కళ్ళు మూసుకుని పడుకున్నాడు వేణు.

ఒకరోజు... పనిమనిషి , రమ వాళ్ళమ్మగారూ పంపు దగ్గర మాట్లాడుకుంటున్నారు.

"పాపం! వేణుబాబుగార్కి శానా అన్నాయమే జరిగిందండమ్మా! మణిపూసలాంటి కుర్రోడు ... మతిలేని పెళ్ళాంతో ఎట్టా ఏగుతాడండీ? వొయసు మొగాడు ... పోట్లగిత్తలా గుంటాడు కదా? ఆ ఎర్రిబాగుల పెళ్లాంతో కాపురం ఎట్టా సేత్తున్నాడో?"

"ఏడ్చినట్టే వుంది... నీ తెలివి? కాపురం ఒకటా? రాత్రిపూట బజార్లు తిరిగి వస్తున్నాడు. నిన్న మన అయ్యగార్కి కనిపించేట్ట! తెగ సిగరెట్లు ... వీధుల్లో తిరగడం! ఆ అమ్మాయికి అసలు భర్తమీద ధ్యాస ఏడిస్తే కదూ? ఇంక కాపురం ఏమిటీ? ఏనాటి బాకీయో వుండి ఇంత వండి పెడ్తున్నాడు. లేకపోతే ... కొత్తగా పెళ్ళి చేసుకున్న మొగాడెవడన్నా పెళ్ళానికి వండి పెట్టాల్సిన ఖర్మేమిటి చెప్పు?"

"చ్చొ! చ్చొ! చ్చొ! ఆళ్ళ పెద్దాళ్ళకి ఎంత బుద్ధి లేదండీ? ఎవరో ఒకరు రావాలి గానీ ... తీరు పిచ్చిమడిసిని ఇక్కడికి ఒంటిరిగా పంపుతారా? ఈ అన్నాయం పాడుగాను..., అటు కాపరానికి పనికిరాక ఇటు వంటకి పనికిరాక ఎందుకొచ్చిన పెళ్ళి ఇది! సీ! సీ! మా ఇళ్ళల్లో అయితే... ఈపాటికి మారు మనువులు చేసేసుకుంటాం!! ఆ అయ్యకేం లోటు? ... రేపీపాటికి పెళ్ళవుద్ది! అట్లా చేస్తేనే మంచిది! లేకుంటే ... సెడ్డ అలవాట్లన్నీ నేర్చుకుంటాడు... సుక్కేసుకుంటూ సుక్కని పట్టాడంటే.. ఇల్లు గుల్ల, వొళ్ళు గుల్ల!"

"ఏమోలే? ఎవరి బ్రతుకులు ఎట్లా వెళ్లాలో? సరే... ఆ పంపు కట్టేసి బట్టలు ఉతికేయి!" ఇంటిలో కెళ్ళిపోయింది ఆవిడ.

వేణు హృదయం గాయపడింది.

తనని గురించి అందరూ వింతగా చెప్పుకోటం ... జాలి పడటం ... చెడిపోతానేమోనని

విచారించడం ... అంతా బాధనిపించింది. 'ఈ రకమైన వ్యాఖ్యానాలన్నిటికీ గురి కావాల్సివచ్చిన కారణం? శ్యామల వల్లే కదా!' అని ఆమె మీద కోపం వచ్చింది! ఈ పనిమనిషి ఒక ప్రెస్ రిపోర్టర్! నాల్గు రోజుల్లో వీధీ, వాడా చాటించేస్తుంది! అక్కడినుంచి ... ప్రతి ఒక్కరూ పరామర్శించడం, సానుభూతి చూపించడం ... వెధవ న్యూసెన్సు! వెధవ సంఘంలో అన్నీ బాధలే!... అనుకుని ఇంటిలోకి రాగానే శ్యామలని కోపంగా చూసేడు.

చూపులు తప్పించుకుని పక్కకి తిరిగి నుంచుంది.

'వెధవ ఫోసు ? ఇదో దొంగవేషం ! అసలు పుట్టింటిలో కూర్చోబెట్టి చెయ్యడం అలవాటు చేసేరు. ఒక్కొక్క పనే నేర్పితే తప్ప... ఎలా వస్తాయి ?' అనుకున్నాడు. రెండు రోజుల గుడ్డలు ... విడిచిన చీరలు, కుప్పగా పడివున్నాయి మూలకి ...! అవి ఉతుక్కోడం రాదు కదా? పోనీ... పనిమనిషి చేత ఉతికించుకోటం కూడా తెలియదు. తను గనుక పట్టుకెళ్ళి వేస్తే ఇంక అది నవ్వుతుంది కూడా ! ఛీ... వెధవ గోల !

"చూడు శ్యామలా... ఆ చీరలు, జాకెట్లు పట్టుకెళ్ళి, పనిమనిషికిచ్చి ఉతకమను..." అని చెప్పేడు... మూలనున్న గుడ్డలు చూపిస్తూ !

"సరే" అన్నట్టు తల ఊపి ... అవన్నీ పట్టుకెళ్ళింది.

పనిమనిషి పంపు దగ్గర ఇంటివాళ్ళ బట్టలు ఉతుకుతోంది! శ్యామల తన చేతులో గుడ్డలన్నీ బట్టల మీద పడేసి "ఉతుకు" అంది ! పనిమనిషి తెల్లబోయి ... తర్వాత "ఏందమ్మా... ఉతికిన గుడ్డల మీద ఇడిసిన మైల గుడ్డలు పడేస్తావ్ ? పక్కకి పెట్టాలని తెల్వదా ?" అని గద్దించింది.

వేణు బయటికి వచ్చి చూసి ... "శ్యామలా... అవి పక్కకి పెట్టు!" అన్నాడు. వెంటనే శ్యామల అవన్నీ తీసి పక్కకి పెట్టింది. "ఇంక లోపలికి రా" అనగానే వచ్చేసింది.

పని మనిషి చూపులు రెండు నిముషాలు అలాగే నిలిచి పోయాయి. తర్వాత మెల్లగా నవ్వుతూ "బాగానేవుంది... పిచ్చిమేళం !" అంది.

ఆ మాట వేణుకి వినిపించింది. 'కాకపోతే గదా... వాదించడానికి !' అంటూ పళ్ళు కొరుక్కొని ఊరుకున్నాడు. గబగబా పనులు ముగించుకుని ఆఫీసుకి పరిగెట్టేడు.

ఒకరోజు ఆఫీసులో సురేఖ అడిగింది.

"వేణుగారూ... మీ భార్య మతి స్థిరం లేదన్నారు కదా ? మరి పనులన్నీ చేయగల్గుతారా ఆవిడ ?"

"సామెత చెప్పినట్టుంది మీ ప్రశ్న ! 'ఆయనే' వుంటే మంగలాణ్ణి పిల్చుకునే అవసరం ఎందుకు ? అన్నట్టుగా - ఆవిడ అన్ని పనులూ సవ్యంగా చేసుకోగల్గితే ... మతి స్థిరం లేనిదెలా అవుతుందీ ? ఏదీ చేతకాదు ! కనీసం అన్నం తినడం కూడా సరిగా తెలియదు. దగ్గర కూర్చుని అన్నీ చెప్తూ వుండాలి ! అయితే, ఒక్క సుగుణం ఏమిటంటే ... అరుపులూ, అన్నీ పీకి పారేయటం లాంటి వేవీ లేవు ! అవి ఉంటే అసలు పెళ్ళే జరిగేది కాదు ..." అని నవ్వేడు.

"అంటే ... మీ కసలు తెలియకుండానే జరిగిపోయిందా ?" సురేఖ ఆశ్చర్యపోయింది.

వేణు జరిగిన తంతు వివరంగా చెప్పేడు .. "అదండీ సంగతి..! ఇప్పుడు సాలెగూట్లో చిక్కుకున్న ఈగలా వుంది నా పని...!"

"అలా అనుకోకండి ! నీతులు చెప్పటం తేలికే కాని, ఆచరణలో ఎంత కష్టమో నాకు తెల్సు ! అలాంటి నీతులు చెప్పను గానీ ... శ్యామల గార్ని మీరు పరాయివారుగా కాకుండా ... మీ స్వంత మనిషిలా చూసుకోండి. ఇప్పుడు మా చెల్లెల్ని నేను ఎందుకు ప్రేమించగల్గుతున్నాను? దాని మీద నా కుండే జాలి, అభిమానం ఒక్కటే కారణం కాదు. నా స్వంత తోబుట్టువు కదా? అన్న ఒక నిగూఢమైన అపేక్ష ! అలాగే... మీరు కూడా 'మీ భార్య' అన్న విషయం గుర్తుంచుకుని ఆదరించండి ! కనీసం ఆ ప్రయత్నం చెయ్యండి. మా చెల్లెలికి ఏ మాత్రం తగ్గినా ... నేను ఇంటి- తీసుకురావాలనే అనుకుంటున్నాను. మీ శ్యామలగారిలా అరుపులు, కేకలు, తిట్టడం, కొట్టడం లేకపోతే ... ఇంక అసలు బాధే లేదు ... ఏమంటారూ ? మీరేమన్నా ... మిమ్మల్ని మాత్రం నేను మెచ్చుకుంటున్నాను. మీ లాంటి సహృదయులుంటే ... కనీసం కొందరైనా బాగుపడే అవకాశం వుంటుంది !" సురేఖ ప్రశంసగా చూసింది, వేణుని!

వేణుకి మనసులో అసంతృప్తిగానే ఉంది. పైకి మాత్రం నవ్వి ఊరుకున్నాడు.

రెండు మూడు నెలలు గడిచేయి ! చాలా మందికి వేణు భార్యకి పిచ్చి అనీ, మతి లేనిదనీ... వంట కూడా చెయ్యలేదనీ ... తెల్సిపోయింది ! ప్రసాద్ లాంటివాళ్ళు 'పాపం !' అని కొన్ని సలహాలు

ఇచ్చేరు. బార్‌కి రమ్మని ... త్రి ఏస్స్‌కి వెళ్తే మజా వస్తుందనీ ... జీవితం అనుభవించడం నేర్చుకోమనీ ... లాంటివి నూరి పోసేరు. కానీ, వేణు ఏ ఒక్కటీ చెయ్యలేదు. పనిమనిషి మోటుగా, దాని భాషలో అన్న పదాలే ... వీళ్ళు నైస్‌గా, స్టయిల్‌గా చెప్పేరు. తేడా లేదు ! భాష వేరైనా భావం ఒక్కటే !

ఎంతకాలం ఆ విధంగా సాగుతుందీ ? తర్వాత పరిష్కారం ఏమిటి ? 'ఒళ్ళు గుల్ల ! ఇల్లు గుల్ల !' అన్నది నిజమే కదా ? ఒకవేళ - శ్యామలని వదిలేసి మరొక వివాహం చేసుకుందామన్నా ... అప్పుడు పిల్లనిచ్చే వాళ్ళు ... తనని గురించి తెల్సుకోరా? తమ పిల్లని ఇవ్వడానికి సిద్ధపడతారా ? 'ఇవన్నీ క్షణికానందాలు తప్ప ... సమస్యని తీర్చి, జీవితాన్ని సరిదిద్దేవి కావు ....' అన్న వివేకం ఒక్కటి వేణుని వదల్లేదు !

అందుకే ఎవరు ఎన్ని చెప్పినా మౌనంగా ఊరుకునేవాడు.

## 18

ఎగ్జిబిషన్ రోజులు !

హైద్రాబాదులో అదొక మహా ఉత్సాహపు పండుగ లాంటిది. ఎక్కడెక్కడి జనం నాంపల్లి ంచి... అటు మొజంజాహి మార్కెట్ వరకు చీమల బారులా వున్నారు. కార్లు, స్కూటర్లు, రిక్షాలు, లు... ఇవి చాలక స్పెషల్ బస్సులు...!

ఇంత ఉత్సాహం ప్రతి ఏడూ కొత్తగానే వుంటుంది ! వేణు ప్రతి సంవత్సరం ఫ్రెండ్స్ ందరితో ఈ సరదాలు పంచుకునేవాడు... ఇప్పుడవన్నీ మరచిపోయి, అందరికీ దూరంగా వుంటున్నాడు... సినిమాలు మానేసేడు...!

ఇంట్లో చాకిరీ చేసుకోవటంతో విసుగెత్తి పోయేడు. 'వచ్చి తీసుకెళ్ళ'మని.... మామగార్కి రాసేడు. అతను ఎప్పుడు 'వస్తాడా ?' అని ఎదురు చూస్తున్నాడు.

సాయంత్రం ఆఫీసు నుంచి వస్తుంటే ... రాజారావు వాళ్ల డ్రైవర్ కనిపించేడు. భార్యా పిల్లలతో ఎగ్జిబిషన్‌కి పోతున్నాడు !

"ఏమండీ... బాబుగారూ ? ఈ మధ్య అటు రావడం మానేసేరు ?" అనడిగేడు... భార్యని పిల్లల్ని కాస్త దూరంలో నుంచోబెట్టి !

"ఏం లేదు. ఇంట్లో కొంచెం పని వుంటోంది. అమ్మగార్ని తీసుకొచ్చాను గదా ?"

"అదాండి సంగతి ?" అని నవ్వి "ఈ మధ్య పెద్ద అయ్యగార్కి బాగాలేదండీ! చాలా సీరియస్ అయిపోయింది లెండి. ఇప్పుడు కాస్త నయం ! కులాసాగానే వున్నారు. ఏమిటోనండి... గొప్పోళ్ళు, గొప్పోళ్ళు అనుకుంటాం గానీ - ఆళ్ళకుండే బాధలు ఆళ్ళకీ వుంటాయండి ! ప్రేమించి పెళ్ళి చేసుకుంది ఆ ఉషమ్మ ! ఏం లాభమండీ ? ఎప్పుడూ ఆ ఆలూ మగ లిద్దరూ కీచులాటలే ? ఆళ్ళ గొడవలకే, పెద్ద బాబుగారు బెంగెట్టుకుని ఆరోగ్యం పాడు చేసుకున్నారండి. నేను పదేళ్ళ నుంచి ఆళ్ళ డ్రైవర్నండి ! ఉషమ్మ పెళ్ళికి ముందు పెద్దబాబుగారు ఎంత బాగా వుండేవారో తెలుసాండీ ? భలే హుషారుగా వుండేవారు ! ప్చ్ ! ఏమిటో ఆ కూతురూ, అల్లుడూ సుఖ పెట్టలేక పోతున్నారండి వార్ని! పెద్దతనంలో చాలా బాధపడుతున్నారండి !"

"ఆగాగు ! అసలు ఇంతకీ ఏమిటి జబ్బు ?" వేణు గాభరాగా అడిగేడు.

"జబ్బేమిటండీ ? హార్టు జబ్బు ! ఎటాక్ వచ్చింది ! ఇది రెండోసారండి ... మొదట్లో ఒకసారి... ఉషమ్మకి ఎబా... ఎందుకు లెండి... పెద్దింటోరి గొడవలు చెప్పకూడదు. ఇప్పుడు పెద్ద అయ్యగారు రెస్ట్ తీసుకుంటున్నారు. నేను రెండు రోజులు సెలవు తీసుకున్నానండి ... ఏదో 'నుమా ఇష్' చూపించమని పిల్లలు ఒకటే గోల ! మా ఇంటి దానికి కూడా సరదా వుంది లెండి ... అందుకని తీసుకెళ్తున్నాను..." అంటూ నవ్వి టోపీ సవరించుకున్నాడు...!

"వెళ్ళు వెళ్ళు" అన్నాడు వేణు.

డ్రైవర్, భార్య పిల్లలు వెళ్ళిపోయారు.

'ఒకసారి ఆనందరావుగార్ని చూడాలి ... మళ్ళీ వీలవదు, ఆఫీసులో చాలా పని వున్నా .. పాపం ! సురేఖ చూసుకోవటం వల్ల ఇంటికి త్వరగా వెళ్ళగల్గుతున్నాడు. రేపో, ఎల్లుండో శ్యామలని వాళ్ళ నాన్న వచ్చి తీసుకెళితే ... ఇంక ఆఫీసులో పనంతా తను చూసుకుని సురేఖకి కాస్త రిలీఫ్ ఇవ్వాలి !' అందుకని ఇప్పుడే వెళ్ళి ఆనందరావుగార్ని చూడాలి...' అనుకున్నాడు.

చిక్కడపల్లి వెళ్ళేసరికి బాగా చీకటి పడిపోయింది ! గేటు తీసుకుని ... వరండా ఎక్కి అలవాటైన కుక్క అరుపుని అందుకుని హాల్లోకి అడుగు పెట్టేడు ...!

సోఫాలో రగ్గు కప్పుకుని నీర్సంగా కూర్చున్నారు ... ఆనందరావుగారు! 'ఎవరూ ?' అనే ఆయన ప్రశ్నకి బదులుగా వేణు కనిపించేడు.

"హల్లో... కమాన్ ! కమాన్!" సోఫాలో సర్దుకుని సంతోషంగా ఆహ్వానించేరు. పెద్ద చెరువంత హాల్లో, చిన్న పువ్వులా వున్న ఆయనతో, "ఏమిటి మీకు ఆరోగ్యం బాగాలేదుట ! సారీ ! నే నీ మధ్య రావడం లేదు కదా ? నాకే విషయం తెలియదు, ఎలా వుంది మీకు ?" గౌరవం గాను ... ఒకింత ప్రేమగాను అడిగేడు వేణు !

"కూర్చో ! కూర్చో ! నా సంగతి కేంలే ? ఏమిటి నీ సంగతి... ఎలా వున్నావ్ ? మీ ఆవిణ్ణి తీసుకొచ్చావా ? ఇన్నాళ్ళూ ఏమైపోయావ్ ?" అని నవ్వుతూ వేణుని తన ప్రక్కన సోఫాలోనే కూర్చో బెట్టుకున్నారు. మొహమాట పడ్తూనే కూర్చున్నాడు వేణు.

నాయర్‌ని కేకేసి వేడి వేడిగా స్ట్రాంగ్ టీ తెమ్మన్నారు ఆనందరావుగారు.

"ఇంట్లో వీళ్ళు లేరా ?" అడిగేడు వేణు.

"లేరోయ్ ! ఎగ్జిబిషన్‌కి వెళ్ళేరు ! అసలు వెళ్ళమని అన్నారు. నాకోసం ఇంట్లో వుండట మేమిటీ ? ముసలాణ్ణి, ఏదో తేడా రాకుండా వుంటుందా ? ఇరవై నాల్గు గంటలు నా కోసం ఇంట్లోనే వుంటే బోరు కొట్టదూ ? నాకే, ఇంట్లో కూర్చోలేక పరమ బోరుగా వుంది ! పాపం ! రాజా కూడా నా కోసం చాలా టైమ్ స్పెండ్ చేస్తున్నాడు. అందుకని... ఇవాళ నేను వాళ్ళని బలవంతం చేసి ఎగ్జిబిషన్ చూసి రమ్మన్నాను. తీరా అన్నాక - ఇంట్లో నాకూ తోచటం లేదు ! సమయానికి వచ్చావు ! ఒక ఆట ఆడటానికి కూడా ఓపిక లేదులే ! చక్కగా మంచి కబుర్లు చెప్పు ! ఆ ! ఆవిణ్ణి తీసుకొచ్చావని రాజా కాబోలు... చెప్పినట్లున్నాడు ! అవునా ?"

"అవునండి ! రాజారావు ఓ సారి కనిపించి ... మీ కంపెనీ బ్రాంచీల్లో పార్ట్ టైమ్ జాబ్ చెయ్యమని అడిగేడు ... నాకు అప్పట్లో వీలవదని చెప్పాను ... ఆ సందర్భంలోనే, మా మిసెస్‌ని తీసుకొచ్చినట్టు చెప్పాను."

"ఆ ! అవునవును. అదీ చెప్పాడు. నీవు నీ ప్రోగ్రామ్స్ అన్నీ మీ మిసెస్‌తో ఫిక్స్ చేసేసుకుని వుంటావని అనుకున్నాం ! ఆ ! ఎలా వున్నారు మీరిద్దరూ... " ఆనందరావుగారు నవ్వుతూ చిన్న పిల్లాడిలా అడుగుతూ వుంటే వేణు సిగ్గుపడ్డాడు.

కానీ... ఆ సిగ్గు వెనుక మరొక అర్థం కూడా ఉంది ! 'తన సుఖం ఎంతలా మండిపోతోందో? ఎలా చెప్పుకోవాలి?' అందుకే - సతమతమవుతూ కూర్చున్నాడు.

నాయర్ వేడి వేడి టీ తీసుకొచ్చేడు. ఇద్దరికీ చెరొక కప్పు అందించి - "రాత్రికి ఏం తింటారండీ ?" అని ఆనందరావుగార్ని అడిగేడు.

"ఏం వద్దు! పాలు, బ్రెడ్ తీసుకుంటాను. ఉషా, రాజాకి మాత్రం వంటలు చల్లారి పోనీకుండా వేడి వేడిగా వుంచు ! ఆ ! ఆ... తీసుకో వేణూ ! చల్లారి పోకుండా నోరు కాలుతున్నప్పుడు తీసుకుంటేనే టీ రుచిగా వుంటుంది ! తీసుకో..." అంటూ హుషారుగా 'సిప్' చేస్తున్న ఆనందరావు గార్ని చూస్తూ నాయర్ ఇంకేం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఈ మధ్య నెల రోజుల నుంచి ఇంత సంతోషంగా, హుషారుగా లేరు... ఆయన !

వేణు మెల్లగా త్రాగుతున్నాడు టీ !

"చెప్పవోయ్ సంగతులు ... రెండు మూడు నెలల నుంచి మీ ఆవిడతో ఏమేమి చూసేవ్? ఎన్నెన్ని కొన్నావ్ !..."

కప్పులోకే చూస్తున్నాడు వేణు. 'ఏమి చూసేడు తను? గరిటెలు ... అన్నం గిన్నెలు కూర గిన్నెలు ... శ్యామల పగటి వేషాలు !! ... ఏమేమి కొన్నాడూ ? కొత్త కాపరానికి రెండు జాడీ ఒక పటకారు, రెండు అల్యూమినియమ్ గిన్నెలు ... చెయ్యికాలితే, రాసుకుందుకు బర్నాల్ డ ... ఇంతకన్నా తను చూసినవి, కొన్నవి ఏం వున్నాయి ? ఒక సినిమా కానీ, ఒక ఫాషనబుల్ వస్త గానీ ... ఏదీ చెప్పుకోదగ్గది లేదు !'

"ఏమిటో... చాలా ఆలోచిస్తున్నావ్ ! అంత లిస్టు వుందా ఏమిటీ? బాప్ రే ? జా జీతం అంతా ఖర్చు పెట్టేసుకుని, నాన్నగార్ని పంపమని రాయకు సుమా !?" అని కులాసె నవ్వి, "ఊరికే సరదాకి అంటున్నా వేణూ ! ఇప్పుడు ఖర్చు పెట్టకపోతే ఇంకెప్పుడు పెట్టుకుంటారు హాయిగా వుండండి. లైఫ్ బిగినింగ్‌లోనే వుండాలి... వుండాల్సిన ఎమోషనంతా ! తర్వాత ! మిగులుతుందీ ? పిల్లలూ, బాధ్యతలూ... చిరాకులూ, పరాకులూ... ఏమంటావ్ ?"

"మరే... నిజమే!" ఏదో పరధ్యాసగా అన్నాడు.

ఆనందరావుగారు ఒకసారి వేణుని నిదానించి చూసేరు. అతను ముభావంగా, ముక్తసరి వున్నాడుగాని - నిజంగా సిగ్గుపడటం, లోపల సంతోషం దాచుకున్న ఛాయలు ఏమీ కనిపించట లేదు. జడ్జీగారి 'మేధ' వెంటనే పనిలోకి దిగింది!! వేణు లైఫ్ అనుకున్నంత సజావుగా లేదా? చాల

రోజులు భార్యని తీసుకురాలేదు. తర్వాత ఇప్పుడు కూడా ఏమంత ఉత్సాహంగా లేడు. కాస్సేపు ఆగి నెమ్మదిగా ప్రారంభించేరు.

వేణు కప్పు టీపాయ్ మీద పెట్టి ఆనందరావుగారి వైపు తిరిగేడు.

"వేణూ! ఏమిటి? నేను అడిగినవాటిల్లో ఏదైనా పొరపాటు వుందా? ఎందుకు అలా వున్నావ్?"

కంగారుపడుతూ "అబ్బే... అదేం లేదు. మీరు చక్కగానే అడిగేరు. పొరపాట్లేం వుంటాయి? పెద్దలు, అనుభవజ్ఞులు, మీకు పొల్లు పోవడమా?" అన్నాడు.

ఆనందరావుగారు నవ్వేరు!

"కొంత కాలం క్రితం నేనూ అలాగే అనుకున్నానోయ్! నేను బాగా ఆలోచించే చెయ్యగలననుకున్నాను. ఎన్నో తీర్పులు ఇచ్చేను. కానీ, మా ఉష విషయంలో పొరపాటు చేశానేమో... అనిపిస్తుంది! సరేలే... దానికేం! నిన్ను నేను ఏం నొప్పించలేదు కదా!" ఆయన అంతలా తర్కించి అడిగే సరికి వేణు ఇక దాచుకోలేక పోయాడు. మనసులో ఎన్నాళ్ళుగానో పడుతున్న మధనకి పరిష్కారం కోరాలనిపించింది.

"లేదు సార్! మీరు ఏమీ నొప్పించలేదు. నేనే మీకు సరైన సమాధానం చెప్పలేక, మిమ్మల్ని సంశయంలో మిగులుస్తున్నాను. సార్... ఒక ప్రశ్నకి కొంచెం జవాబు కావాలి! డైవర్స్ విషయంలో అనుకోండి!" వేణు మాట ఇంకా పూర్తి కాలేదు.

"వేణూ?? ఏమిటి? ఏమిటి, నువ్వనేది?"... అంటూ ఆయన సడన్‌గా మారిపోయారు... ఆయాసం వచ్చి ఊగినట్టయ్యారు...!

వేణు వెంటనే లేచి ఆయనకి రగ్గు సరిగా కప్పి ... "మీరు కంగారు పడకండి. నేను మిమ్మల్ని 'లా' గురించి అడుగుతున్నానంతే!" అని గుండెల మీద రాసి ... శాంతింపచేసేడు.

ఆయనలా కంగారు పడటానికి , సడెన్‌గా ఆయాసపడిపోడానికి, కేవలం ఆయనకున్న నిస్సత్తువే కారణం కాదు. తన మీద ఆయనకున్న వాత్సల్యం అంతకన్నా కాదు. మరేదో ఇలాంటి విషయమే అయివుంటుందని ... అందుకే ఆయన తొందరగా 'రియాక్ట్' అయ్యారనీ వేణు ఊహించేడు.

అందుకే - జనరల్‌గా అడుగుతున్నానని మొదలెట్టి 'తన సంగతంతా ఇండైరక్టుగా చెప్పేడు' "మరి... ఇటువంటి విషయంలో ఆ భర్త ఎంత కాలమని ఆ భార్యతో సరిపెట్టుకోగలడంటారూ? డైవోర్సు ఇవ్వవచ్చునా?"

జడ్జి ఆనందరావుగారు గంభీరంగా నవ్వేరు.

"నాకు తెల్సు వేణూ! నువ్వు చేసుకున్న అమ్మాయికి మతి సరిగా లేదన్నమాట! సరే! డాక్టర్లు చెప్పిన ప్రకారం నువ్వు ఆమెను భర్తగా కదిలించే ప్రయత్నం ఏమైనా చేసేవా? అబద్ధం చెప్పకు! ఎందుకంటే... నీ మనసాక్షి తప్ప మరో సాక్ష్యం లేని ఏకాంత రహస్యం అది! ... సిగ్గు పడకుండా నిజం చెప్పు!"

వేణు కొంచెం తటపటాయించి, "అసలు తనకి భర్తన్న జ్ఞానమే లేకపోతే ఇంకేం చెప్పను?" అన్నాడు.

"అది సరైన జవాబు కాదు! ఆమెకి ఆ జ్ఞానం లేదనే కదా! మనం మతిలేనిదని వ్యవహరిస్తున్నాం! అటువంటప్పుడు, ఆమెకి నీయందు రక్తి కల్గి తనకై తను దరిచేరగల్గే బుద్ధి లేదు! మరి... ఆ 'ఇనిస్టింక్ట్' నువ్వు ఆమెకి కల్గించే ప్రయత్నాలు, లేదా... సన్నివేశాలు ఏమైనా కల్పించేవా!" సూటిగా అడిగేరు.

వేణు తలవంచుకున్నాడు. "లేదు ... నాకు అటువంటి భావం కల్గడం లేదు!"

"చూశావా మరి? నీకు డైవోర్స్ కావాలనుకుంటే అనేక ప్రశ్నలకి జవాబులివ్వాల్సి వుంటుం నువ్వు అబద్ధం చెప్పినా ఆ అమ్మాయి నిజం చెప్పవచ్చును. ఎలాగంటే... లాయర్ అడిగే ప్రశ్న అంత బలంగా వుంటాయి! ఆ సమయంలో కనుక ఆ అమ్మాయి - ఛీ! నన్ను అసలు అతను ముట్టుకోలేదు! అని వుంటే ఇక వేరే సాక్ష్యం అక్కర్లేదు. అబద్ధం చెప్పగల్గే తెలివి ఆమెకి లేదని డాక్టర్ 'వత్తాసు' పలుకుతాడు. మరిచిపోయిందేమో అనుకుందుకు పాత విషయాలు కొన్ని అడిగి చూస్తారు. అవన్నీ ఆమె సరిగ్గా చెప్పగల్గితే ... ఆమె జ్ఞాపకశక్తి క్షీణించలేదన్నమాట! ఇలా కొన్ని వందల ప్రశ్నలు వేస్తారు లాయర్లు! తమ క్లయింట్ల కోసం తప్పుడు సాక్షాలు సృష్టించినా, ధర్మం మేము తప్పలేము వేణూ! నేను జడ్జిగా సాధ్యమైనంత వరకు ఏ భార్యా భర్తల్ని విడదీయడానికి గాని, ఏ దొంగనీ శిక్షించడానికి గాని, ఏ హంతకుణ్ణీ హతమార్చడానికి గాని ... తొందరపడి నిర్ణయించను. తప్పనిసరి పరిస్థితుల్లో... నిజం ఋజువయ్యాక మాత్రమే తీర్పు ఇస్తాను. ఆ సంగ

అలా వుంచు... ఇప్పుడు నీవు నీ భార్యని మానవతా దృష్టితో చూడమని సలహా యిస్తున్నాను! నీకు అన్యాయమే జరిగి వుండవచ్చును... కానీ, అది నీ మ్యారేజికి ముందు సంగతి! మైనార్టీ తీరిన వాడివి... నీ వివాహం నువ్వు నిశ్చయించుకోవాలి గాని... మీ నాన్నగారు చూసి చేసుకోమంటే చేసుకుంటావా? అది నీ తప్పు! దానివల్ల శ్యామలని శిక్షించడం రెండో తప్పు! ఆ అమ్మాయికి ఏం తెల్సును? ఇప్పుడు నువ్వు ఆమెను కేవలం మనిషిగా చూడకపోయినా ... ఒక అనాథ, అబల అన్న దృష్టితో చూడు. ప్రయత్నించు ...! తర్వాత 'రిజల్ట్' చూద్దాం!''

అని ఆగి, కాస్త ఊపిరి తీసుకున్నారు. నాయర్‌ని పిల్చి చెరొక గ్లాసు బోర్నవీటా తెమ్మని పురమాయించి అది త్రాగేక తిరిగి ప్రారంభించేరు.

"మా నాన్నగారి ఫ్రెండ్ ఒకాయన వుండేవారుట! ఆయనకి ఒకడే కొడుకు! ఆస్థిపాస్తులున్న కుటుంబం. చక్కని అమ్మాయిని చూసి పెళ్ళి చేసేరు. అంతవరకు బాగానే వుంది. కానీ... ఆ తర్వాత ఒక పరమ సత్యం తెల్సింది. ఆ అమ్మాయికి శరీరం మీద అక్కడక్కడ ... మచ్చల్లాంటివి వచ్చాయి! అది లెప్రసీ!! హడలిపోయారు. వాళ్ళింట్లో ఆ అమ్మాయి వుంటే ఎంత నరకమూ... అన్నట్టుగా భయపడ్డారు. నిజమే కదా? భయంకరమైన రోగం! భర్త వెంటనే వైద్యం మొదలెట్టించేడు. కాని, తల్లిదండ్రులు ససేమిరా ఆ పిల్ల ఇంట్లో వుండటానికి వీల్లేదన్నారు. కొడుకుని మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నారు. అప్పటికే వాళ్ళకి ఒక మనుమరాలు వుంది!

"కొడుకు వినలేదు. తన భార్యలేని ఇంట్లో తనుండనన్నాడు. ఏ 'పెద్దరోగం' వచ్చినా తన భార్య స్థానం ఆమెకేనన్నాడు. అదృష్టం బాగుంటే ఆ రోగం తగ్గిపోతుంది. లేదా... తనకీ రావచ్చును. అయినా సరే... ఆమెను వదిలేయను, అన్నాడుట! ఒకవేళ ఆ రోగం తనకే వస్తే... కోడల్ని మరొక వివాహం చేసుకోమని సలహా ఇస్తారా? అని అడిగేడుట. ఆ తల్లితండ్రులు నెత్తీనోరూ బాదుకుని పుత్ర ప్రేమను చంపుకోలేక ... కోడల్ని కూడా ఇంట్లోనే వేరే గదిలో వుంచి వైద్యాలు చేయించేరుట.

కొడుకు మాత్రం నిర్భయంగా ఆమెతో సంసారం చేసేవాడు! పిల్లలు చక్కగా వున్నారు. ఆ జబ్బు ఎవరికీ అంటుకోలేదు. ఎవర్ని బాధించలేదు. నిజంగా అతను భార్యని వదిలేస్తే ... ఎవరు అడిగేవారు లేరు! సమ్మతించవలసిన విషయమే! కానీ, అతను ఒప్పుకోలేదు ... ఎందుచేత? కేవలం అది అతనికి ఆమె యందుండే అనురక్తి వల్ల! మానవత్వం వల్ల!!

వేణూ! కోర్టులు, తీర్పులు అక్కర్లేని సహజగుణమే... ఈ మానవధర్మం! ఆ ధర్మాన్ని మించిన తీర్పు ఎక్కడా వుండదు! నేను ఎంత జడ్జీనైనా... నా కన్నకూతురు విషయంలో తీర్పు యివ్వలేకపోతున్నాను. ఉషా, రాజు... నేను కోరుకున్నంత సఖ్యతగా లేరు. వారిద్దరి మధ్య భేదాభిప్రాయాలు వచ్చేయి! ఎప్పుడో అది బాంబులాగా పేలుతుందని నా భయం! అలా జరగకూడదని నేను ఎంతలా కోరుకుంటున్నానో నీకు తెలియదు. వాళ్ళకీ తెలియదు!

ఒక విధంగా ఆలోచిస్తే ఈనాటి మీ అందరి మనస్తత్వాలు స్వార్థపూరితమైనవి! ఏమాత్రం మీకు కష్టం కలిగినా ఎదురు తిరగాలన్న ఉద్రేకం తప్ప - జాలి, త్యాగం, కరుణ... లాంటివి మీకు అబ్బటం లేదు. మా తరంలో మాకు సంఘం పట్ల, తోటి మానవుల పట్ల, నమ్మకం - సానుభూతి లాంటి సహజగుణాలు బలంగా వుండేవి! అందుకే... చాలావరకు సర్దుకుని పోవడం జరిగేది! ప్చ్! ఇప్పుడు ఏ వొక్కరూ రెండోవారి మాట వినరు! ఏం చేస్తాం? అందుకే... లాయర్లు, డాక్టర్లు ఎక్కువై పోతున్నారు. దోషులు, నేరాలు, రోగాలు కూడా పెరిగిపోతున్నాయి.

వేణూ! ముసలాణ్ణయి పోయానని నా మాట కొట్టి పారేయక, నువ్వు కాస్త శ్యామలపట్ల భర్తగా ప్రవర్తించి చూడు. ఒకవేళ అప్పుడు ఫలితం వుండకపోతే, ఆల్‌రైట్... నువ్వు నిక్షేపంగా మళ్ళీ పెళ్ళి చేసుకో!'' భుజం తడ్తూ చెప్పారు, ఆనందరావుగారు.

వేణు మౌనంగా తల వూపేడు.

ఆ తర్వాత చాలాసేపు ఏవో పాత విషయాలన్నీ కథలుగా చెప్తుంటే ఆశ్చర్యంగా విన్నాడు వేణు తొమ్మిదవుతుండగా ఉలిక్కిపడి లేచి "నేను ఇంక ఇంటికి వెళ్తా"నని 'గుడ్‌నైట్' చెప్పి బయట పడ్డాడు.

'అరెరే! శ్యామల ఏం చేస్తోందో! అన్నం వండలేదు కూడా!' కంగారుగా గాబరాగా అడుగులు తడబడుతూ ఎదురుగా వస్తున్న ఆటో ఆపి ఎక్కేసేడు!

## 19

ఆ రోజు రాజయ్యగారి దంపతులు రమని తీసుకుని వాళ్ళ బంధువుల యింటికి విందు భోజనానికి వెళ్ళేరు. ఇంట్లో చంద్రం వున్నాడు. రాత్రి తొమ్మిదయ్యేసరికి శుభ్రంగా భోజనం చేసి పడుకున్నాడు.

శ్యామల తొమ్మిదింటి వరకు మేల్కొనే వుంది! ఆ తర్వాత నిద్ర వచ్చింది. మంచం మీది పరుపు క్రింద వేసుకుని పడుకుంది!

వేణు వచ్చి తలుపు తట్టేసరికి చంద్రం లేచి తీసేడు. వాళ్ళ హాల్లోనుంచి తమ గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు. ముందు గదిలో పడుకున్న శ్యామలని చూసేడు. గబగబా కాళ్ళూ, చేతులు కడుక్కుని, డ్రస్సు మార్చుకుని అన్నం గిన్నెలు చూసేడు. ప్రొద్దుటి అన్నం కొద్దిగా వుంది.

కంచాలు కడిగి ఆ అన్నం, మజ్జిగ కలిపి మెల్లగా శ్యామలని లేపేడు. కళ్ళు నులుముకుంటూ లేచింది! వేణును చూసి నవ్వింది.

"లే! అన్నం తిను... రా!" అని పిల్చేడు.

లేచి వచ్చి అన్నం తినేసింది. ఆ కంచం కడగబోయింది. "అక్కర్లే"దని చెప్తే అక్కడ పడేసి నించుంది. "వెళ్ళి పడుకో" అన్నాడు. "సరే" అన్నట్టు తల ఊపింది గాని... కదల్లేదు!

"ఎందుకు నిల్చున్నావ్? పడుకో..!"

"నువ్వు కూడా తిను!" అంది.

వేణు కళ్ళు వింతగా వెలిగేయి! అంటే... తను తినలేదని గుర్తించిందన్నమాట! రోజూ ఇద్దరూ కల్సి తినేవాళ్ళమనీ, ఇవాళ తను ఒకర్తె తిందనీ తెల్సింది! 'ఫర్వాలేదు' అనుకున్నాడు. "నాకు ఆకలి లేదు. మజ్జిగ తాగుతాలే!" అన్నాడు. 'అలాగా?' అనే అర్థంతో చూచి, వెళ్ళి పడుకుంది. ఇంతలో... రాజయ్యగారు వాళ్ళు వచ్చారు. తను ఇంకా మెలకువగా వున్నట్టు తెలియకూడదని ంటనే లైట్ తీసి, మంచం మీద పడుకున్నాడు. సిగరెట్ అంటించుకుని అర్ధరాత్రి దాకా ఆలోచిస్తూ ేపేసేడు. శ్యామల చలికి ముడుచుకుని గువ్వపిట్టలా పడుకుంది! లేచి, కాళ్ళ దగ్గర వున్న దుప్పటి మడత విప్పి నిండుగా కప్పేడు!

తెల్లవారుతూనే మాధవయ్య దిగేడు.

"నాన్నా..." అని నవ్వుతూ ఎదురెళ్ళింది శ్యామల.

"బాగున్నావా అమ్మా!" అంటూ ఆప్యాయంగా తల నిమిరి, "నీ ఉత్తరం అందింది నాయనా! సరే... కొన్నాళ్ళపాటు అమ్మాయిని తీసుకెళ్దామని వచ్చాను. నువ్వు చాలా శ్రమ పడుతున్నట్టున్నావు. పోనీ... అమ్మగార్ని కొన్నాళ్ళపాటు వచ్చి వుండమనక పోయావా?" అంటూ ఆదరంగా అడిగేడు.

"అదెలా వీలవుతుంది? ఇంటిదగ్గర వాళ్ళకి కష్టం కాదూ? అయినా... ఎవరు మాత్రం ఎన్నాళ్ళు వుంటారు? ఆ పద్ధతులేవీ సరిగా వుండవు. కానీ... మీరు శ్యామలని తీసుకెళ్ళి కొన్నాళ్ళు వాళ్ళమ్మ గారి చేత పనులు నేర్పించండి. బొత్తిగా గ్లాసులు కడగటం, ఇల్లు తుడవటం కూడా తెలియదు. పని మనిషి రాకపోతే నేనే చేసుకోవాల్సి వస్తోంది. అటు ఆఫీసు, ఇటు వంట... నాకు చాలా ఇబ్బందిగా వుంది!'' వేణు ఉన్నవన్నీ చెప్పేడు.

"నిజమే నాయనా! కానీ... శ్యామలకి చెప్తే చేస్తుంది! మళ్ళీ మనం చెప్పేంత వరకు ఆ పని చెయ్యాలన్న సంగతి గుర్తుండదు! అందుకని - ప్రతిసారి 'నువ్వు ఆ పని చెయ్యి' అని పురమాయించాలి. ఆబ్సెంట్ మైండ్! రోటీనుగా చేసుకుపోవాలనే ఇంగితం లేదు'' అల్లుడి మీద అభిమానం ... కూతురి మీద ఆపేక్ష... ఇద్దరూ బాగుండాలనే ఆరాటం...!

వేణు మాట్లాడలేదు...! స్నానాలు, కాఫీలు అయ్యాక వేణు వంట చెయ్యబోతే మాదవయ్య వారించి తనే చేసేడు. మధ్య మధ్యలో శ్యామలని అది తెమ్మని, ఇది తెమ్మని చెప్తుంటే... ఆమె చేస్తోంది. వేణు అచ్చెరు వొందేడు.

ఆఫీసుకి సెలవు పెట్టి వచ్చాడు. మాధవయ్య అల్లుడికీ, కూతురికీ బట్టలు కొని ఇంట్లోకి కావల్సిన సామాన్లు కొన్ని కొని తెచ్చాడు.

"ఇవన్నీ ఇప్పుడెందుకు?'' అని వేణు నొచ్చుకున్నాడు.

" నా ఆనందం కోసం నాయనా!'' అని మాధవయ్య అనగానే ఊరుకున్నాడు.

మధ్యాహ్నం కూతుర్ని "బట్టలన్నీ తీసుకురామ్మా... సర్దుతాను. మనం ఊరికి వెళదాం! అమ్మ రమ్మంది!'' అనగానే, "నేను రాను. నేను ఇక్కడే వుంటాను!'' అంది కచ్చితంగా.

"మళ్ళీ వద్దాము! ఇప్పుడు అమ్మని చూసి కొన్నాళ్ళయ్యాక రావచ్చును''

"ఊహూ! నేను రాను. అమ్మనే వచ్చి వెళ్ళమను!'' అంది.

"అబ్బబ్బ... అది కాదమ్మా! రాజ్యం నిన్ను చూడాలంది ... అందుకని మనం వెళ్ళి ...'' మాధవయ్య ఏదో చెప్పబోయేడు.

శ్యామల "నేను రాను. నేను ఇక్కడే వుంటాను'' అంది మొండిగా.

"నీ ముఖం! సరేలే... నీకు చెప్పేదేమిటి?" అనుకుంటూ మాధవయ్య బట్టలన్నీ సర్దేసేడు. తర్వాత అతను బయటికి వెళ్ళినప్పుడు...

"ఎందుకు వెళ్ళవు! మీ అమ్మని చూడవా?" అని వేణు అడిగేడు.

"ఉహూ... నేను చూడను. ఇక్కడే వుంటాను!" అంది శ్యామల.

"ఏం? ఇక్కడ బాగుందా? ఎందుకనీ?"

"మరి నువ్వు ఏం తిట్టవు గదా? కొట్టలేదు కూడా! అన్నం వండిపెడ్తున్నావు. మరి... వాళ్ళంతా తిట్తారు. ఎప్పుడైనా కొట్తారు కూడా! అందుకని - నేను ఎప్పుడూ ఇక్కడే వుంటాను. నాకు పెళ్ళి చేసేవు గదా! నీ దగ్గరే వుంటాను ..."

శ్యామల మాటల్లో ఎక్కడో ... ఏదో శక్తి ... కొద్ది కొద్దిగా వేణుని లాగుతోంది! తన దగ్గరే వుంటాననే ఆమె పట్టుదల అతనికి నచ్చుతోంది. నన్ను పెళ్ళి చేసుకున్నావనే జ్ఞాపకం... హృదయానికి ఓదార్పునిస్తోంది. తను ఇన్నాళ్ళు పడ్డ కష్టానికి ఫలితం దక్కుతున్నట్టనిపిస్తోంది!

మాధవయ్య బయటనుంచి రాగానే "పోనీ... రానంటోంది - తర్వాత పేచీ పెట్తుందేమో!" అన్నాడు సంశయంగా వేణు.

మాధవయ్య శ్యామలని చూస్తూ "పిచ్చితల్లి! దాని మనసులో ఉన్నది చెప్పలేక పోతోంది గానీ... నీవంటే దానికి చాలా ఇష్టం నాయనా! ఇంతకుముందు మీవాళ్ళ యింటినుంచి తీసుకొస్తే కూడా ఏడ్చి నువ్వు అక్కడే ఉండమన్నావని చెప్పిందిట! సరే... మీ నాన్నగారు తీసుకొచ్చి దింపేరనుకో! ఒకరోజు ఏదో పెళ్ళి బ్యాండు వాళ్ళలో నిన్ను చూసేనని, నా పెళ్ళివాడు అక్కడెందుకుండాలని... ఒకటే గోల! అతను కాదనీ, ఆ బ్యాండువాడు వేరనీ చెప్పేసరికి మా తాతలు దిగి వచ్చారు. ఉత్త పిచ్చితల్లి!" అని నవ్వి, "రాత్రి మళ్లా నిద్ర వుండదు... కాస్సేపు పడుకో అమ్మా!" అని, శ్యామల పడుకున్నాక తనూ పడుకున్నాడు మాధవయ్య.

వేణు సంఘర్షణలో పడ్డాడు. పడుకుని నిద్రపోతున్న శ్యామలలో కొత్తరూపం చూస్తున్నాడు. మునుపు లేని ఏదో క్రొత్త ఆకర్షణ ఆమెలో కనిపిస్తోంది. హృదయంలో ఏదో అలజడి ... ఘోష! రెండు గంటల తర్వాత మామగారు లేచేక, "పోనీలెండి మామయ్యా! శ్యామలని యిక్కడే వుంచండి! అంతగా తీసుకు రావల్సివస్తే నేనే తీసుకువస్తాను!" అన్నాడు వేణు.

మాధవయ్య తెల్లబోయేడు. ఆ తర్వాత ఆనందాశ్రువులు రాల్చి, "నాయనా వేణూ! నీ మనసు మంచిది! భగవంతుడు నీకు తప్పక మేలు చేస్తాడు!" అని దీవించి, మళ్ళీ శ్యామల బట్టలన్నీ తీసేసి, "అమ్మా... నేను వెళ్ళి వస్తాను జాగ్రత్త! అతను చెప్పినట్టు విని పనులు చేస్తూ వుండు!" అని రిక్షా ఎక్కేడు.

మామగార్ని రైలు ఎక్కించి వచ్చేటప్పుడు దారిలో పూలపొట్లాం కొన్నాడు!!

రాత్రి భోజనం చేసేక శ్యామల పరుపు మీద పడుకున్నప్పుడు... దగ్గర కూర్చుని పూలు అందించేడు. కళ్ళింతింత చేసుకుని ఆ పూలు తల్లో కుక్కుకుంది. "ఆహా! అలా కాదు... నేను పెడతాను" అంటూ తల్లో పాయ తీసి పూలు పెట్టేడు. సంబరపడుతున్న శ్యామలని "నీకు పూలు ఇష్టమా?" అని అడిగితే "ఊ! యిష్టమే! పెళ్ళిలో పూలజడ కుట్టేరు. నాకు చాలా బాగుంది. మళ్ళీ కుట్టలేదు!" అంది అమాయకంగా.

వేణు శ్యామలనే చూస్తున్నాడు. యిన్నాళ్ళకి శ్యామలకి యిష్టమైనవి ఏమిటో తెలుస్తున్నాయి! పూలు యిష్టం! తను యిష్టం!!

"శ్యామలా... ఆరోజు బ్యాండ్‌వాణ్ణి చూసి నన్ను అనుకుని ఏడ్చేవా?"

"ఎప్పుడూ? ఆ! ఆ! మా ఊళ్ళో కదూ? అవును... నువ్వు కాదా? అమ్మ కాదని చెప్పిందిలే!"

"పోనీ... నేనే అయితే ఏం?"

"ఉహూ! నువ్వు నా పెళ్ళివాడివి కదా? మరి... వాళ్ళ పెళ్ళికి ఎందుకు వెళ్ళాలి?"

"వెళ్ళకూడదా?"

"ఏమో?? నాకు ఏడుపు వస్తుంది!"

"శ్యామలా!?" యుగయుగాల నుంచి జగజగాలలో స్థిరంగా నిలిచిపోయే అనిర్వచనీయమైన 'ప్రేమ' ఒక్కటే సత్యమైనదని నిరూపించిన శ్యామలని - చెప్పలేని ఉద్వేగంతో, ఆవేశంతో అభిమానంతో... కరుణ, జాలి, దయ, ప్రేమ... అన్నీ కలిసి పోయిన ఒకే ఒక శక్తి 'ఆర్తి'తో కౌగిలించుకున్నాడు వేణు.

శ్యామల మౌనంగా అతని కౌగిట్లో యిమిడిపోయింది!!

కొన్ని క్షణాల తర్వాత ఆ దివ్యానుభూతి ఛాయలు మిగులుస్తూ ... వేణు కౌగిలి సడలించేడు. మధుర మహోన్నతానుబంధం కలిగిన ఆ శుభవేళ - వేణు శ్యామలని ప్రేమగా చూస్తూ... ముంగురులు సవరించి "శ్యామలా... నువ్వంటే నాకిష్టం! మరి, నేను చెప్పినట్టు వింటావా? నీకు రోజా పువ్వులు, మిఠాయి తెచ్చి పెట్టూ వుంటాను... సరేనా?" పసిపిల్లని లాలించినట్టు లాలనగా అడిగేడు.

"సరే!" అంది.

"మరి... అక్కడ మంచంమీద ఏమిటో గుచ్చుతున్నాయి ... ఇక్కడ పడుకోనా?"

"సరే!"

ఆ తర్వాత వేణు నులివెచ్చని కౌగిట్లో ... పసిపిల్లలా ఒదిగి పడుకుంది శ్యామల.

మతిలేనిదైనా ... అంతర్వాహినిలో పారే ఆమె ప్రేమని చవి చూసిన వేణు ... మొట్టమొదటి సారిగా కళ్ళు తెరిచి ప్రపంచాన్ని చూసిన అనుభూతిని పొందేడు!

'ఇంత కాలం ఎంత పొరపాటు చేసేను?' అనుకున్నాడు... మూగబోయిన మనసుకి శ్రుతి చేస్తే అను'రాగాలు' పల్కుతుందని తెలుసుకున్నాడు.

తెల్లవారేక... ఆ ఉదయం నవరాగ రంజితంగా కన్పించింది వేణుకి!

శ్యామలని దరిచేర్చుకుని కౌగిలిలో బంధించితేనే ఇంత నూతనోత్సాహం పొందితే - జంగా 'పొందు' పొందగల్గిననాడు??... వేణు పులకించిపోతున్నాడు.

ఆరోజు నుంచి వేణు కార్యక్రమాల్లో మార్పు వచ్చింది! శ్యామల సంరక్షణ యావత్తూ తనే ాడసాగాడు... ఆమె స్నానం చేసిరాగానే చీర తనే కట్టేవాడు. పౌడర్ రాసి, బొట్టు పెట్టేవాడు. ఆ సమయంలో నడుం చుట్టూ చెయ్యివేసి, దగ్గరకు తీసుకుని మరీ పెట్టేవాడు. అన్నం ముద్దలు తను తినిపించేవాడు. జడవేసి ముంగురులు సర్దేవాడు. ఇంట్లో ఒక పసిపాపని బుజ్జగించినట్టే చేసేవాడు. సాయంత్రం ఆఫీసునుండి వచ్చేటప్పుడు ... పూలు, పండ్లు, స్వీట్లు తెచ్చేవాడు.

ఒక్కోసారి ... వరండాలో రమ గనుక ఎదురుపడితే అందులో సగం ఇచ్చేసేవాడు. అప్పుడు శ్యామల అలిగేది. ఆ అలక తీర్చడం వేణుకి సరదాగా వుండేది!

మైనపు బొమ్మలాంటి శ్యామలని తన లాలింపుతో, బుజ్జగింపుతో ... కొద్దికొద్దిగ కరిగించటం మొదలుపెట్టి, తనకి[illegible] రీతిలో ... మనిషి ఆకృతిలోకి ... తీసుకురావాలని విశ్వ ప్రయత్నం

చేస్తున్నాడు! సినిమాలు చూపించేడు ... షికార్లు తిప్పించేడు. సుందర దృశ్యాలు, ఏకాంత ప్రదేశాలు త్రిప్పి చూపించేడు. కొత్త చీరలు కొని తనే కట్టేడు ... కొత్త ఫాషన్ జాకట్లు కుట్టించి తనే తొడిగేడు! కొత్తరకం ముడి వేసి అద్దంలో చూపించి శ్యామల మురుస్తూ వుంటే... ముద్దు పెట్టుకునేవాడు.

ఆ ముడి నేర్చుకునేందుకు సురేఖని సలహా అడిగేవాడు.

ఒకసారి సురేఖ వచ్చి శ్యామలని చూసి 'జ్యోతి' కన్నా చాలా నయమనీ, మీ అదృష్టం త్వరలోనే పండుతుందనీ... శుభాకాంక్షలు తెలిపి వెళ్ళింది.

సురేఖ వెళ్ళాక, "ఆమె ఎవరు?" అని శ్యామల నిలదీసింది వేణుని.

"ఎందుకు?" అని రెట్టించేడు వేణు. శ్యామల ముఖం చిన్న చేసుకుని "నాకిష్టం లేదు" అంది.

"మరేం చెయ్యను? నువ్వు మంచి దానవు కాదు ... నేను చెప్పినట్టు వినవు!" అని కవ్వించేడు.

"ఎందుకు వినటం లేదూ? అన్నీ వింటున్నాను కదా?"

"ఉహూ! కాదు" అని నవ్వేడు వేణు.

తొలిరేయి! వసంతాలు పండినవి ఆ రోజు!!

వేణు తన తపస్సు ఫలించిందని విజయగర్వంతో పొంగిపోయేడు.

ఇప్పుడు వేణుకి రోజులు నిముషాల్లాగ గడిచిపోతున్నాయి.

## 20

లక్ష్మికి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి.

'ఆ మెట్రిక్ ఎలాగో గట్టెక్కింది! ఇంక కాలేజీ చదువులు ఎలాగూ చదివించలే'మని పురుషోత్తం సంబంధాలు చూడటం మొదలెట్టాడు. కట్నం ఎక్కువ ఇచ్చుకోనక్కర్లేకుండా ... మంచి సంబంధం రావాలని పురుషోత్తం ఆలోచిస్తున్నాడు. పదిమందికీ చెప్పి వచ్చాడు. పెళ్ళీడు పిల్ల వుందంటే సంబంధాలు వస్తూనే వున్నాయి! ఓ పెళ్ళికొడుక్కి ఓ చెల్లెలుంది. అమ్మాయి చక్కనిచుక్క. అయితే... వాళ్ళు కట్నం ఇచ్చుకోలేరు. కనుక, ఆ అబ్బాయికి లక్ష్మిని చేసుకుంటే వేణుకి మళ్ళీ

పెళ్లి ఆ అమ్మాయితో జరిపితే నయాపైసా ఖర్చు లేకుండా పెళ్ళయిపోతుంది. వేణు ఎటూ శ్యామలతో కాపురం చెయ్యడు గదా? లక్ష్మికి ఆ అబ్బాయి ఎంతో నచ్చాడు. చదువూ చక్కదనం కూడా వున్నాయి. వాళ్ళకి ఒక ఎదిగిన ఆడపిల్ల వుండబట్టి ... కట్నం ఇచ్చుకోలేరు కాబట్టి ... తనకి అంత చక్కని భర్త లభించబోతున్నాడు. వేణు అన్నయ్య వెంటనే శ్యామలకి విడాకులు ఇస్తే ... ఈ సంబంధం చేసుకోవచ్చని ... లక్ష్మి ఒక ఉత్తరం రాసింది వేణుకి.

ఆఫీసు ఎడ్రసుకి కాకుండా ఇంటి అడ్రసుకి రాసింది! వేణు, ఇంటికి వచ్చి డ్రస్సు మార్చుకుని ముఖం కడుక్కొని కూర్చున్నాడు. ఇప్పుడిప్పుడే శ్యామల చిన్న చిన్న పనులు చేస్తోంది. గ్లాసులు, గిన్నెలు కడగటం ... బియ్యం కడిగి తేవటం ... కూరలు బాగుచేసి పెట్టటం ... కాఫీ పొడుం డబ్బా ... పంచదార డబ్బా తీసుకొచ్చి వేణుకి అందించటం వరకు వచ్చింది!

టేబుల్ మీద వున్న కవరు చూసి "ఉత్తరం వచ్చిందా శ్యామలా?" అంటూ కవరు అందుకున్నాడు ...!

"అవును... మధ్యాహ్నం వచ్చింది" అని కాఫీ కోసం గిన్నెలో నీళ్ళు పెట్టింది శ్యామల.

కవరు చించి చదివి ... కోపంతో వణికిపోయేడు. 'వెధవ గుణాలు! శ్యామలని వదిలేయాలిట! మళ్ళీ పెళ్ళి చేసుకోవాలా? ఆనాడు నాకు తెలియకుండా ఈ సంబంధం నిశ్చయించి ... తను ందులు త్రొక్కితే ... శాంతింపచేసి ... ఎలాగో ఒకలాగ శ్యామలని నా దగ్గరికి చేర్చేరు. ఇప్పుడేమో .. విడాకులు ఇచ్చేసేయాలా? లక్ష్మికి కట్నం ఇవ్వలేకపోతే 'గంతకు తగిన బొంతే' ఎవరో దొరుకుతారు. మంచి సంబంధం కావాలనుకుంటే ఎలాగ?' కవరు చింపి ముక్కలు ముక్కలు చేసేడు ...!

"అయ్యో... అదేమిటీ?" అనడిగింది శ్యామల.

"అదా? అదొక పిచ్చి ఉత్తరం!" తేలికగా అనేసేడు.

శ్యామల అలాగే చూస్తూ నిలబడిపోయింది.

వేణు కాఫీ తయారు చేస్తూ .... "అదేం శ్యామలా అలా వుండిపోయేవు?" అనడిగేడు వింతగా.

"మరి... మరి... ఉత్తరాలు కూడా పిచ్చివి వుంటాయా?"

ఫక్కున నవ్వి, "ఇలారా... చెప్తాను..! "అని దగ్గరకి పిల్చి .... "మనుషులు మంచివాళ్ళయిపోతే ఉత్తరాలు పిచ్చివవుతాయి! మరేమో... నిన్ను వదిలేసి నేను మళ్ళీ పెళ్ళి చేసుకోవాలిట! మా లక్ష్మి, అదే... ఆ ఊళ్ళో లేదూ? అది రాసింది. అందుకని చింపేసేను ..." అని చెప్పేడు.

శ్యామల కళ్ళు చెదిరేయి! "మీరు ఇంకో పెళ్ళివారవుతారా? "

చటుక్కున శ్యామలని దగ్గరకి లాక్కుని..., "ఊహూ! నిన్ను వదలను. అందుకే... ఆ పిచ్చి ఉత్తరం చింపేసేను." అన్నాడు ప్రేమగా.

శ్యామల కళ్లు మిలమిలలాడేయి. వేణు తృప్తిగా ఊపిరి తీసుకుని స్ట్రాంగ్‌గా కాఫీ తయారు చేసేడు. ముందు శ్యామల కిచ్చి తను తీసుకున్నాడు.

* * *

'ప్రసాద్' లాంటి కొలీగ్స్... అప్పుడప్పుడు ఓదార్చబోతున్నారు. వేణు నవ్వేస్తే ... వేరుగా ఊహించుకొని... 'ఎందుకోయ్... అంత విరక్తి! హైద్రాబాదులాంటి పట్నంలో నువ్వు ఇలా మడిగట్టుకుని కూర్చుంటావా? పద... స్వర్గసీమల్లో తేలుస్తాం!' అనేస్తున్నా... వేణు నవ్వుతూనే... 'ఇంకా కొంతకాలం ఆగ'మంటున్నాడు... ఏమిటో పిచ్చివాడు! పిచ్చిపెళ్ళాంతో వుంటే ఇతనికీ పిచ్చి ఎక్కింది!' అనేవారు. వేణు మౌనంగా బయట పడేవాడు!

'వాడిపోతున్న మొక్కకి నీరుపోసి బాగుచేయాలనీ ... ఆరిపోతున్న దీపానికి నూనె పోసి వెలగనివ్వాలనీ.... నేను తెల్సుకున్నాను. మీకు చెప్తే ..... మీరు నవ్వుతారు! విలువైన పదాలు బైటికి చెప్పకుండా దాచుకోవాలి !'... అనుకునేవాడు.

వీలు చూసుకొని .... ఒకరోజు రాజారావు ఇంటికి వెళ్ళేడు. ఉష ఇంట్లో వుంది. రేడియో పెట్టుకుని, వింటోంది. తెలుగు పాటలు నచ్చవు! హిందీ ఒక మోస్తర్! ఇక మిగిలిందల్లా... ఇంగ్లీషు మ్యూజిక్ ! .... అచ్చ తెలుగు అందాన్ని అందుకోలేదు! పరభాషా వ్యామోహం... విపరీతం!

"హల్లో ! కమాన్ ! హౌ ఆర్ యు? హౌ ఈజ్ యువర్ వైఫ్ మెంటల్లీ! ఫాదర్ టోల్డ్ మీ ఎవ్వరి థింగ్!!" అంటూ దడదడ వూపిరి తిప్పుకోనీయకుండా వాగడం మొదలెట్టింది!

వేణు మెల్లగా కూర్చుని ... ముందు "ఆనందరావుగారున్నారా?" అని అడిగేడు.

"యస్! డాడీ నిద్రపోతున్నారు" అంది.

'హమ్మయ్య'... అనుకున్నాడు.

"అది కాదు వేణూ! వాటీజ్ నాన్‌సెన్సు! ఆవిడతో నువ్వు బ్రతకడమేమిటీ? ఐ డో వాంటిట్? డైవోర్స్ పడేయి. హాయిగా మరొక మ్యారేజ్ చేసుకో! ఏమిటీ? ఈ ట్వెంటీ ఫస్ట్ సెంచు కూడా నీలాంటి అమ్మమ్మలు వుంటారంటే నాకే ఆశ్చర్యంగా వుంది!" ఉష ఉద్రేకపడింది. వే మెట్లు మీద "హియర్, హియర్" అని చప్పట్లు చరుస్తూ నిల్చున్నాడు రాజారావు.

ఉష చరాలున లేచింది. "యూ ఫూల్!" అనుకుంటూ నేలని గట్టిగా తన్ని, అక్కడినుం ప్రక్కగదిలోకి వెళ్ళిపోయింది.

వేణు కంగారుగా లేచి ఆమె వెళ్ళినవైపు... రాజారావు వైపు మార్చి మార్చి చూస్తూ నిలబ పోయేడు.

రాజారావు మెట్లన్నీ దిగి ... మెల్లగా వచ్చి వేణు భుజం మీద చెయ్యి వేసి "కూర్చో వేణ కంగారు పడకు. ఈ మధ్య నువ్వు తరచుగా రావటం లేదు కదూ? అందుకని - ఈ యింట జరిగే పార్సులు నీకు తెలియడం లేదు. మా నాయర్‌కి, డ్రైవర్‌కి, పెద్ద గుమాస్తాగార్కి, అన్నట్టు మా టైగర్‌కి కూడా మా యింట్లో జరిగే తంతులన్నీ తెలుసు. అందుచేత - నువ్వేం ఆశ్చర్యప బెదిరి పోయి, నిలువుగుడ్లు వెయ్యాల్సి వుంటుంది! అందుకని, అప్పటివరకు ఆగు!" అని నవ్వేడు

సోఫాలో కూర్చుని సిగరెట్ తను అంటించుకుని, వేణుకొకటి ఇచ్చేడు...!

వేణు అయోమయంగా, భయంగా చూసేడు.

'మై డియర్ ఫ్రెండ్... వేణూ! నీకివాళ ఓ బ్రహ్మాండమైన నిజం చెప్పేయదల్చుకున్నాను...' అని ఆగి సిగరెట్ నుసి యాష్ట్రేలో దులుపుకున్నాడు!

ఇంతలో... ఆనందరావుగారు గదిలో నుంచి బయటికి వస్తూ "ఎవరూ... వేణూ వచ్చాడా?" అని పలకరింపుగా నవ్వేరు.

వేణు లేచి విష్‌చేసి మళ్ళీ కూర్చున్నాడు. ఆనందరావుగారు వచ్చి వేణు ప్రక్కనే కూర్చున్నారు. వేణు వెంటనే సిగరెట్ యాష్ట్రేలో పడేసేడు! ఇంతవరకు ఆనందరావుగారి ఎదురుగా తాగలేదు!

రాజారావు ముఖం చిట్లించుకుని..! కొద్దిగా అటు తిరిగి కూర్చున్నాడు.

ముగ్గురిదీ విచిత్రమైన పరిస్థితి!

తన 'విజయాన్ని' గురించి చెప్పుకుందామని వచ్చాడు వేణు!

తన 'విడిపోడాన్ని' గురించి చెప్పాలనుకుంటున్నాడు రాజారావు.

'తన పెద్దరికాన్ని ఇద్దరి దగ్గర ఎలా నిలుపుకోగలనా?' అనుకుంటున్నారు ఆనందరావు గారు! ఏ ఒక్కరూ నోరు విప్పలేని గంభీరత నిండుకుంది ..!

ఇంతలో ఉష - హీల్స్ టకటక లాడేయి! హేండ్‌బ్యాగ్ ఊపుకుంటూ ... "నేను మా ఫ్రెండ్ ఇంటికి వెళ్తున్నాను డాడీ? వచ్చేసరికి లేట్ అవుతుంది. నా కోసం వెయిట్ చెయ్యకండి! వేణూ... బై బై" అనేసి టకటక గుమ్మం దాటింది.

"అమ్మా... ఉషా!" నీర్సంగా పిలిచిన ఆనందరావుగారి కంఠం మెల్లగా ఆగిపోయింది.

రాజారావు హేళనగా నవ్వేడు. సిగరెట్ దమ్ము గట్టిగా పీల్చి, "ఆడపిల్ల గుమ్మం దాటకుండానే వుండాలి గానీ ... దాటేక వెనక్కి తిరిగి రాదు మైడియర్ అంకుల్! మీరు పెంచిన విధానం అలా వుంది. మొక్కై వంగక, మానై వొంగునా? ఇప్పుడు ఆమె సర్వ స్వతంత్రురాలు. లేటైనా అసలు రాకపోయినా... చేసేదేం లేదు!"

"రాజా! అలాంటి మాటలనకు. నీకెంత కోపం వున్నా... ఉషని మరీ అంత చులకన చేసి మాట్లాడకు! ఏ తండ్రయినా పిల్ల బాగునే కోరుతాడు గానీ... చెడిపోవాలనుకోడు. నేను ఉషని మంచి కండిషన్‌లోనే పెంచేను. మ్యారేజ్ అయ్యేవరకు మా ఉష ఎప్పుడూ నన్ను ఎదిరించి మాట్లాడలేదు"

"అంటే? నావల్లనే చెడిపోయిందంటారా? నేనూ ఆ మాటే అంటాను. మా మ్యారేజ్ కాక ముందు ... నేను ఎంత మంచి స్టూడెంట్‌గా, ఎంత నెమ్మదిగా వుండేవాడినో తెలుసా? ఈ వేణునే అడగండి!"

రాజారావు అదిరింపుకు వేణు బెదిరిపోయేడు.

"నిజమే రాజా! కాదనను, కానీ ... పొరపాట్లు సర్దుకుని పోవాలి! ఒకరిని ఒకరు ఎంచుకుంటే సౌమ్యత, సఖ్యత ఎలా కుదురుతాయి?"

"హూ! ఇంకా సౌమ్యత, సఖ్యత ఎక్కడున్నాయి? నన్ను ఫూల్, రాస్కెల్ ... అనే మీ దేవి సభ్యత ముందు తల వంచుకుని పడుండడానికి ... నేను మీ టైగర్‌ని కాదు!" అని విసు లేచి ... "అన్ని విషయాలు కోర్టులోనే తేల్చుకుందాం! వేణూ... వస్తారా!" అని సిగరెట్ యాష్ట్ర విసిరి చకచకా మేడ ఎక్కి వెళ్ళిపోయేడు.

ఐదు నిముషాల నిశ్శబ్దానంతరం ఆనందరావుగారే తేరుకుని వేణును చూసి పల నవ్వేరు.

వేణు కూడా అర్థం లేని నవ్వుతో సర్దుకుని కూర్చున్నాడు.

చెప్పడానికి భావశూన్యం, మాట్లాడ్డానికి భాష శూన్యం అయినప్పుడు... అలాంటి అ లేని నవ్వులే మిగులుతాయి.

"ఒక ఆట వేద్దాం వేణూ! చాలా రోజులైపోయింది" అంటూ జవాబుకి ఎదురుచూడకుం చెస్బోర్డు, కాయిన్స్ తెప్పించారు... నాయర్‌ని పిల్చి.

ఆట మంచి పట్టులో వుండగా "నా ట్రయిల్స్ సక్సెస్ అయ్యాయి సార్!" అన్నాడు వేణ

ఆటలో లీనమైన ఆ 'సార్' "ఊ! ఊ! గెలుపు ఎప్పుడూ నీదేకదుటోయ్...!" అని నవ్వేర

వేణు చిన్నగా నవ్వి, "అది కాదు సార్! శ్యామల విషయం నే చెప్తున్నది" అన్నాడు.

రక్కున ఆట ఆపి, "వాడ్డూ యూ మీన్? అంటే - శ్యామల... అదే, శ్యామలతో నువ్వు?

"అవును సార్! ఆమె నుంచి రెస్పాన్స్ దొరికింది"

"వ్వాట్?!! ఐయామ్ వెరీ గ్లాడ్ ... వెరీ గ్లాడ్ ..." అంటూ వేణు చెయ్యి పట్టుకుని ఊపేసేరు ఆనందరావుగారు.

"వేణూ... నిజంగా నిన్ను చూస్తే నాకు చాలా గర్వంగా వుంది. నీలాంటి వాళ్ళు నూటికి ఒకళ్ళు వున్నా చాలు. ఎందుకొచ్చిన డబ్బు..? తాత్కాలిక వ్యామోహాలు తీరుతాయే తప్ప మనసుల్ని కలపలేదు. నువ్వు ఏ శక్తివల్ల శ్యామలతో రక్తి కల్గి, ఆమెను కదిలించగల్గేవో ... ఆ శక్తి డబ్బుకు లేదు! చూసేవు గదూ? ఇంత హోదా, దర్జా, ధనం, కీర్తి, ఎన్ని వున్నా ... ఉషని, రాజాని బంధించలేక పోతున్నాయి. హూ! వాళ్ళు ఏం కానున్నారో, నేనేం చెయ్యాలో నాకు తోచటం లేదు. వెనకటికి ఓ డాక్టర్ అన్నాడుట... ఇంతమంది కంతిలు (గడ్డలు, కురుపులు) కోసేను గాని, నా కంతి అంత

బాధ ఏదీ వుండదు. అని...! అలాగే వుంది నా పరిస్థితి...!! ఎన్నో వందల తీర్పులు చెప్పేను గాని... నా కన్నకూతురి విషయంలో ఏ తీర్పూ చెప్పలేకపోతున్నాను. ఆల్‌రైట్! జరగాల్సింది జరుగుతుంది. దానికేం గాని - నువ్వు నిజంగా అదృష్టవంతుడివోయ్!" అని మరోసారి అభినందించి ... నాయర్‌కి చెప్పి కాఫీలు తెప్పించారు...!

కాఫీలు తాగి ... ఆట ముగించేసరికి రాజా క్రిందికి దిగి వచ్చేడు. వేణు కూడా ... ఆనంద రావుగారి వద్ద సెలవు పుచ్చుకుని రాజారావుతో కల్సి బయటికి వచ్చాడు.

దారిలో చాలా విషయాలు చెప్పేడు రాజారావు.

"ఉష ఎంత మాడ్రన్ అయినా బొత్తిగా విచ్చలవిడిగా తిరగడం, మరీ ఫాషనబుల్ డ్రెస్సులు వెయ్యడం ... తనని కేర్ చెయ్యకపోవడం... అన్నిటికన్నా ముఖ్యం - తన తల్లిదండ్రులు 'లేని' వారనీ తన వల్లనే నేను బ్రతుకుతున్నాననీ... ఫ్రెండ్స్ ముందర వాగడం - ఛ! ఛ! భరించలేక పోతున్నాను. ఇంకో సంగతి ... పిల్లలు పుట్తే తనకి స్వేచ్ఛ వుండదని ... ఇప్పటికి రెండుసార్లు ఎబార్షన్సు చేయించుకుంది? ఎంతకాలం ఇలా వుండాలి? ఇంకా స్వేచ్ఛ కావాలా? ఆడ లక్షణం లేని మొగరాయుళ్ళా వుంటే ఇంతకాలం నా మెతకతనం వల్లనే భరించాను. పాపం... నా మీద మా నాన్న ఎన్నో ఆశలు పెట్టుకుంటే... అన్నీ వమ్ము చేసి, ఇక్కడ బందీ అయిపోయాను. నేను మా వాళ్ళని చూసి రావాలే తప్ప - తనకి నామోషీ! వాళ్ళకి ఆత్మాభిమానం కనుక యిక్కడికి రారు. పెద్దింటికి, పేదింటికి జరిగే 'టగ్గాఫ్ వార్' నా విషయంలోనూ జరిగింది! ఇక నేను మా వాళ్ళ వైపుకే మొగ్గుతున్నాను. తనకీ మోజు తీరింది గనుక... వదిలేస్తుంది..." నిట్టూర్చేడు!

సుల్తాన్‌బజార్‌లో ఇద్దరూ విడిపోయారు.

వేణు బరువెక్కిన హృదయంతో ఇల్లు చేరేడు.

వరండాలో రమ కన్పించి నవ్వింది.

"మరేం! బాబాయ్! నీకు బాబు పుట్టాట్ట గదూ?" అనడిగింది.

గుండె జల్లుమంది వేణుకి ...!

"ఎవరు చెప్పారు రమా?" ఆశ్చర్యంగా అడిగేడు.

"ఇందాక మా అమ్మ పనిమనిషితో అంటోంది"

పన్నీటిజల్లు ... ఫౌంటెన్‌లో నుంచి చిమ్మితే !! వేణుకి అలాగే అనిపించింది.

ఇంతలో... వాళ్ళమ్మగారు రమని కసిరి, "అన్నీ తొందరే దీనికి!" అని నవ్వి, "అవును వేణూ... అమ్మాయి నెల తప్పింది!" అని, "వాళ్ళమ్మగార్కి వాళ్ళకి తెలియపర్చు! సంతోషిస్తారు!" అన్నారు.

వేణు మరిక వరండాలో ఆగలేక గదిలోకి వెళ్ళేడు.

రమని వాళ్ళమ్మ లోపలికి లాక్కెళ్ళింది.

గదిలో శ్యామల మంచం మీద పడుకుని వుంది.

"శ్యామలా! పడుకున్నావేం? ఒంట్లో బాలేదా?" మంచం మీద కూర్చుంటూ అడిగేడు.

"ఊఁ! ఇందాక కళ్ళు తిరిగి మెట్లమీద పడ్డాను. మరేమో... అక్కయ్యగారు నీళ్ళు చల్లి ... వేడి కాఫీ ఇచ్చారు...! ఇంకా... యింకా... నాకు ఓ చిన్నబాబు పుట్టాడని చెప్పేరు" అని నవ్వింది.

అమాంతం శ్యామలని రెండు చేతుల్తో పైకి ఎత్తి క్రిందికి దించి గాఢంగా కౌగలించుకున్నాడు వేణు...! శ్యామలకి కళ్ళు తిరిగినట్టయి... అలాగే వేణుని గట్టిగా పట్టుకుంది!

'చాలు! ఈ అనుభూతి , ఆనందం చాలు!'... అనుకున్నాడు.

ఆ రాత్రి శ్యామల నిద్రపోయేక ... టేబుల్ దగ్గర కూర్చుని తండ్రికి ఉత్తరం ఇలా రాసేడు.

"నాన్నా! లక్ష్మికి ఇంకొక సంబంధం చూడండి. కాస్త నల్లగా, లావుగా వున్నా... వెర్రిబాగుల వాడైనా... ఫర్వాలేదు... కట్నం కోరకుండా ఎవరు చేసుకుంటామన్నా సరే! రెండు మూడేళ్ళు అయితే అదే సరిపోతుంది. ఉదాహరణకి... మీ కోడలు శ్యామలనే చూడండి. ఇప్పుడు చక్కగా పని పాటలు చేస్తోంది. అంతే కాదు ... మీకు త్వరలో మనవణ్ణో, మనవరాల్నో ఇవ్వబోతోంది. కనుక వెంటనే లక్ష్మికి కూడా ఎవర్నో ఒకర్ని చూసి ముడిపెట్టండి."

ఉత్తరం మడిచి కవర్లో పెడుతూ ... 'ఇంక వేరే సూరేకారం అక్కర్లేదు ... తారాజువ్వలా ఎగిరి పడతారు యింట్లో అందరూ' అని నవ్వుకున్నాడు. మరొక ఉత్తరం మామగార్కి రాసేడు.

"మామగార్కి- మీ శ్యామల నన్ను జయించి ... తిరిగి నాకే విజయాన్ని అందించింది. మీకు త్వరలో మనువణ్ణో, మనుమరాల్నో ఇస్తుంది. కానీ - ఒకటి గుర్తుంచుకోండి ... ఆమెను ఇప్పట్లో పంపను. ఇక్కడే అన్ని ఏర్పాట్లూ చేస్తాను.

ఇట్లు -"

రెండు ఉత్తరాలు అడ్రసులు రాసి టేబుల్ మీద పెట్టి - ఆ రాత్రంతా నిద్రపోతున్న శ్యామలను పదే పదే చూస్తూ గడిపేడు.

## 21

ఆ కిడ్స్ షాప్‌లో ఓ చక్కని బొమ్మ కొని ప్యాక్ చేయించి బయటికి వచ్చింది సురేఖ! 'కీ' ఇస్తే దోగాడే బొమ్మ అది.

ఈవేళ వేణుగోపాల్‌గారి అబ్బాయికి మొదటి పుట్టినరోజు పండుగ! ఎంతలో రోజులు తిరిగి పోయేయి.

రిక్షా దిగి లోపలికి వెళ్ళింది. ఇంటిముందున్న ఖాళీ స్థలంలో చిన్న షామియానా వేసేరు. మధ్యగా దారి వదిలి అటు ఇటు కుర్చీలు వేసి ... ముందుకి చిన్న టేబుల్, ఓ చిన్న కుర్చీ వేసి అందులో వేణుగోపాల్ కొడుకు ... 'శ్యామ్‌గోపాల్' ని కూర్చోబెట్టేరు. చిన్నసూటు ... ఉంగరాల జుట్టు ... మిలమిలలాడే కళ్ళు... అమాయకంగా... ముద్దుగా... అందర్నీ చూస్తూ కూర్చున్నాడు. రమ - సందడే సందడి! బాబు ఏ కాస్త కదిలినా, వంగినా "నాన్నా! బాబూ! పడతావు జాగ్రత్త!" అంటూ హెచ్చరిస్తోంది.

కొలీగ్స్ అంతా వచ్చారు...! ముందు వరసలోనే ప్రసాద్ కూర్చున్నాడు. సిగరెట్ తాగుతూ పిల్లాణ్ణి రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. ఆ చూపులకి భాషే వుంటే? దాని అర్థం... ' ఓ మతి లేనిది - సంసారం చేసి, ఇంత చక్కని బాబుకి తల్లయిందా? ' అని.

ప్రసాదుకు ఇద్దరాడ పిల్లలు. మూడోసారి మగపిల్లాడు పుట్టి - పోయాడు...! తల్లికి కాన్పు కష్టమని ... ఆపరేషన్‌తో పాటు ... ట్యూబెక్టమీ కూడా చేయించాడు ఇప్పుడు మిగిలిన ఆడపిల్లలు కర్రెబొగ్గులు. తల్లి పోలిక. ఆవిడకి డబ్బుంది. ఇంట్లో భార్యా విధేయుడైన ప్రసాదు, బయట ... ఒకటో రకమైన కేళీ!

వేణుని చూస్తే... యిప్పుడిప్పుడే 'జెలసీ' లాంటిది కల్గుతోంది! అది బాబు దగ్గర మొదలైంది. సురేఖ తిన్నగా నడిచి లోపలికి వెళ్ళింది.

శ్యామల నీలిరంగు పట్టుచీరలో ... మ్యాచింగ్ జాకెట్టుతో ... ఫాషన్ ముడి ... ముడికి ఓ పక్క పువ్వు ... చేతికి గాజులు, వాచీ ... కుదురుగా కూర్చుని వుంది. కామేశ్వరి కూడా వచ్చింది మనుమడి పుట్టినరోజుకి !

సురేఖని చూడగానే ... "రండి" అని లేచి చాపమీద కూర్చోబెట్టింది శ్యామల! ఆ ట్రైనిం వేణుగోపాల్ యిచ్చేడు.

అసలు... శ్యామల వేషం అంతా వేణు తన స్వహస్తాలతో చేసేడు. నిజానికి - శ్యామ ఇప్పుడు చేసుకోగలదు మెల్లమెల్లగా! కానీ, వేణుకు అలవాటై పోయింది. ఆ శ్రమలో అతనికేద 'థ్రిల్' అనిపిస్తుంది. కామేశ్వరి ముఖం తిప్పుకుని 'వెధవ ఖర్మ' అని తిట్టుకుంది. ఆ సమయంలో.. అక్కడ నిల్చోలేక వెళ్ళిపోయింది. కొడుకు స్వయంగా కోడలికి మేకప్ చేయడం... ఆవిడ చిరాకనిపించింది.

సురేఖ - శ్యామల పిలవగానే నవ్వుతూ వచ్చి ఆమె ప్రక్కనే కూర్చుంది.

బయట 'షామియానా'లో వేణు అందరికీ కాఫీలు, టిఫెన్లు ట్రేలో పెట్టి అందిస్తున్నాడు "పెళ్ళికి ఇవ్వాల్సిన పార్టీ... కొడుకు పుట్టేక ఇస్తున్నావ్రా!" అని నవ్వుతున్నారు ఫ్రెండ్స్. ఇంతలో.. గేటు ముందు కారు ఆగింది... ట్రే పట్టుకుని నిల్చున్న వేణు ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయేడు

ఉష - కారు దిగుతోంది!

* * *

రెండురోజుల క్రితం వేణు ... తన కొడుకు పుట్టినరోజు పండుగ బాగా చెయ్యాలనుకు కొలీగ్స్ అందర్నీ పిలిచేడు. నవ్వుకున్నవాళ్ళు నవ్వుకున్నారు. సంతోషించేవాళ్ళు సంతోషించేరు అయినా... వేణు చలించలేదు. 'ఎవరి నైజం వాళ్ళది' అని సరిపెట్టుకున్నాడు.

చాలాకాలం నుంచి ప్రియమైన స్నేహితులు గనుక ఉషని, రాజారావుని పిలవాలని కూడ అనుకున్నాడు.

కానీ... వాళ్ళిద్దరూ ఇప్పుడు కలిసి లేరు. రెండు మూడు నెలల క్రితం కోర్టు ద్వారా విడాకుల తీసుకుని వేరుగా వుంటున్నారు! కోర్టులో కేసు విచారణ జరుగుతున్న రోజుల్లో... ఆనందరావుగారి మూడోసారి హార్ట్ అటాక్ వచ్చి తట్టుకోలేకపోయేరు. ఆయన పోయిన నెలలోనే ఉషని' రాజారావుని కోర్టు విడగొట్టింది, చట్టసమ్మతం చేస్తూ!

ఒకే నెలలో ఇటు తండ్రిని శాశ్వతంగా పోగొట్టుకుని, అటు భర్తని వదిలేసిన ఉష ఒంటరిగ అంత ఇంట్లో వుండలేక మరొక చిన్న ఇల్లు అద్దెకు తీసుకుంది. రాజారావు ... ఎక్కడున్నాడ కూడా తెలియదు ... సిటీ వదిలేసి వెళ్ళిపోయాడని తెలుసు - అంతే!

'ఉషారాజ్ కంపెనీ' ... నడిపేవాళ్ళు లేక ... కొందరు సేట్‌సాబ్‌లు విడివిడిగా ఆ బ్రాంచీలను కొనేసుకున్నారు. ఆ నేమ్‌బోర్డులు మారిపోయేయి! ఉషా వాళ్ళ మేడలో ఎవరో ముస్లిమ్‌లు రెంట్‌కి తీసుకుని ... ఇంటి అందాన్ని వాళ్ళిష్టం వచ్చిన పద్ధతిలోకి మార్చేసుకున్నారు.

ఇప్పుడు ఉష ... ఒక చిన్న ఇంట్లో నాయర్ అవసరం లేకుండా ... తనే వంట చేసుకుంటూ... కాలక్షేపం చేస్తోంది. నమ్మినబంటు కుక్క... అమ్మకుండా మిగుల్చుకున్న కారు... ఆమెకింకా పాత స్మృతులు! ఆ స్థితిలో వున్న ఆమెను పిలవాలా, వద్దా... అని వేణు మధన పడ్డాడు. తీరా పిలవక పోతే... మరీ బాధపడి ఏమైనా అంటుందేమో? ... అనుకుని పిలవడానికే వెళ్ళేడు.

'పాపం! ఒంటరిగా, దిగులుగా, బాధగా వుంటుందేమో'... అనుకుంటూ వెళ్ళిన వేణు ... నల్గురు ఫ్రెండ్స్ మధ్య కిలకిలా నవ్వుతూ... జోక్సు వేసుకుంటూ... పేకాడుకుంటున్న ఉషని చూసి నాలిక్కరుచుకున్నాడు. అందులో ఇద్దరు మగాళ్ళు, ఇద్దరు ఆడవాళ్ళు. వాళ్ళంతా అన్ మారీడ్!

స్లీవ్‌లెస్ బ్లౌజ్... బాబ్డ్‌హేర్, నైలెక్స్ చీర... మెళ్ళో మంగళసూత్రం లాంటి... లాకెట్ చైన్! చేతులు బోసిగా వున్నాయి... చెవులకి మాత్రం గాజులంత రింగులున్నాయి! బహుశా - చేతిగాజులే చెవులకి ఎక్కినట్టున్నాయి. బొట్టు వుందో, లేదో తెలియదు. పెదవులకి మాత్రం లిప్‌స్టిక్ మెరమెర లాడుతుంది.

కార్డ్సు అందుకునేందుకు ముందుకు వంగినప్పుడు పైట చెరుగు జారిపోయింది. తల పైకి ఎగరేసుకుంటూ పైట సరిచేసుకుంటున్నప్పుడు ... గుమ్మంలో నిల్చున్న వేణుని చూసి

"హ ...ల్లో ... వేణూ!? హౌఆర్‌యూ?" అంటూ లేచి రమ్మని పిలిచింది. ఆ వాతావరం వేణుకి కూర్చోవాలనిపించలేదు! అంతకన్నా ఆ పరిస్థితిలో వున్న ఉషతో మాట్లాడాలనిపించలే. అంటే బాగుంటుంది. పిలిచేక తప్పనిసరిగా వెళ్ళి కూర్చున్నాడు... ఆ ఫ్రెండ్సందరిని ఇంట్రడ్యూ చేసింది. అందరూ పెద్దింటి పిల్లలు... బాధ్యతల్లేకుండా హాయిగా తిరుగుతున్న వాళ్ళే. వాళ్ళం క్లబ్ ఫ్రెండ్స్. ఏకంగా ఇంటికే తెచ్చుకుంది.

"ఆ! ఏమిటి వేణూ... మీ ఆవిడ ఏమంటోంది? మొత్తానికి భలేవాడివే. జీవితా లాక్కొస్తున్నావ్? మీ మాస్టర్ గోపాల్ ఏమంటున్నాడూ? కాస్త వాణ్ణి ఇప్పట్నుంచే వాచ్ చేస్తూ వుండు తల్లి మనస్తత్వం వస్తుందేమో!" అని నవ్వింది.

వేణుకి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. 'పసివాణ్ణి ఎంత మాట అంది? ఇంత జరిగినా ఇంకా పొగరు అణగలేదు. పుట్టుకతో వచ్చిన బుద్ధి!' అనుకుని తనని కంట్రోల్ చేసుకుని పైకి చిన్నగా నవ్వేడు.

"పర్వాలేదు ఉషా! వాళ్ళమ్మ మనస్తత్వం వస్తే ... నా మనస్తత్వం గల భార్య దొరుకుతుంది. ఎటొచ్చీ ... విడిపోకుండా వుంటే చాలు!" అన్నాడు ఓరగా ఉషని గమనిస్తూ. ఆమె ముఖం ఎర్రనైంది.

"అంటే? మీ ఉద్దేశం ... వైఫ్ అండ్ హజ్బెండ్ మధ్య ఏ గొడవలున్నా, వాళ్ళు చచ్చినట్టు కలిసే వుండాలంటారా? బాప్‌రే!" అందొక లేడీ ఫ్రెండ్.

"సపోజ్ - మీకేమైనా పేచీలు వస్తే... కలిసి వుండగలరా?" అని అడిగేడొక... ప్రబుద్ధుడు.

"మాకెప్పుడూ అలాంటివి రావనే నా నమ్మకం!" వేణు స్థిరంగానే అన్నాడు.

"మీ వైఫ్ అంత మంచిదా?" ఒకరు ప్రశ్నించేరు.

"ఊహూ! వీరే చాలా మంచివారై వుంటారు!" అన్నారింకొకరు.

ఉష కల్పించుకుని ... "అదేం కాదులెండి... వాళ్ళ శ్రీమతి ఓ పిచ్చిమొద్దు! ఇప్పుడిప్పుడే వేణు ఆమెను మనుషుల్లోకి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాడు. ఆమెకు స్వతంత్రమైన ఆలోచనా పరిధి ఏదీ లేదు ..." అంది, కొంచెం ఉడక్కునేలా.

"మరేం! మీలాగ...!" అన్నాడు లకీమని.

"అంటే మేము...' అంటూ అందుకోబోయిన ఫ్రెండ్స్‌ని "స్టుపిట్ నాన్‌సెన్స్! ఎందుకొచ్చిన ు! ఆ! ఇంతకీ, ఏం వేణూ, ఏదైనా పనిమీద వచ్చావా?" అంటూ ప్రసంగం మార్చింది ఉష.

వేణు నవ్వి, 'పనిలేని పని - ఏదో... మావాడికి ఎల్లుండి బర్త్‌డే! చిన్న పార్టీ ఇద్దామని పిలవడానికి వచ్చాను. మీకు వీలైతే రండి! మీ ఫ్రెండ్స్ కూడా వస్తే సంతోషం! మరి, నేను వస్తాను" అని లేచి ఉష ఇంక ఏం చెప్తున్నా వినిపించుకోకుండా వచ్చేసేడు.

'బుద్ధిలేని పని చేసేను!' అనుకున్నాడు. ఆ తర్వాత! ఆమె వస్తుందని కానీ, రావాలని కానీ... తను ఆశించలేదు. అదొక డ్యూటీ క్రింద చేసేడు. కానీ, చిత్రంగా రాజారావు మాత్రం మర్నాడు సాయంత్రం నాంపల్లి దగ్గర కనిపించి పల్కరించేడు. తనకి బాంబేలో జాబు దొరికిందనీ, ఆనాటి మెరిట్ మార్కులు ఇన్నాళ్ళకి పనికి వచ్చాయనీ... ఇక మీదట వ్యక్తిత్వం గల మనిషిగా

బ్రతుకుతాననీ... చెప్తూ... 'ఇంక మీదట చాలారోజుల వరకు నీకు కన్పించనురా వేణూ' అన్నాడు జీరబోతున్న గొంతుకతో !

వేణు ఆప్యాయంగా రాజారావుని పట్టుకుని ... "ఫర్వాలేదురా! మన మనస్సులెప్పుడు కలుస్తూనే వుంటాయి!" అని, "రేపు మా బాబు బర్త్‌డే పార్టీకి రా! రా!" అని పిల్చేడు.

"అరే... ఏమిటీ! మీ హీరోకి అప్పుడే వన్ యియర్ నిండిందా? అబ్బ!" అని, "తప్పకుండా వస్తాను" అన్నాడు.

మాట తప్పకుండా వచ్చాడు. వచ్చి వెనుక సీట్లో కూర్చున్నాడు.

అప్పుడే ఉష కారు దిగి లోపలికి వచ్చింది. బెత్తెడు వెడల్పు జరీ వున్న ఆకుపచ్చ రంగు కంచి పట్టుచీర, ఎర్రని జాకెట్టు, పెద్దముడి... రాళ్ళ దుద్దులు... గుండ్రని ఎర్రటి బొట్టు ... పమిట నిండుగా కప్పుకుని కుర్చీల పక్కనుంచి వస్తుంటే.. పెద్దింటి పుణ్య ముత్తయిదువ అతి అణకువతో... వస్తున్నట్టుంది.

వేణు ట్రే పట్టుకుని ఎదురెళ్ళి ..."వచ్చారా... ఉషా! చాలా సంతోషం!" అని పల్కరించేడు. ఆమె చేతిలో వున్న గులాబీరంగు అట్టపెట్టెనుండి రెండో చేతిలోకి మార్చుకుంటూ .. నవ్వి, "ఎందుకు రానూ?" అంది. బాబుని బుగ్గల మీద నిమిరి వెనక్కి చూసింది. రాజారావు కనిపించేడు. అతని చేతిలో చారలున్న ప్యాకెట్ వుంది. ఇవ్వాలని అతను లేచి వస్తూ... ఉష రావడం గమనించి అడుగు దూరంలో ఆగిపోయేడు. 'ఎన్నాళ్ళికి తాను కోరుకున్న విధంగా అలంకరించుకుంది?' అనుకున్నా

ఉష గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

లోపల సురేఖ... శ్యామల... కామేశ్వరి... ఇంకా ఇతరమైన వాళ్ళున్నారు. ఎవరూ తెలియ అందుకే నిలబడిపోయింది. శ్యామల ఒక నిమిషం తరువాత ... లేచి వచ్చి, "నిలబడే వున్నారే యిలా కూర్చోండి!" అన్నది.

ఎవరో యింట్లో బంధువు కాబోలు... అనుకుని ఉష వెంటనే కూర్చుంది. ఎవరొచ్చి మర్యాదగా కూర్చోబెట్టమన్నారు గదా... అనుకుని కూర్చోబెట్టింది శ్యామల.

కాఫీలు, టిఫెన్లు తీసుకున్నారు. ఇంతలో బాబుని తీసుకుని వేణు లోపలికి వచ్చి ఉ చూపిస్తూ... "ఆంటీకి నమస్తే చెప్పు" అన్నాడు.

బాబు ముద్దుగా 'నమస్తే' చెప్పాడు.

ఉష వెంటనే ప్యాకెట్ అందించి షేక్‌హాండ్ ఇచ్చింది.

శ్యామల నవ్వి... "అంత బహుమతులెందుకండీ? ఇవిగో... ఈ అక్షింతలు తీసుకుని దీవించండి... చాలు!" అంటూ గుప్పెట్లో నుంచి అక్షింతలు ఉష చేతిలో పోసింది.

ఉష అయోమయంగా 'ఎవరా?' అని చూస్తుంటే ...

సురేఖ శ్యామలని మెచ్చుకోలుగా చూసింది.

వేణు గర్వంగా, చెప్పరాని ఆనందంతో శ్యామలని చూస్తూ 'నేను మలచుకున్న ఈ శిల్పం... ఇంతటి సంస్కారాన్ని దాచుకుందా?' అనుకున్నాడు.

"మా మిసెస్! శ్యామల!" అని పరిచయం చేసేడు.

"ఉష అనీ... మా స్నేహితురాలు!" అని శ్యామలకీ, సురేఖకీ చెప్పేడు.

ఉష, శ్యామలని చూస్తూ ... అక్షింతలు జారవిడవబోయి గబుక్కున బాబుమీద చల్లింది.

'ఏమిటీ? వేణు భార్యా? ఈమెకు మతిలేదంటే ఎవరు నమ్ముతారు?' అనుకుంది.

"అవునమ్మా! మా కోడలే... చాలాకాలం మతి సరిగా ఉండేది కాదు! పాపం.. మావాడు నితో చాలా అవస్థలు పడి... వైద్యాలు చేయించుకుని... యిప్పుడిప్పుడే కాస్త మనుషుల్లో పడేలా యించేడు...!" కామేశ్వరి మాట పూర్తి కాకముందే వేణు బయటికి వెళ్ళిపోయేడు.

సురేఖ వెంటనే - "కాదండీ... వైద్యాలకేం? శ్యామల స్వతహాగా మంచి మనసున్న మనిషి మబ్బుతెరలు కప్పుకున్న ఆమె మనసును వేణుగోపాల్‌గారు అర్థం చేసుకుని ఆమెను మనిషిగా దిద్దేరు. ప్పుడు శ్యామలగారు మనకన్నా ఎదిగిపోయేరు! అవునా శ్యామలా..?!" అని నవ్వింది సురేఖ.

"ఏమో... నాకేం తెలుసు? మీరు చెబుతున్నారు!" తనూ నవ్వింది.

కామేశ్వరి ముఖం తిప్పుకుని ... అక్కడినుండి వెళ్ళిపోయింది.

పార్టీ ముగిసి ఉష బయటికి వచ్చేసరికి రాజారావు వెళ్ళిపోయేడు.

ఉష కారు ఎక్కుతూ వుంటే ... బాబుని ఎత్తుకుని వేణు గేటు దాకా వచ్చాడు. వెనకాల శ్యామల కూడా నిల్చుంది.

"వేణూ! నేను మొన్న నిన్ను నొప్పించేను కదూ? కాని - అది నా ఆత్మవంచన! గొప్పగా బ్రతికి ఒక్కసారిగా నల్గురిలో చులకన కావడం ఇష్టం లేక... నన్ను నేను వంచించుకుంటూ నలుగుర్ని వంచించాలని వృధా ప్రయత్నం చేస్తున్నాను నిజం ఏమిటో నాకు తెల్సు!! నేను ఏ స్థితిలో వున్నానో ... ముందు ముందు ఏ పరిస్థితులు ఎదుర్కోవాలో కూడా తెలుసు! తలుచుకుంటే భయం! అందుకే - పైకి గంభీరంగా నటిస్తున్నాను. ఒంటరి ఆడది... డబ్బున్నా సంఘంలో బ్రతకడం కష్టం! మరి, ఈ పొరపాటు మా ఇద్దరిలో ఎవరివల్ల జరిగిందో గానీ ... ఎంత డబ్బున్నా మేము కలిసి వుండలేకపోయాం!

ఇప్పుడు మిమ్మల్ని చూస్తుంటే ముచ్చటేస్తోంది. మనిషికీ, మనిషికీ మధ్య వుండవలసిన దేమిటో లీలగా తెలుస్తోంది. జన్మజన్మలకి బంధించి వుంచగల్గేది ఏమిటో కూడా ... తెలుస్తూనే వుంది. నువ్వు శ్యామలని చూసే చూపులో, పిలుపులో... ప్రతి చర్యలో... అది వ్యక్తమవుతూనే వుంది. అదే అదే... మా ఇద్దరిలో ఏ ఒక్కరికీ లేకపోయింది.! ప్చ్! ప్చ్! గతం మళ్ళీ రాదు! మీరిద్దరూ బాబుతో కలకాలం ఇలాగే హాయిగా వుండాలని కోరుతున్నాను. గుడ్‌నైట్!" అనేసి కారు స్టార్టు చేసింది.

వేణు బాబు నొకవైపు ఎత్తుకుని... మరొక చేత్తో శ్యామలను ఆర్తిగా దగ్గరికి తీసుకున్న ఆ సమయంలో... వీధి లైట్లన్నీ ఒకసారి వెలిగేయి!

**- అయిపోయింది -**

ప్రేమ త్యాగాన్ని కోరుతుందని ఎవరన్నారో గాని . . . అది నిజం కాదు.

[illegible] పటానికి కల్పించబడిన ఓ బూటకమది.

స్వార్థం లేనిది ప్రేమే లేదు.

సజానికి ప్రేమలో ఉండేటంత స్వార్థం మరి దేంట్లోనూ ఉండదు.

నిజమైన ప్రేమికులు లోకం మొత్తాన్ని నాశనం చేసైనా సరే...

తాము ఒకటవటానికి ప్రయత్నిస్తారు.

అది సాధ్యం కానప్పుడే - దాన్ని సాధించుకునే 'సత్తా' ఆ ఇద్దరిలో

ఏ ఒక్కరికైనా లేనప్పుడే - 'త్యాగం' అన్న భావనని ఆశ్రయించటమో,

'కలసి బ్రతకలేకపోయినా - కలిసైనా చద్దాం...' అంటూ

ఆత్మహత్యకి సిద్ధపడటమో చేస్తారు.

ఏం చేసినా ...

తమ ప్రేమని మాత్రం అక్కడితో సమాధి చేస్తారు.

వీటన్నిటికీ కారణం -

సమాజాన్ని ఎదిరించే ధైర్యం లేకపోవడం !

అంతటి స్థైర్యం కలిగే స్థాయికి

వారి ప్రేమ చేరుకోకపోవటం !!

.... నైతిక విలువల ముసుగులో ఆత్మవంచనవు వైరస్ సోకిన మనసులకి,

సూడో మోరల్ వేల్యూస్ అడుగున అవకాశవాదపు ఇన్ఫెక్షన్ అంటిన మనుషులకి

మానవత్వపు విలువల 'యాంటీ బయోటిక్' అద్దుతూ ...

ప్రేమని మరో కోణంలో స్కానింగ్ చేస్తూ...

**యస్వీ కృష్ణ** సంధిస్తున్న సెన్సేషనల్ సాహిత్య శరం ...



యస్వీ కృష్ణ

**లిల్లీ**

THE PAIN
THE PASSION